స్నేహానికి మనోహరమైన రూపకల్పన...
ధర్మానికి మహోన్నతమైన రూపచిత్రణ...





పద్మశ్రీ వారి

# ప్రాణమిత్రులు

నిర్మాత.. వి. వెంకటేశ్వర్లు • దర్శకత్వం.. సి. పుల్లయ్య

కథ, మాటలు.. ముళ్ళపూడి వెంకటరమణ
సంగీతం.. కె. వి. మహదేవన్. ఫొటోగ్రఫీ.. సెల్వరాజ్
కళ.. ఎస్. కృష్ణారావు • సూరన్న • కూర్పు.. యస్. ఎం. శంకర్
స్టూడియో.. శ్రీ సారథి













శ్రీ ఫిలింస్ రిలీజ్

IVKR

# జీవన్ టోన్

గవర్నమెంటు
రిజిస్టరు నెం. 218726



పత్రికలలో ప్రకటనచేసిన ఔషధాలను సేవించి, ఫలితాలను పొందని వారు అనేకు లున్నారు. కాని జీవన్‌టోన్‌ను కొనుక్కొని దానిని ఉపయోగించి ప్రయోజనం పొందండి. జీవన్‌టోన్ కేవలం వనస్పతి కొవ్వు నుంచి తయారు చేయబడినది. జంతువుల కొవ్వు చేరుటవల్లనే ఈ అనుకోనటువంటి బలిష్టతకు కారణం అని కొందరు అనుకోవటం పొరపాటు.

## జీవన్‌టోన్ గుణములు:

ఎంత మంచి ఆహారము తిన్నా ఎముకల పోగువలె, బలహీనంగా ఉండే వారు కొంతమంది ఉన్నారు. అట్టి వారికి జీవన్‌టోన్ మంచి బలాన్ని, లావును, బరువును ఇస్తుంది. ఆకలి లేనివారికి మంచి జీర్ణశక్తి నిస్తుంది. ఇది బలహీనత, కాళ్లుచేతులు తేలిపోవుట, తలతిరుగుడు, రక్తహీనతలను పోగొట్టి, పరిపూర్ణమైన దేహారోగ్యాన్ని, పుష్టిని ఇస్తుంది. శరీరం ఎరుపుఛాయ పొందటానికి జీవన్‌టోన్‌తో వాడుకోలు తీసుకోండి. ఆరోగ్యవంతులకు కూడ జీవన్‌టోన్ మంచిది.

జీవన్‌టోన్ తీసుకొన్నప్పుడు వీరు కొంత శరీరవ్యాయామం చెయ్యటం అవసరం. లేకపోతే మీ శరీరం అనవసరంగా లావెక్కుతుంది. కావలసిన బరువు, బలిష్టత చేరిన వెంటనే జీవన్‌టోన్ సేవించటం నిలుపటం మంచిది. స్థూలకాయులు జీవన్‌టోన్ తీసుకొనుట మంచిదికాదు. అట్టివారు జీవన్‌టోన్ తీసుకుంటే మేము బాధ్యులం కాము. స్త్రీలు బహిష్టుకాలంలో తీసుకోనకూడదు. ఇతర వివరాలు మందుతో పంపబడతాయి.

**సెం: 454 గ్రాములు. రూ. 10/-** *(పోష్టు చార్జీలు అదనం)*

## స్కిన్ లీమ్స్

ముఖ్యాన సౌందర్యం కలిగియుండటం వరప్రసాదం. స్కిన్‌లీమ్స్ మీ చర్మాన్ని, మొటిమలు, స్ఫోటకపు మచ్చలు, వివర్ణత, కోతలు, శోభినుంచి కాపాడుతుంది. స్కిన్‌లీమ్స్ ముఖమండలి మడ్డి తొలగించిన తరువాత వాడవలయును. మీరు ఏ పౌడరుగాని, పౌడరును గాని వాడవచ్చును. స్కిన్‌లీమ్స్ ఒక కోర్సు రు. 12/-

# JOTHI HOSPITAL

Phone No. 440206
POST BOX No. 1413, 32, VENKATANARAYANA ROAD, MADRAS-17.
స్థానిక డాక్టరు: డాక్టర్ దామోదరం, M. A., I. A. D. S.

# భారతదేశపు అందాల రాణి

## మిస్ నకీ జెహాన్ యింటి వద్ద విశ్రాంతి తీసుకోవడానికి - మర్ఫీ మిని-మాస్టర్.... ట్రాన్సిస్టర్లలో ఎంతో అందమైనది

అవును మీరు కూడా మర్ఫీ మీద ఆధారపడవచ్చు. ఎందువలననంటే మర్ఫీ యింజనీర్లు ప్రతి మర్ఫీ సెట్టును, తమ వాడుకకోసం అయినట్లు డిజైను చేస్తారు—అది శ్రేష్ఠమైన పనితనానికి మీకు గ్యారంటీ.

# మర్ఫీ

## రేడియోస్ అండ్ ట్రాన్సిస్టర్స్

*Murphy sets the standard*



# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 12—5—'67
ప్లవంగనామ సం॥ వైశాఖమాసం శుద్ధ తదియ

సంపుటము : 59 సంచిక : 35

స్థాపితము :
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 22.40 |
| 6 మాసముల చందా | 11.20 |
| 3 మాసముల చందా | 5.60 |

ఇతరదేశాలకు
ఓడమీద (Sea Mail)

| | |
|---|---|
| సంవత్సర చందా | 42.00 |
| అర్ధసంవత్సర చందా | 21.00 |

## విషయానుక్రమణిక





# కేంద్రమంత్రులకు సూచనల రూపంలో శ్రీమతి గాంధి లేఖలు-రేడియో, వార్తాసంస్థలద్వారా వాటి ప్రచారం!

పార్లమెంటరీ ప్రజాస్వామ్యం కాబినెట్ వ్యవస్థలో శ్రీమతి గాంధీ కేంద్రంలోని తన సహచరులందరికీ ఉత్తరాలు రాయటం అన్న ఓ కొత్త పద్ధతిని అవలంబించారు. ఈ లేఖలకు దేశవ్యాప్తంగా ప్రచారం లభించడం కోసం రేడియో, వార్తా సంస్థలకు వాటిని క్రమం తప్పకుండా అందిస్తున్నారు. ఈ కొత్తపద్ధతి కొన్ని ఆసక్తికరమైన సమస్యల్ని రేకెత్తించింది. మొదట ప్రధానికి, ఆర్థిక సంబంధమైన ఆహారం, వాణిజ్యం, పరిశ్రమలశాఖల మంత్రులకు కనీసం ఆర్థిక శాస్త్రం ప్రారంభమాత్రాలైనా తెలుసా? భారతదేశం యొక్క పరిశ్రమల విధానం అంటే ఏమిటో తనకు తెలియపరచవలసిందిగా శ్రీమతి గాంధీ ఎన్నిక చేసుకున్న మేధావులలో ఒకరు తమ మంత్రిత్వశాఖను కోరారట. సాధారణ ఆర్థిక విషయాల్లోనూ, ముఖ్యంగా వాణిజ్యంలోనూ గట్టివాడుగా ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన రాజా దినేష్‌సింగ్ తప్పనిసరిగా ఎగుమతులుండాలని వాదించారు. ఇక బాబూ జగ్‌జీవన్‌రాంగారి సంగతి: ఆయన తంతి తపాలా శాఖలో ఉన్నప్పుడు ఓ 'పెద్ద ముందంజను' తీసుకురావాలనుకున్నారు. కాని ఆ తర్వాత ఆ శాఖను సరియైన పద్ధతికి తీసుకు రావడానికి అయిదు సంవత్సరాలు పట్టింది. ఆయన రైల్వేమంత్రిగా ఉన్నప్పుడు కూడా ఎన్నో విధ్వంసాలు జరిగిన సంగతి కూడా అందరికీ తెలిసిందే. ఆహార, వ్యవసాయశాఖ భవిష్యత్తు ఇక ఎదురు చూడవలసింది. శ్రీమతి గాంధీగారికి ఈయన గర్వకారకులు. శ్రీమతి గాంధీ మనందరికీ గర్వకారకులు. ఇందులోని అసలు విషయం దాదాపు అందరు మంత్రులు హేమాహేమీలైన రచయితలను పెట్టుకుంటారు, వారు అమర్చిపెట్టిన, చక్కగా కూర్చిన ఉపన్యాసాలను ఛాతీ విరుచుకుంటూ ధారాళంగా చదవటం జరుగుతుంది.

ఇక రెండోది - ఈ మహోపన్యాసాలను ప్రచురించడం ఎందుకు? ప్రధానికీ రాజాదినేష్‌సింగ్ లేక ఫకృద్దీన్‌అలీ గార్లకు మాటలులేవా? వారంతా మామూలుగా అందరికీ తెలిసిన 'కిచన్ కాబినెట్' సభ్యులే. వీరు, ఇంకా 'అతిముఖ్యవ్యక్తులు' అనదగిన శ్రీయుతులు ఇందర్‌గుజ్రాల్, రమేష్‌థాపర్‌లు వాస్తవంగా దేశాన్ని పాలిస్తున్న 'జ్ఞాననిధులు', లేక ప్రధానికి తన మంత్రివర్గాన్ని తనయిష్టం వచ్చినట్లు నడిపించడం కష్టమనిపించిందా? అలా అనుకోడానికి వీల్లేదు. ఎందుకంటే ఒక్క ఉపప్రధాని మినహా తతిమ్మావారందరూ శ్రీమతి గాంధిగారిమాటకు అవుననే వారే. లేకపోతే శ్రీమతి గాంధిగారి ఆర్థికవ్యవహార పరిజ్ఞానాన్ని ప్రదర్శించడానికా ఈ లేఖలు ప్రచురిస్తున్నది? ఆమె ప్రతిభావిశేషాలను ప్రజలెరుగకపోలేదు, ఆమె సాధించిన ఘన కార్యాలను మరువనూలేదు. మరి ఈ ఉత్తరాల ప్రచురణ, జాతీయస్థాయిలో చర్చలకు అవకాశం యివ్వడానికా? అలా అనుకోడానికీ వీల్లేదు ఎందుకంటే ఆ లేఖలు మంత్రులకు సూచనలమాదిరిగా ఉన్నాయి. అవి ఒక గుడ్డివాడు మరో గుడ్డివాడికి దారి చూపించగలడని నిరూపిస్తున్నాయి. ఈలేఖలగురించి శ్రీమతి గాంధీగారు ఏమనుకుంటున్నారోగాని ఢిల్లీలో మాత్రం నవ్వులాటగా ఉంది. ఈ లేఖల్లోని విషయాలను చర్చించుకోడానికి కాబినెట్ అనువైనచోటు. రాజ్యాంగ నిబంధనల ప్రకారం అది ఉమ్మడిబాధ్యతగల దేశంలోని నిర్ణయాలు తీసుకునే పెద్ద సంఘం. ప్రజల్లో యిలాంటి ప్రదర్శన చేసేకంటే తన పథకాన్ని చర్చ నిమిత్తం కాబినెట్‌లోనే పెట్టి ఉండవచ్చు. మంత్రుల సంఘంలోని అందరు సభ్యులు ఏక కంఠంతో బహిరంగంగా మాట్లాడాలన్నది ఉమ్మడి బాధ్యత సారాంశం. ఏ విధానంపై అభిప్రాయ భేదాలున్నా స్వేచ్ఛగా, నిర్మొహమాటంగా కాబినెట్‌లో చర్చించుకుని పరిచేసుకోవాలి. ఎందుకంటే పత్రికలకు ప్రవేశంగాని, అందులోని చర్చలు బయట పడటానికిగాని అవకాశం లేదుకదా. ప్రధాని ఎప్పుడైనా తమసూచనలను కాబినెట్‌లో చర్చ నిమిత్తం తీసుకువచ్చారా? ఆమె అల్పసంఖ్యాకవర్గంలో ఒకరా? మరెందుకు తమ సూచనలను యిలా లేఖలద్వారా సహచరులకు తెలపటం, వాటిని తెలుసుకుని ప్రజలు ఆమోదించాల్సిన అవసరం లేదుకదా? అది రాజ్యాంగసమ్మతం కాదు. ఒకసారి కాబినెట్ ఒక నిర్ణయం తీసుకున్నదంటే అందులోని ప్రతి సభ్యుడూ— తాను రాజీనామా చేయదలిస్తే తప్ప— దానికి కట్టుబడి ఉండాలి. కాబినెట్ తీసుకున్న నిర్ణయాలకు ప్రధానికికూడా సమమైన బాధ్యత ఉంటుంది.

శ్రీమతి గాంధీ తమ తండ్రిగార్ని అనుకరించి ప్రతినెలా పత్రికా గోష్ఠిని ప్రారంభించారు. కాని అవి రాణింపుకురాలేదు. తర్వాత నెలనెలా 'ప్రతివ్యక్తికీ' రేడియో ప్రసంగం ఆరంభమైంది. కానీ ఆ పద్ధతికూడా ఎవర్నీ ఆకట్టుకోలేకపోయింది. ప్రస్తుతం ఆమె సలహాదారులు 'వ్యక్తినుంచి మంత్రివరకూ లేఖలు' అన్నదాన్ని రూపొందించారు. అది నవ్వుల పాలవుతున్నది. మరో కొత్త 'నాటకం' కోసం ప్రస్తుతం వేట జరుగుతూ ఉంది.

* * *

జాతీయచర్చ, పార్టీ ప్రచారం ప్రస్తుతం అధ్యక్షుని ఎన్నిక దృష్ట్యా జరుగుతున్నది. పార్టీ విప్‌లను ఉపయోగించినా కాంగ్రెస్‌లోని వోట్లు ఒకరికో, ఇంకొకరికో పడిపోగలవని ఊహాగానాలు చేస్తున్నారు. ఈ పోటీ ముసుగులో గుద్దులాటకాదు. నిజమైన పోటీ యిది. ఉదాహరణకు యిక్కడ ఓ ప్రశ్న చర్చకు వచ్చింది. అందులో పార్టీతో నిమిత్తం లేకుండా ముస్లిముల వోట్లన్నీ డాక్టర్ జాకిర్‌హుస్సేన్‌గారివేనని, అదే లెక్కన ఆంధ్రులు ఆంధ్రుడికి, ఇంకా తేలిగ్గా చెప్పాలంటే హిందువు హిందువుకి

పోటుచేయరా? అన్నదానికి సమాధానంగా హిందువులకు సంబంధించినంతవరకూ వాళ్ళు విడిబడి ఉన్నంతవరకూ చీలికలుంటాయని, పడిపోయినప్పుడు ఐక్యంత ఉంటుందని అన్నారు.

ఇక చర్చలోని మరో అంశం: శ్రీమతి గాంధీగారు డాక్టర్ జాకీర్‌హుస్సేన్‌గార్ని ఎన్నుకోడాన్ని గురించి. డాక్టర్ జాకీర్ హుస్సేన్ విద్యావేత్తగానే ఉంటున్నారు కానీ రాజ్యసభకు సరైన అధ్యక్షుడుగా ఎప్పుడూ లేరు. ఆయన అత్యవసరపరిస్థితిలో ఉన్న దేశాన్ని ఎలా ఆదుకోగలరు?

మరొకటి, హర్యానా కేంద్రంలో ఎప్పుడూ సుస్థిరంగా ఉంటుంది. ఉదాహరణకి బాబూ జగ్‌జీవన్‌రామ్, సేఠ్ గోవింద్‌దాస్‌గార్ల నాయకత్వం క్రింద కాంగ్రెస్‌లో, హిందీ అనుకూల వర్గాల వారు, అలాంటి ఆలోచనలనే కలిగి ఉన్న వారిని జనసంఘ్‌లో, వచ్చేనెల భాషాబిల్లు ప్రసక్తి లోక్‌సభ సమావేశంలో వచ్చినప్పుడు చూడవచ్చు. డాక్టర్ జాకీర్‌హుస్సేన్‌గారు, ఒక వేళ ఎన్నికైతే, అలాంటి సందర్భంలో ఏం చేస్తారు? శ్రీ ఎం. వి. పైలీ తాను వ్రాసిన పుస్తకంలో భారత రాజ్యాంగం ఇలాంటి సందర్భాలలో ఏమని వివరిస్తోందో ఈ క్రింది విధంగా రాశారు:

"భారతదేశానికి అదృష్టవశాత్తు ప్రస్తుతం స్థిరమైన ప్రభుత్వం ఉంది. ఆ ప్రభుత్వం పార్లమెంట్ విశ్వాసాన్ని చూరగొన్నది. కానీ యిలాంటి సంతోషకరమైన పరిస్థితి ఎల్లప్పుడూ ఉంటుందన్న సిద్ధాంతం ఏమీలేదు. ఉదాహరణకు మంత్రుల సంఘం పార్లమెంట్ విశ్వాసాన్ని పోగొట్టుకుంటే లేక దానిలోని కలహాల వలన, స్వార్థంవల్ల విశ్వాసం దెబ్బతింటే అలాంటి పరిస్థితులలో మంత్రుల సంఘంతో రాష్ట్రపతి సంబంధాలు యిరకాటంలో పడ్తాయి. పార్లమెంట్‌కి సంబంధించినంతవరకూ సంఘం స్థానాన్ని రాష్ట్రపతి కనిపెడుతూ ఉండాలి. అలాగే సంఘానికి సంబంధించినంతవరకూ ప్రధాని స్థానాన్ని రాష్ట్రపతి గమనిస్తూ ఉండాలి. సంఘం పార్లమెంట్ విశ్వాసాన్ని పోగొట్టుకున్నప్పుడు రాజీనామా యివ్వడానికి బదులు దిగువ సభను పూర్తిగా ఎత్తివేయమని సంఘం సలహా ఇస్తుంది. ఆసలహాను రాష్ట్రపతి పాటిస్తారా? ఈ ప్రశ్నలకు సమాధానం అధికారంలోఉన్న పార్టీ, పార్లమెంట్ తప్ప అధ్యక్షుడు యివ్వరని ఎవరో పొరపడవచ్చు. కానీ కానీ ఈ పరిస్థితిలో రాష్ట్రపతి చర్య ఏవైపుకైనా మొగ్గవచ్చు. ఈ పరిస్థితిని విచక్షణతో సమర్థించుకోగలగాలి. రాష్ట్రపతి రాజకీయ దృక్పథం ఉన్నవారయితే ఆయన యిలాంటి క్లిష్టపరిస్థితిని ఆసరాగా తీసుకొని రాజకీయ అభిమానం ప్రదర్శించి మంత్రి వర్గాన్ని ఎత్తివేయడమో, స్థాపించడమో చేయవచ్చు.

ఇలా రెండురకాలుగా హద్దుల్ని నిర్ణయించడానికి అవకాశం ఉంది. మొదటిది మంత్రులసంఘం సలహా ననుసరించి ఎప్పుడూ ప్రవర్తిస్తూండవచ్చు. యిక రెండవది మరో మంత్రివర్గంద్వారా పరిపాలన అసంభవమని తెలుసుకొని, ఆయన సంఘం సలహాను ఒప్పుకోకపోవడం అన్నది అభియోగాన్ని ఎదుర్కోనవలసిన పరిస్థితిని తెస్తుంది. ఈ రెండిటిమధ్య చిన్నదారి ఒకటుంది అదేమంటే ఆయన తనకు తనే అధికారి. అందులో ఆయన సంఘంసలహాకి బద్ధులుకారు. ఆయనపైవచ్చేఅభియోగానికి తావుండదు. ఈ హద్దుల్లో ఆయన తన యిష్టప్రకారం మంత్రివర్గం సలహా పాటించకుండా తాను రాష్ట్రపతిగా పదవీ స్వీకారంచేసే రోజుతీసుకున్న ప్రమాణాన్ని— "రాష్ట్రపతి కార్యాలయాన్ని సక్రమంగా నడిపించడానికి, రాజ్యాంగాన్ని, న్యాయాన్ని పరిరక్షించి, ఆదుకోడానికి, నా సేవను భారతప్రజల సంక్షేమంకోసం వినియోగిస్తాను" — అనుసరించి ఆయన వ్యవహరించవచ్చు. దాన్ని రూపొందించిన వారు ఏదైనా ఏర్పాటును కల్పించి ఉన్నట్లయితే, అది రాష్ట్రపతి అన్ని పరిస్థితులలో మంత్రివర్గం సలహా ప్రకారం వర్తించాలన్నదానికి కట్టుబడి ఉండేలా చేస్తుంది.

రాష్ట్రపతి ఎలాంటి సందర్భాలలో తన విచక్షణను ప్రదర్శించి తన నిర్ణయాధికారాన్ని ప్రదర్శించవచ్చో వివరించి ఈ చర్చను ముగిద్దాం. మొదట పార్లమెంట్‌లో ఏ పార్టీకి సరైన మెజారిటీ రానప్పుడు రాష్ట్రపతి తన యిష్టవచ్చిన వ్యక్తిని ప్రధానిని చేయవచ్చు. మన దురదృష్ట

(10 వ పేజీ చూడండి)

## లోకం పోకడ

—ఇంతకిముందే జస్టిస్ సుబ్బారావు పార్లమెంటుకి రాజ్యాంగాన్ని సాంఘిక, ఆర్థిక, సంస్కరణలకోసం మార్చే హక్కు లేదనే తీర్పు ఇచ్చారు. ఈ తీర్పు ప్రకారం భూస్వాములు.....భూస్వాములుగానూ, బీద రయితులు బీదరయితులుగానూ ఉండిపోతారు.

15—4—67 'బ్లిట్జ్'

* * *

ఉత్తర బొంబాయి పోటరీ కవున్సిల్ ఉప అధ్యక్షుడు శ్రీ గులాబ్‌జోషి గుజరాతీవారంటాడు శ్రీ వి. కె. కృష్ణమీనన్ ఈశాన్య లోకసభ ఎన్నికలనుంచి విరమించుకునికాంగ్రెస్ అభ్యర్థి శ్రీమతి తారాసప్రె గెలవటానికి తోడ్పడమని అభ్యర్థించారు

16—4—67 'సండేస్టాండర్డ్'

* * *

—సంపూర్ణ మహారాష్ట్ర సమితి మళ్ళీ మీనన్‌ని ఘనంగా బలపరుస్తోంది.

23—4—67 'లింక్'

* * *

—ప్రజల కోరికలనీ, ఆశయాలనీ దృష్టిలో ఉంచుకుని రాజ్యాంగంలో చెయ్యవలసిన మార్పుల విషయంలో శ్రీ సుబ్బారావు మార్పు ప్రమాదకరమనే వైఖరి ప్రదర్శించారని మర్చి పోరాదు.

22—4—67 'మెయిల్ స్ట్రీమ్'

* * *

—శ్రీమీనన్ జాతీయగౌరవానికీ, వికాసానికీ చిహ్నం కాబట్టి (సంపూర్ణ మహారాష్ట్ర) సమితి ఆయనని పూర్తిగా బలపరుస్తోంది

22—4—67 'పేట్రియాట్'

* * *

—చైనా కమ్యూనిస్టు పార్టీ అధ్యక్షుడు మావో త్సే—టుంగ్ ఈక్రింది విధంగా అన్నట్లు ఇక్కడ బహిరంగంగా చెప్పుకుంటున్నారు—'సోవియట్ యూనియన్‌లో మరొక విప్లవం అవసరం కాబట్టి 'పీకింగ్ విప్లవం కమిటీ' వారు మాస్కోలో రెండవ విప్లవానికి అనుకూలంగా ఉండే విధంగా పురోభివృద్ధి చెందాలి.

22—4—67 పి. టి. ఐ. వార్త.

* * *

—కాంగ్రెసుఅధ్యక్షుడు శ్రీ కె. కామరాజు ఇంకా మూడు నాలుగు నెలదాకా బహిరంగ సభలలో మాట్లాడరు.

23—4—67 యు. ఎన్. ఐ. వార్త.




హెల్ముట్ స్ప్రింగర్ వెళ్లిపోయాడు. గదిలో 'వేడి' కొంత తగ్గింది.

"పోతే పోయాడు. పట్టి పిరికి మనిషి. ఒక డ్రింక్ పుచ్చుకుందామా?"

మూడు నిముషాల తర్వాత........

"చెడువార్త విన్నాను. మన స్నేహితుడు మిస్టర్ స్ప్రింగర్‌కి ప్రమాదం జరిగింది........"

"మెట్ల మీద నుంచి దొర్లి చచ్చిపోయాడు."

"మిస్టర్, నే దిగేలోపలే ఆ మెట్లని బాగు చేయించండి"

"హో, హో.........."




ముఠా నాయకులకి గోల్డ్‌ఫింగర్ మీద గౌరవం, భయం అధికం అయ్యాయి..........

"మిస్టర్ స్ప్రింగర్ చావుని డెట్రాయిట్‌లో అపార్థం చేసుకుంటారని భయంగా ఉంది......"

"ఆ భయం లేదు. అక్కడ చావు ఒక పెద్ద సంబరం... ....."

"నిజమే— అదీకాక పోవలసినవాడేగా........"

"ఈ ప్రాజెక్టు యుద్ధంతో సమానం! చేత కానితనం, ద్రోహానికి అవకాశం సహించలేము!"




'ఆపరేషన్ గ్రాండ్‌స్లామ్' సమావేశం అయింది. ఇక మిగిలిన పని మొదలయింది.....

"నీటి సప్లయిలో వేసే ఈ మందు జి. బి.— అదెంత తొందరగా పని చేస్తుంది?"

"దాన్ని గురించి భయపడకు......"

"1943లో జర్మనులు నరాల మీద పనిచేసే విషాలని కనిపెట్టారు— 'ట్రయిలోన్' విషాలు. జి. బి. వాటిలో అతిశక్తివంతమయింది. నా దగ్గర కావలసినంత ఉంది........"

"మనం ఫోర్ట్‌నాక్స్‌కి వచ్చేసరికి ఆ వూరు జనం అంతా చచ్చిపోయయినా ఉంటారు, లేదా అశక్తంగా పడి ఉంటారు. ...... మిస్టర్ బాండ్!"

"మీకు పిచ్చెక్కింది!"




"మీరు నిజంగా 60,000 మందిని చంపేస్తారా?"
"ఏంకే? అమెరికాలో కార్ల క్రింద పడి ప్రతి రెండేళ్ళకీ అంత మంది చస్తారు........"




'గోల్డ్‌ఫింగర్!— మీరు చాలా చెడ్డవారు ...!'
"గొడవ చెయ్యకండి— పని ఉంది!"




"ఈ రాక్షస కార్యక్రమాన్ని ఆపగలిగిన వాడిని నేనొక్కడినే! నా మీద రాత్రింబవళ్ళు కాపలా ....!"




బాండ్ ఈ దోపిడీని ఆపటానికి చివరి ప్రయత్నం చేశాడు
"అసలు మీరు 500 టన్నుల దొంగ బంగారం ఎక్కడ దాస్తారు? ఇదేమన్నా తమాషా అనుకున్నారా?"




"కాకతాళీయంగా, వర్జీనియాలోని నార్‌ఫాక్‌కి 'స్వర్డ్‌లోవస్క్' రకం రష్యన్ యుద్ధ నౌక ఒకటి 'స్నేహ ప్రచారం' కోసం వస్తుంది ."




"'డి—1' నాడు అది నన్నూ, నా బంగారాన్ని క్రోన్‌స్టాట్‌కి తీసుకు పోతుంది! మిస్టర్ బాండ్ నేను ఈ దేశాన్ని వదిలి వెళ్ళిపోతున్నాను - అమెరికా బంగారు గుండెతో!"




మర్నాడు బాండ్ కాగితాల కట్టలతో కుస్తీ ప్రారంభించాడు
"ప్రతి ఇబ్బందినీ ఎదురు చూశారు— ప్రతి వివరాన్నీ పరీక్ష చేశారు, నిజంగా గోల్డ్‌ఫింగర్ ప్రతిభ ఇంతా అంతా కాదు!"




"రేపు, నేనూ తక్కిన అయిదుగురు నాయకులూ ఒక చార్టర్ చేసిన విమానంలో ఫోర్ట్ నాక్స్‌ని తనిఖీ చెయ్యటానికి వెడుతున్నాము మీరూ రండి మిస్టర్ బాండ్........"




("ఎలాగో అలాగ ఇక్కడ ఒక సందేశం పంపగలనేమో..... ...")

(ఇంకా ఉంది)

# వోటర్ల తీర్పు

ఏప్రిల్ 23వ తేదీ ఈశాన్య బొంబాయి ఉప ఎన్నిక జరిగింది. సార్వత్రిక ఎన్నికలలో శ్రీ కృష్ణమీనన్‌ని, శ్రీ అగాస్కర్ (జనసంఘం అభ్యర్థి)ని వోడించిన శ్రీ బార్వె హఠాన్మరణంవల్ల ఏర్పడిన ఈ ఎన్నికలో శ్రీ కృష్ణమీనన్ తిరిగి ఇండిపెండెంటుగా కాంగ్రెసు అభ్యర్థిని ఎదిరించారు. ఈసారి జనసంఘంవారు తమ అభ్యర్థిని నిలబెట్ట లేదు. లెక్కకిరాని ఇతర ఇండిపెండెట్లని ఎవరూ అంతగా పట్టించుకోలేదు. పోటీ అనేది కాంగ్రెసు అభ్యర్థిగా నిలబడిన కీ.శే. బార్వె సోదరి శ్రీమతి తారాసప్రె, ఇండిపెండెంటు అభ్యర్థి శ్రీ మీనన్ మధ్యనేనని స్పష్టం అయింది.

మొదటిసారి శ్రీ బార్వె శ్రీ మీనన్ మీద సుమారు పదమూడువేలవోట్ల మెజారిటీతో గెలిచారు. ఈ సందర్భంలో శ్రీ అగాస్కర్‌కి సుమారు డెబ్బయిఎనిమిదివేల వోట్లు వచ్చాయి.

ఉపఎన్నికలో మొదటిసారి పడినన్ని వోట్లు పడనేలేదు. కాని, శ్రీమతి సప్రె శ్రీ మీనన్‌ని ఇంచుమించు పదిహేడువేల వోట్ల తేడాతో వోడించారు. ఫలితం వెలువడగానే శ్రీ మీనన్ తమ అపజయానికి కొన్ని కారణాలు వివరించారు. మరాఠీ తీవ్రాభిమానమే మూలసిద్ధాంతంగా కల 'శివసేన' దుర్మార్గులు: జనసంఘం, స్వతంత్రపక్షాల మంత్రులు తమ వోటమికి తోడ్పడ్డాయన్నారు. అంతేకాక, ఆయన తన పాత నియోజకవర్గంలోని భాగంలో తనకే మెజారిటీ వచ్చిందన్నారు—దేశంలో తక్కిన చోట్లలోవలెనే ఇక్కడకూడా నియోజకవర్గంలో కొన్నిమార్పులు జరపవలసి వచ్చింది.

'శివసేన' ప్రాంతీయ దురభిమానాన్ని చాటే ఉద్యమంకాదని ఎవరూ అనలేరు. కాని, శ్రీ కృష్ణమీనన్ కూడా 'మహారాష్ట్ర సంపూర్ణ సమితి' అనే ప్రాంతీయ దురభిమానాన్ని ప్రదర్శించే సంస్థతో పొత్తు చేసుకున్నారు. ఈ నియోజకవర్గంలోఉన్న దక్షిణభారతీయులు చాలామంది శ్రీమీనన్‌కే వోటు వేశారనటంలో సందేహంలేదు. ద్రావిడ సంస్కృతినే పరమార్థంగా చాటే ద్రావిడ మున్నేట్రకజగం నాయకుడు శ్రీ అన్నాదురయి శ్రీ మీనన్‌ని బలపరిచారు. ఇతర రాష్ట్రాలలో 'కాంగ్రెస్—ఇతర' ప్రభుత్వాల ముఖ్య మంత్రులు కొందరు కూడా ఆయననే బలపరిచారు. వివిధప్రాంతాలనుంచి బొంబాయివచ్చి ఉంటున్న వోటర్లకి ఆ, ఆ ప్రాంతాల నాయకుల ప్రచారం ఒక రకమయిన సలహా అన్నా అతిశయోక్తికాదు. (అసలు ప్రాంతీయ దురభిమానం మూలసిద్ధాంతం అయినది మద్రాసులోనే. అక్కడ కాంగ్రెసు అధికారంలో ఉన్నప్పుడు కూడా ద్రావిడకజగం కాంగ్రెసుకి అండగానే ఉంటూ విపరీతమయిన ప్రచారం చేస్తూవుండేది!)

శ్రీ కృష్ణమీనన్‌కి సంపూర్ణ మహారాష్ట్ర సమితి 'ప్రోత్సాహమే' కాక కమ్యూనిస్టుపార్టీ ప్రోత్సాహం కూడా—మొదటినుంచీ — ఉంది. మద్రాసులో కమ్యూనిస్టుపార్టీ, స్వతంత్ర, ద్రా.ము.క. లతో ఎన్నిక పొత్తులు చేసుకొనటానికి సందేహించలేదు! కేరళలో కమ్యూనిస్టులు ముస్లింలీగ్‌తో ఉమ్మడి ప్రభుత్వం ఏర్పరిచారు. ఇటువంటి ఏర్పాట్లు రాజకీయాలలో, అందులోనూ ఎన్నిక సమయంలో, సాధారణంగా జరుగుతూనే ఉంటాయి. రెండుసార్లు ఒకే నియోజకవర్గంలో శ్రీ మీనన్ వోడిపోయారంటే ఆ నియోజకవర్గంలోని వోటర్ల అభిప్రాయం ఏమిటో తెలుస్తూ ఉందన్నమాట: ఎవరు గెలిచినా



శ్రీ కృష్ణమీనన్



శ్రీమతి తారా సప్రే

శ్రీ కృష్ణమీనన్‌ని లోక్‌సభకి పంపించరాదన్ని వారు నిశ్చయించుకున్నారు.

కె. వి.

# న్యూఢిల్లీ లేఖ

( 7 వ పేజీ తరువాయి)

వలెత్తు భారతదేశం పాత ఫ్రెంచ్— రాజకీయ అస్థిరత్వం— విధానాన్ని అనుసరించేట్లయితే దానికి ఫలితంగా చిన్న చిన్న పార్టీలు పెరిగిపోయి ఏ ఒక్క పార్టీకీ మంత్రివర్గాన్ని స్థాపించే అవకాశం ఉండదు. అలాంటప్పుడు అధికారం ప్రదర్శించదల్చుకున్నట్లయితే ప్రధానికి లేదా కాబోయే ప్రధానికి తన ఇష్టంవచ్చినట్లు ఆంక్షలు విధించవచ్చు: ఇక రెండోది, అధికసంఖ్యాకులుగాఉండి, అధికారంలోఉన్న పార్టీ, తనలోని కలతలవల్ల చెదిరిపోయిన తరుణంలో ఒక నాయకుని బలపరచడమో లేక ఆక్షేపించడమోచేస్తే అది తర్వాతి ఫలితాలకు దారితీస్తుంది. అధికారంలోఉన్న పార్టీలో క్రమశిక్షణ లోపించినప్పుడు, పార్టీలో ముఠాతత్వాలు, స్వార్థం తలయెత్తినప్పుడు, కొందరు పార్టీనాయకులు ఆక్షేపించదగినరీతిలో అధికారాన్ని హస్తగతం చేసుకొడానికి ప్రయత్నించినప్పుడు, అంతగొండివిధానం అధికారంలోఉన్న పార్టీ పేరును చెడగొట్టేసమయంలోను రాష్ట్రపతికి తన విచక్షణను ప్రదర్శించి ప్రభుత్వ యంత్రాంగంలో పాత్రను నిర్వహించే అవకాశం

(64 వ పేజీ చూడండి)

# మనకు ఎటువంటి అధ్యక్షుడు కావాలి?

ఇండియా అధ్యక్షునికి ఉండే అధికారముల నిర్వచనం రాజ్యాంగంలో ఉన్నది. అధ్యక్షుణ్ణి ఎన్నుకునే పద్ధతి వివరాలూ, విధానమూ కూడా ఉన్నవి రాజ్యాంగంలో. కానీ అధ్యక్షుని ఎన్నికలో ఇండియాలోని వోటర్లకు పరోక్ష సంబంధమేగానీ, ప్రత్యక్ష సంబంధం లేదు. అనగా వోటర్లకు ఇష్టమయ్యే వ్యక్తి అధ్యక్షునుగా వచ్చే అవకాశం శూన్యం. ఎలెక్టరల్ కాలేజ్ ఎన్నుకుంటుంది అధ్యక్షుణ్ణి. పార్లమెంటు ఉభయసభలకూ ఎన్నికైనసభ్యులూ, రాష్ట్ర శాసనసభలకు ఎన్నికైనసభ్యులూ ఎలెక్టరల్ కాలేజ్‌గా వ్యవహరిస్తారు.

'పార్లమెంటరీ ప్రభుత్వవ్యవస్థలో అధ్యక్షుని హోదా దృష్ట్యా, అధ్యక్షుని ఎన్నిక ప్రత్యక్షపద్ధతిలో జరగడమనవసరమని భావించారు' రాజ్యాంగనిర్మాతలు. ఇదీ వోటర్ల పరిస్థితి. అయితే పార్లమెంట్‌సభ్యులనూ శాసనసభ్యులనూ వోటర్లే ఎన్నుకున్నారు గదా. మరి వారు అధ్యక్షుడుగా ఎన్నుకునే వ్యక్తిని ప్రజలు ఎన్నుకున్నట్లేగదా అనే వాదం యీ ఎన్నికపద్ధతిలో నిగూఢంగా ఉన్నది. ఈవాదం పైకి చాలా సబబుగానే కనిపించుతుంది కానీ, ఇండియావంటి దేశంలో యీ పద్ధతి అనేక విపరీతాలకు ఆస్కారమవుతుందని అప్పటిలో మన రాజ్యాంగ నిర్మాతలకు తోచలేదు. అందులో ఆశ్చర్యమేమీ లేదు కానీ, ఆ పద్ధతినుంచి ఉత్పత్తిన్న సమస్యలను చూచి మన పెద్దలు బెదిరిపోవడం మాత్రం అవివేకమే అవుతుంది.

'ఇండియావంటి దేశంలో సమాఖ్య వ్యవస్థకు లాంఛనంగా అధ్యక్షుడు ఉండాలని కోరడం ఉపహాసం' అనే భావం కారణంగానే స్వర్గీయ బాబూ రాజేంద్రప్రసాద్ చివరి రోజుల్లో ఇట్లా అన్నారు: 'రాజ్యాంగం [illegible] ఇచ్చే అధికారాలు గ్రంథస్థం[illegible] మాత్రమే ఉన్నవి. రాష్ట్రపతి హోదా యేమిటి? రాష్ట్రపతి ఏమి చేయగలడు? ఏమిచెయ్యాలి? అనే సమస్యలను రాజ్యాంగ పండితులు పరిశీలించవలసిన సమయమాసన్నమైనది. ఇట్టి పరిశీలన ఇంత వరకూ జరిగి ఉండలేదు. కానీ, రాజేంద్రప్రసాద్ ప్రకటన వెలువడిన తరువాత కొన్నినెలలకు స్వర్గీయ జవహర్‌లాల్ నెహ్రూ యీ సమస్యను ప్రస్తావించి ఇట్లా అన్నారు: 'మనరాజ్యాంగం అమెరికన్ రాజ్యాంగంవంటిది కాదు. అమెరికా అధ్యక్షునికిగల అధికారాలు భారత రాష్ట్రపతికి లేవు.'

ఈరెండు ప్రకటనల తరువాత యీ సమస్యను ఎవరూ అంత శ్రద్ధగా పరిశీలించి ఉండలేదు. అది మన అలవాటు. నెత్తిమీదకు వచ్చేవరకు యే సమస్యను కూలంకషంగా పరిశీలించము. అన్నీ వాటంతట అవి సక్రమంగా జరిగిపోతవనే నమ్మకం ఎక్కువ మనకు. ఈ నమ్మకాన్ని ఉపయోగించుకుని మేధావులూ రాజకీయ నాయకులూ పలు పోకడలు పోతున్నారు. ఆ పోకడలు సామాన్యుని ప్రాణానికి ఉరి తాళ్ళుగా తయారవుతున్నయ్. అదేమంటే ఇదంతా ప్రజాస్వామ్యంలో మామూలుగా జరిగేదేనంటున్నారు.

**ఆలోచించండి**

దేశంలో రాజకీయపరిస్థితిని సార్వత్రిక ఎన్నికలు పూర్తిగా మార్చివేసినవి. ఇంకా మార్చివేస్తవి కూడా. ఇంతవరకూ వచ్చిన



డా. జకీర్ హుస్సేన్

మార్పులను అవగాహనచేసుకుని, రాబోయే మార్పులను దృష్టిలో పెట్టుకుని 'భారత పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో అధ్యక్షుని అధికారాలేమిటి? అసలు అధ్యక్షపదవి అనేది అవసరమా?' అనే అంశాలను తీరికగా ఆలోచించడ మవసరంకాదా?

పరోక్ష ఎన్నిక పద్ధతిని ఆమోదించిన ఫలితంగానే అధ్యక్షుడు ఏదో ఒక రాజకీయ పార్టీ అండతో మాత్రమే పదవిలోకి రాగలుగుతున్నాడు. అట్టివ్యక్తి పార్టీరహితంగా వ్యవహరించాలని అభిలషించడం అవివేకం కాదా? ఒక రాజకీయపార్టీ అండతో అధ్యక్షుడుగా ఎన్నికైనంత మాత్రాన, ఆ పార్టీకి అనుకూలంగా అధ్యక్షుడు వ్యవహరిస్తాడన్న నిబంధన నేమీలేనిమాట నిజమే. కానీ, మెజారిటీ పార్టీ అండ లభించని పక్షంలో అధ్యక్షుడు ఏమి చేయగలుగుతాడూ? ఏమి చెయ్యలేడూ?

అధ్యక్షుని హోదా, అధికారాలూ, న్యాయచట్టం ప్రకారం లభించే హక్కులను గురించి ఇండియా రాజ్యాంగంలో చాలా ఉన్నది. అధ్యక్షునికి కొన్ని ప్రత్యేక అధికారములు కూడా ఉన్నవి. ఇదంతా బాగానే ఉన్నది. కానీ, అధ్యక్షుని పదవిని యునైటెడ్ కింగ్డమ్‌లో 'సింహాసనం' పదవితో పోల్చడంతో యివన్నీ హుళక్కి అయిపోతున్నవి. అయితే యునైటెడ్ కింగ్డమ్‌లో రాణి లేక రాజు పదవి సంగతివేరు. ఎందుచేతనంటే (1) స్వతః బ్రిటిష్‌రాజవంశీకులు భాగ్యవంతులు. ఒక రాజకీయపార్టీయొక్క అండదండల కోసమూ దయాదాక్షిణ్యాల కోసమూ ప్రాకులాడవలసిన అవసరం వారికి లేదు. (2) రాజు లేదా రాణి ఎన్నిక ద్వారా సింహాసనాధిపతి కావడంలేదు. వారసత్వంగా సింహాసనాధిపత్యం వారికి లభించుతున్నది. (3) పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి పుట్టిల్లయిన బ్రిటన్‌లోని ప్రజలకు రాణి, రాజు అంటే యీనాటికీ అపారమైన భక్తి ఉన్నది. దానికి కారణం ప్రజాశ్రేయస్సుకు రాజవంశీకులు అధికప్రాముఖ్యమివ్వడం (4) రాజు లేదా రాణి ప్రత్యేకాధికారములను చలాయించే సందర్భాలలో, రాజకీయపార్టీలు కూడా

తలొగ్గవలసినదే. ఎందుచేతనంటే ప్రజాభీష్టం ప్రకారమే ఈ ప్రత్యేకాధికారములను రాజు లేదా రాణి చలాయించడం జరుగుతుంది. ఇనుమించి లిఖిత రాజ్యాంగమనేది లేదు. ప్రధానమంత్రి కూడా రాజు లేదా రాణిని నిర్లక్ష్యం చేయడానికి వీలు లేని సంప్రదాయాలున్నవి యునైటెడ్ కింగ్డమ్‌లో.

కాబట్టి 'భారత రాష్ట్రపతి అధికారములు యునైటెడ్ కింగ్డమ్‌లో రాజుకు లేదా రాణికి గల అధికారముల వంటివి మాత్రమేననే' అంశాన్ని పునఃపరిశీలన చేయడమవసరమవుతున్నది. వాదన కోసం ఈ పోలికను అంగీకరించితే రాజ్యాంగంలోని రాష్ట్రపతి అధికారాలు, అవసర పరిస్థితిలో అధికారాలువంటి వాటి అర్థమేమి? అటుతరువాత పరిశీలించవలసిన అంశములు (1) లాంఛనగా దేశాధిపతిగా వ్యవహరించే అధ్యక్షపదవిని భరించగల పరిస్థితిలో భారతీయులున్నారా? (2) చలాయించడానికి వీలులేని అధికారాలుండే అధ్యక్షపదవికి ఎవరు ఎన్నికయితే మాత్రం మునిగిపోయేదేమిటి? (3) ఒకచెంప మన రాజ్యాంగం ప్రజాస్వామిక సమాఖ్య రాజ్యాంగమంటూ మరొక చెంప అధ్యక్షుని ఎన్నిక ఏకగ్రీవంగా జరగడంలేదని విచారపడడంలో అర్థమేమిటి?

## సామాన్యుని గోడు

రాష్ట్రపతి ఎన్నిక వ్యవహారంలో సామాన్యుని ప్రసక్తి లేదు. కానీ, ఈ ఎన్నిక నిమిత్తమయ్యే ఖర్చునూ, ఆ తరువాత ఈ పదవి నలంకరించే వ్యక్తి జీత భత్యాలనూ భరించవలసినవారు సామాన్యులే. కాబట్టి ఎటువంటి వ్యక్తి తమ దేశానికి అధ్యక్షుడైతే బాగుంటుందో సామాన్యులు వివరించడంలో తప్పులేదు. వారి మాటను ఖాతరుచేసేవారు ప్రస్తుత రాజ్యాంగపద్ధతిలో లేని మాట నిజమే. అయినప్పటికీ సామాన్యులు తమ అభిప్రాయాలను విడవకుండా ప్రకటించుతూంటే ఇప్పుడు కాకపోయినా భవిష్యత్తులోనైనా రాజ్యాంగాన్ని సవరించే అవకాశముంటుంది. ఆ దృష్టితో ఆలోచించి చెప్పవలసివస్తే ఇండియా అధ్యక్ష పదవిని అలంకరించబోయే వ్యక్తికి ఈ కింది **శీలసంపద ఉండడమవసరం.**

(1) సామాన్యుని స్థితిగతులను మెరుగుపరిచే కృషికి మంత్రిమండలి అధికాధిక ప్రాముఖ్య మివ్వక తప్పని పరిస్థితిని అధ్యక్షుడు సృష్టించాలి. (2) సామాన్యుని జీవితం ఈనాడు ఇంత దుర్భరం కావడానికి ఏకైక కారణం ఆర్థిక చిక్కులు. కాబట్టి అధ్యక్షుడు తన ప్రత్యేక అధికారములను చలాయించి దేశంలో ఆర్థిక క్లిష్టపరిస్థితి యేర్పడినట్లు ప్రకటించి తన్నివారణకు అవసరమైన యేర్పాట్లు చెయ్యగలగాలి. (3) ఆర్థికాభ్యున్నతి సాధన కృషిలో దేశంలోని అనుభవజ్ఞులైన పారిశ్రామికవేత్తలనూ, వ్యవసాయ నిపుణులనూ, తదితర నిపుణుల సహకారాన్ని మంత్రిమండలి అపేక్షించే యేర్పాటు అధ్యక్షుడు చెయ్యగలగాలి. (4) అలంకార ప్రాయంగా అధ్యక్ష పదవి నలంకరించి, అప్పుడప్పుడు ఘనమైన ప్రసంగాలు చేసే వ్యక్తివల్ల దేశానికి కలుగబోయే ప్రయోజనమేమీ ఉండదు. (5) వ్యవసాయోత్పత్తులను ఇతోధికంచేసి, ఆహార రంగంలో స్వయం సమృద్ధిని సాధించే వరకూ, ఇతర పథకాలకూ, కార్యక్రమాలకూ డబ్బు ఖర్చుపెట్టవద్దని మంత్రిమండలిని అధ్యక్షుడు ఆదేశించగలగాలి. (6) మొయ్యలేని బరువుగా దేశరక్షణ వ్యయం తయారుకావడానికి



శ్రీ కోకా సుబ్బారావు

కాశ్మీరు తగాదా ఒక కారణం కనుక ఆ సమస్యను ఏదో ఒకవిధంగా, ఆత్మగౌరవానికి చెరుపు జరుగని పద్ధతిలో తక్షణం పరిష్కరించవలసినదిగా మంత్రిమండలిని అధ్యక్షుడు ఆదేశించగలగాలి. (7) అన్యదేశాలతో ఇండియా సంబంధాలను నడిపే తీరునుబట్టి దేశీయవిధానాన్ని నిర్ణయించే పద్ధతివల్ల ప్రయోజనంలేదని అనుభవంలో తెలిసివచ్చినది. మన దేశీయవిధానాన్ని అనుసరించవలసినదిగా మంత్రిమండలికి సలహా యివ్వగల నైతిక స్థైర్యం అధ్యక్షునికి ఉండాలి. (8) సామాన్యుని ప్రాణాలకు ఉరిగా తయారవుతున్న పన్నులను వెంటనే తగ్గించవలసినదిగా రాష్ట్రాలకూ కేంద్రానికీ కూడా అధ్యక్షుడు సలహా ఇవ్వాలి. (9) రాష్ట్రప్రభుత్వాలమీద పెత్తనంచేసే క్రొత్త పెత్తందారుగా కేంద్రప్రభుత్వాధికారములను పరిమితంచేయడానికి వీలుగా రాజ్యాంగాన్ని సవరింపజెయ్యాలి. (10) అన్నివిధాలా ఇండియాను ఇరుకున పడేస్తున్న విదేశీ అప్పులను వెంటనే కాకపోయినా వాయిదాల పద్ధతిలోనైనా తీర్చగలమన్న ధైర్యం సామాన్యులకు కలిగే యేర్పాట్లను అధ్యక్షుడు సూచించాలి. (11) వీలైనంత త్వరగా రాజ్యాంగపరిషత్తును మళ్లీ సమావేశపరచి, ఇంతవరకూ అనుభవంలో తెలిసివచ్చిన గుణపాఠాలను మనస్సులో పెట్టుకుని మారుతున్న భారతప్రజాస్వామ్యానికనుగుణమైన రాజ్యాంగాన్ని రచించే యేర్పాటు చెయ్యాలి. రాష్ట్రాలకు ఇప్పటికంటే ఎక్కువ అధికారాలుఇచ్చి, దేశరక్షణ, విదేశీ వ్యవహారాలవంటి ప్రధానశాఖలను తన అధీనంలో కేంద్రం అట్టిపెట్టుకొనడానికి వీలైన నిబంధనలను రాజ్యాంగంలో పొందుపరచాలి అనగా ఆర్థిక, రాజకీయ వికేంద్రీకరణకు కొత్తరాజ్యాంగం దోహదపడాలి. (12) లోకమాన్య తిలక్ వంటి స్వాతంత్ర్యప్రియుడూ, సర్దార్ వల్లభ భాయ్ పటేల్ వంటి కార్యదక్షుడూ, జవహర్‌లాల్‌నెహ్రూవంటి ప్రజాహృదయమెరిగిన విశాలదృష్టిగల వ్యక్తి ఇండియాకు ఇప్పుడు అధ్యక్షుడు కావాలి.

కానీ, ప్రస్తుత వాతావరణంలో అట్టి అవకాశం కనిపించదు. మరి ఆ శుభ ముహూర్తం ఎప్పుడు వస్తుందో!

**వి. ఎస్. అవధాని**

### ఉత్తమచలనచిత్రాలకు 'నంది' అవార్డులు:

# రాష్ట్ర ప్రభుత్వ సహాయ పదకం ప్రతిష్టంభన

# చిత్ర పరిశ్రమకు ముఖ్యమంత్రి విజ్ఞప్తి

రవీంద్రభారతి ప్రాంగణమంతా శ్రీరాముని జన్మదినంనాడు జనసముద్రంతో నిండిపోయినది ఉత్సవసమయానికి అరగంట ముందుగానే పద్మభూషణ శ్రీ మాడపాటి హనుమంతరావు, రాష్ట్రమంత్రి శ్రీ పెద్ది రెడ్డి తిమ్మారెడ్డివంటి పెద్దలందరూ సకుటుంబంగావచ్చారు రంగురంగులవస్త్రాల అలంకరణలతో వచ్చిన రమణీమణులవల్ల ఉత్సవానికి రామణీయకత చేకూరినది పరిమళాలు విరజిమ్మే పుష్పాలతో వేదిక గుబాళించినది, వెనుకవైపు అలంకృతమైన నందివిగ్రహం అవార్డుల గభీరతకు చిహ్నంగా నిల్చినది

ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి దంపతులు, సమాచారశాఖామంత్రి శ్రీ కొండాలక్ష్మణ్ దంపతులు, ఉత్తమచలనచిత్రాల న్యాయనిర్ణేతలూ, ప్రభుత్వ ప్రధానకార్యదర్శి, సమాచారశాఖ డైరెక్టరు ముందు వరుసలో, వారివెనుక ఉత్తమ చలనచిత్రాల బహుమతిగ్రహీతలూ ఆసీనులయ్యారు తెలుగు చిత్రాల్లో ఉత్తమమైనవని నిర్ణయించిన వాటికి ప్రభుత్వం ఏటేటా అవార్డులు ఇవ్వడం ఇది మూడవ మారు

ఉత్తమ చలనచిత్రాలు పోటీకి మొత్తం 10 చిత్రాలు మాత్రమే పాల్గొన్నాయి అందులో మనసేమందిరం, లేతమనసులు చిత్రాల నిర్మాతలు లోగడ ప్రభుత్వ బహుమతులుపొందిన కారణంగా అవి ఈ పోటీకి అనర్హమైనవిగా ప్రభుత్వం నిర్ణయించింది అందువల్ల పోటీలో సంగీతలక్ష్మి, పాదుకా పట్టాభిషేకం, శ్రీకృష్ణతులాభారం, ఆస్తిపరులు, చిలకా గోరింకా, రంగులరాట్నం, నవరాత్రి, శ్రీమతి, చిత్రాలు పాల్గొన్నాయి వీటిలో ఉత్తమమైన మూడింటిని ఎంపిక చేయడానికి ప్రభుత్వం రాష్ట్ర విజిలెన్స్ కమీషనరు, హైకోర్టు మాజీ న్యాయమూర్తి శ్రీ యం శేషాచలపతి అధ్యక్షతన ఒక నిర్ణాయక సంఘాన్ని నియమించినది.

అందులో డాక్టరు అయ్యగారి వీరభద్రరావు (ఆలిండియారేడియో హైద్రాబాదు స్టేషన్ మాజీ డైరెక్టరు), డాక్టర్ కె వి గోపాలస్వామి (ఆంధ్ర విశ్వవిద్యాలయం మాజీ రిజిస్ట్రార్), శ్రీ ఎ వి మాణిక్యాలరావు (రాష్ట్ర ఫిలింస్ విభాగం అధికారి) వీరు ఏకగ్రీవంగ చేసిన సిఫారసులను ప్రభుత్వం ఆమోదించింది

**ఉత్తమ బహుమతులు**

వాహినీసంస్థవారి 'రంగులరాట్నం' చిత్రానికి ప్రథమ బహుమతి స్వర్ణనంది లభించినది చిత్రనిర్మాతగా శ్రీ బి ఎన్ రెడ్డి పదివేల రూపాయలు, దర్శకుడుగా నాలుగువేలరూపాయలు రొక్కాన్ని బహుమతిగా పొందారు ఆత్మఆర్ట్సువారి 'చిలకా గోరింకా' చిత్రానికి ద్వితీయ బహుమతి రజితనంది లభించింది నిర్మాతగా శ్రీ కె సత్యగాత్మ మూడువేలరూపాయలు, దర్శకుడుగా మరో వెయ్యిరూపాయలు పొందారు జగపతి పిక్చర్స్‌వారి 'ఆస్తిపరులు' చిత్రానికి తృతీయ బహుమతి కాంస్యనంది లభించింది చిత్రనిర్మాత శ్రీ రాజేంద్రప్రసాద్‌కు వెయ్యి రూపాయలు, దర్శకుడు శ్రీ మధుసూదన్‌రావుకు అయిదువందల రూపాయలు నగదు మొత్తం బహుమతిపొందారు

ఉత్తమ చలన చిత్ర కథారచయితగా (రంగులరాట్నం చిత్రం) శ్రీ పాలగుమ్మి పద్మరాజు వెయ్యిరూపాయల బహుమతి పొందారు రెండవ బహుమతి చిలకా గోరింకా చిత్రం కథారచయిత ఆచార్య ఆత్రేయకు అయిదువందల రూపాయలు బహుమతిని ప్రకటించారు ఆయన ఈ సభకు హాజరుకాలేకపోయారు

ఉత్తమచిత్రాలుగా ఎన్నికైన ఈ మూడింటిలో ముఖ్యపాత్రధారులైన చంద్రమోహన్, అంజలీదేవి, విజయనిర్మల, ఎస్ వి రంగారావు, కృష్ణంరాజు, కృష్ణకుమారి, అక్కినేని నాగేశ్వరరావు, కొంగర జగ్గయ్య, జి వరలక్ష్మి— మొమెంటోలు (జ్ఞాపక చిహ్నాలు) పొందారు. ఉత్తమనిర్మాతగా దర్శకుడుగా అవార్డులు అందుకోవడానికి శ్రీ బి ఎన్ రెడ్డి లేవగా సభలో కరతాళధ్వనులు మిన్నుముట్టాయి అలాగే నూతన నటుడు చంద్రమోహన్, అగ్రనటుడు నాగేశ్వరరావు, పార్లమెంటుసభ్యుడు జగ్గయ్యకు నిరంతర హర్షధ్వానాలు లభించాయి శ్రీ జగ్గయ్యకు మొమెంటో అందజేస్తూ ముఖ్యమంత్రి గాఢాలింగనం చేయడంతో సభ మందస్మితమైనది

**ఉభయ ఫిలిం ఛేంబర్ల ఏకీకరణ**

'రంగులరాట్నం' చిత్రం బి ఎన్ రెడ్డిగారి ప్రతిభాపాటవాలకు, ఉత్తమ అభిరుచికి నిదర్శనమంటూ, అందులోని పాట— ఒక్కసారి వోటిచ్చి పంపితే మీ జోలికి ఇక రామండి' తనకెంతో నచ్చిందని దరహాసవదనంతో శ్రీ బ్రహ్మానందరెడ్డి చెప్పారు హైద్రాబాదులో చిత్రపరిశ్రమాభివృద్ధికి ప్రభుత్వం ఇతోధికంగా తోడ్పడగలదని ముఖ్యమంత్రి హామీ ఇచ్చారు అయితే ప్రభుత్వం ఇస్తున్న సహాయాన్ని సద్వినియోగం చేసుకోవాలని పరిశ్రమను కోరారు అందుకు తొలిచర్యగా ఆంధ్ర, హైద్రాబాదు ఫిలింఛేంబరులు త్వరలో ఏకం కావాలని, ఆ ఏకీకరణ జరిగితే, పరిశ్రమ సమస్యలను పరిష్కరించుకోడంలో సమిష్టిగా, సమర్థవంతంగా కృషి చేయవచ్చుని శ్రీ బ్రహ్మానందరెడ్డి చెప్పారు

ఈ బహుమతి ప్రదానోత్సవానికి అధ్యక్షత వహించిన శ్రీ కొండా లక్ష్మణ్ మాట్లాడుతూ, రాష్ట్రంలో ముడిఫిలిం ఉత్పత్తికి సహకారరంగంలో కర్మాగారాన్ని ఏర్పాటు చేయాలన్న ఆలోచనను గురించి ప్రస్తావించారు బాలలకథా చిత్రాలు రావడం లేదనీ, అది శోచనీయమైన విషయమని ఆయన అన్నారు

**వాహినీకి గర్వకారణం**

దర్శకనిర్మాత శ్రీ బి ఎన్ రెడ్డి మాట్లాడుతూ, 'మా వాహినీ సంస్థ రెండుసార్లు ఢిల్లీలో రాష్ట్రపతి రజితపతకాలను

పొందినప్పుడు కలిగిన ఆనందంకన్నా ఈనాడు నాకెంతో సంతోషంగాఉంది. తన ఊళ్లో తనవారిముందు తనకు గౌరవం జరిగినప్పుడు ఎంత ఆనందంగా వుంటుందో మాటలతో చెప్పలేము.' అని అన్నారు. ఒక చలనచిత్రం పేరు ప్రతిష్ఠలను ఆర్జించినప్పుడు ఆ ప్రత్యేకత ఏ ఒక్కరికీ చెందదని, ఆ చిత్రంలో పనిచేసిన సృజనాత్మక శక్తి సంపన్నులైన సాంకేతిక బృందం, కళాకారులు కలిసి సమష్టిగా చేసిన కృషిగా భావించాలని శ్రీ రెడ్డి చెప్పారు! ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చలన చిత్రాలను ప్రోత్సాహించేందుకు అన్ని రాష్ట్రాలకన్న ముందంజ వేసినదని చెపుతూ, 'ప్రభుత్వం చూపుతున్న ఈ ఔదార్యానికి పరిశ్రమలో ఉన్న మాకూ ఎంతో గర్వకారణంగాఉంది.' అని అన్నారు. మన ప్రభుత్వం ఇచ్చిన, ఇస్తున్న చేయూతను సద్వినియోగంచేసి సత్ఫలితాలను సాధించడం పరిశ్రమ కర్తవ్యమని శ్రీ బి. ఎన్. రెడ్డి చెప్పడం ముదావహం. ఈ కర్తవ్యాన్ని పరిశ్రమ ఇన్నాళ్లు గుర్తించలేదన్న భావన రాజధానిలో లోగడ ధ్వనించింది.

## ప్రభుత్వపథకం ప్రతిష్ఠంభన

ఆర్థికంగా 'పెలికా గోరింకా' చిత్రం దెబ్బతిన్నప్పటికీ ప్రభుత్వం దానిలోని మంచిని గుర్తించి రజితనందిని బహూకరించడంవల్ల అంతకన్న మంచి ప్రయోగాత్మక, ప్రయోజనాత్మక చిత్రం నిర్మిద్దామన్న ఉత్సాహం రేకెత్తించినదని శ్రీ ప్రత్యగాత్మ చెప్పారు. రాజధానిలో సినిమా పరిశ్రమాభివృద్ధికి ప్రభుత్వం తలపెట్టిన పథకాలను మరింత శీఘ్రంగా అమలు జరపాలని శ్రీ అక్కినేని నాగేశ్వరరావు కోరారు. దాదాపు నాలుగు సంవత్సరాల క్రితం ఆయన ప్రభుత్వానికి ఒక మెమోరండం సమర్పించారు. అందులోని పెక్కు సూచనల ఆధారంగా చిత్రపరిశ్రమను అభివృద్ధి పర్చడానికి ప్రభుత్వం ఒక సహాయితా పథకాన్ని రూపొందించుకున్నది. ఆ పథకాన్ని గత మూడున్నర సంవత్సరాలుగా చేపట్టుతున్నది రాజధనిలో చిత్రపరిశ్రమ అభివృద్ధికై ఇంతవరకూ దాదాపు పదిలక్షల రూపాయల మేరకు ప్రభుత్వం వ్యయపర్చినప్పటికీ పరిస్థితిలో ఆశాజనకమైన



ముఖ్యమంత్రిపద్దనుంచి ట్రాఫీ అందుకుంటున్న విజయనిర్మల.

సహాయపడా లేదు. కొత్త స్టూడియోలు నిర్మాణం జరగలేదు: చిత్రపరిశ్రమ ప్రవేశం రాజధానిలో బలపడలేదు: పుష్టి చేకూరలేదు. ప్రభుత్వ పథకం ప్రతిష్ఠంభనను ఎదుర్కొంటున్నది! కారణాలు ఏమైనా, బాధ్యులు ఎవరైనా పరిస్థితి నాల్గేళ్ల క్రితంలాగే ఉంది.' కొత్తస్టూడియోలు నిర్మాణంకోసం ప్రభుత్వం నిర్ణయించిన స్థలం పేచీలో పడినది. ఈ పరిస్థితులను దృష్టిలో పెట్టుకొనే ప్రభుత్వం ప్రోత్సాహ పథకాన్ని శీఘ్రంగా అమలుజరపాలని ఆయన కోరారు. భారత ఫిలిం ఫెడరేషన్ అధ్యక్షుడు శ్రీ ఎ. ఎల్. శ్రీనివాసన్ మాట్లాడుతూ రాష్ట్రప్రభుత్వ ప్రోత్సాహ పథకాన్ని అభినందించారు. ధనాభావమనే కారణంతో ప్రభుత్వం ముడిఫిలిం కర్మాగారం రాష్ట్రంలో స్థాపించాలన్న ఆలోచనకు ముమ్మందు స్వస్తి చెప్పరాదని శ్రీ జగ్గయ్య విజ్ఞప్తి చేశారు.

### ప్రభుత్వానికి బి. ఎన్. రెడ్డి సూచన

ప్రభుత్వ ప్రధానకార్యదర్శి శ్రీ కె. ఎన్. అనంతరామన్ అతిధులను ఆహ్వానించారు. సమాచారశాఖ డైరెక్టరు శ్రీ బి. ఆర్. కె శాస్త్రి కృతజ్ఞతలు తెల్పారు స్వర్ణనంది అవార్డు పొందిన 'రంగులరాట్నం' చిత్రాన్ని ఉదయం నవరంగ్ టాకీస్‌లో ఆహ్వానితులకు ప్రదర్శించారు విందు సమయంలో కళాకారులను పరిచయం చేసారు అంతకుముందు హైదరాబాదు ఫిలిం క్రిటిక్స్ అసోసియేషన్‌వారు ప్రతి సంవత్సరం మాదిరిగా బహుమతి గ్రహీతల ఇష్టాగోష్ఠిని ఏర్పాటు చేశారు. అధ్యక్షుడు శ్రీ పి. ఎస్. ఆర్. అంజనేయశాస్త్రి స్వాగతం చెప్పారు. ఈ సమావేశంలో శ్రీ బి. ఎన్. రెడ్డి మాట్లాడుతూ చిత్రాలు హైదరాబాదులో నిర్మించినా మరెక్కడ నిర్మించినా ఉత్తమమైన చిత్రాలు రావలసిన అవసరముందని చెప్పారు. హైదరాబాదులో చలనచిత్ర పరిశ్రమ అభివృద్ధికి ప్రభుత్వం గైకొన్నచర్యలు ఆశించినంతగా ఫలించలేదని చెప్పారు. చిత్ర పరిశ్రమాభివృద్ధికి గైకొనవలసిన చర్యలనుగురించి తెలుసుకోవడానికి ప్రభుత్వం శాంతారామ్, సత్యజిత్ రాయ్ వంటి ప్రముఖులను ఆహ్వానించి సలహా గైకొనాలని ఆయన సూచించారు. బహుమతి గ్రహీతలందరూ ఈ సమావేశంలో ప్రసంగించారు.

రాష్ట్రంలో చిత్రపరిశ్రమకు ప్రోత్సాహం ఇవ్వాలన్న తలంపు ఇతరరాష్ట్రాలతో పోటీ పడడానికి కాదని, మన కళాకారులకు, సాంకేతికనిపుణులకు ఇతోధిక ఉపాధి కల్పనకై వీలు కలిగించడమే ప్రభుత్వ ఉద్దేశ్యమని శ్రీ బ్రహ్మానందరెడ్డి రవీంద్ర భారతిలో స్పష్టపర్చారు 1968 నాటికైనా రాజధానిలో చిత్ర పరిశ్రమ బలపడడానికి స్థిరపడడానికి పరిశ్రమ, ప్రభుత్వం సమిష్టిగా కృషి చేస్తారని ఆశిద్దాం!

గొపాని సుదర్శన్ రెడ్డి



సీరియల్

తాడిగిరి పోతరాజు

### జరిగిన కథ

వెంకట్రామయ్యగారికి బాగా జబ్బుగా ఉందని తెలిసి ఆప్తమిత్రుడు కామయ్య మేష్టారూ, ఆయన చేరదీసి పెంచిన అనాథబాలుడు ప్రసాద్ ఆయన్ని చూడటానికి వెడతారు. వెంకట్రామయ్యగారు అంతకుముందు ఇచ్చిన పదివేలుకాక మరొక పదివేలు ప్రసాద్‌కి ఇవ్వాలనుకుంటాడు. వెంకట్రామయ్యగారి కొడుకు మధు పూరినుంచి వస్తాడు. ఉత్సవంలో కామయ్య మేష్టారి కూతుళ్ళ శారద, భానులని కలుస్తాడు. అతని మేనమామ కూతురు పూర్ణిమ బొమ్మలకొలువు చూడటానికని మధు కామయ్య మేష్టారి ఇంటికి వెడతాడు.

## 5

అచ్చమ్మగారు ఏనాటినుంచో ధరించిన చేతి గాజులు—తర తరాలుగా వస్తున్న కంటెనాను—కాసుల పేరు—ఇతర్రా నగలు ఆయిదోతనపు అలంకరణలన్నీ తీయించి, నొసటి తిలకం చెరిపి, పూర్తి ఎదుట పైడమ్మ బావి దగ్గరకి తీసికెళ్ళి స్నానం చేయించి తీసికొచ్చారు ఆ రోజు. కర్పూర కప్పెర చీకటి ఉండగానే బయలుదేరి సూర్యోదయానికి కల్లా ఇంటికి తీసుకొచ్చారు పెద్దమనుష్యులు.

ఊళ్ళో చిన్నముఠా అని పెద్ద ముఠా అని రెండు వర్గాలుగా చీలి హోరా హోరీగా పోట్లాడుకొని కక్షలు పెంచుకొని తగాదా అంటే 'ఢీ' అనుకొని పూర్తి వినాశనానికి దారితీసిన ఆ రెండు పార్టీల నాయకులచేతా ఒక కాతాన కట్టుపేసి సఖ్యం పెంపొందింప జేసిన వెంకట్రామయ్యగారు దివంగతులయ్యారు. వారి నిష్క్రమణం ఊరి చరిత్రలో ఒక ఘట్టం.

ఆ రోజు పెద్ద దినం చేశారు. దానశీలి కీర్తిశేషులైన వెంకట్రామయ్యగారికి తోపాటు అత్యంత ఆప్తులైన ఊరు ఊరంతా తరలి వచ్చింది. వ్యక్తియుతులైన వారి గుణ సంపత్తిని కొనియాడుతూ అందరూ సుష్టుగా భోజనం చేశారు. లేచే బంతి లేవాలంటే కూర్చునే బంతి కూర్చుంటు న్నారు. వండిన కాగులు దిగుతాంటే మళ్ళీ బియ్యం పోసి కాగులు పొయ్యి గాడిమీద కెక్కిస్తున్నారు. 'తిన్నవాళ్ళకు తిన్నంత తిండి'—'భేదం'లేక దివంగతులైన వారి ఆత్మకు శాంతి కుదరదని గాదెల్లో నిల్వజేసిన వడ్లన్నింటినీ వారం రోజుల క్రితమే బయట కుమ్మరించారు. చివరకు ఎంగిళ్ళు ఎత్తుకొని పొట్ట పోసికొనే యానాదులకు సహితం సహా పంక్తిలో కూర్చోబెట్టి భోజనాలు పెట్టారు వారి ఆత్మశాంతి కోసమై.

పొద్దు వాటారిపోయింది. బయట పందిట్లో ఖాళీ గంగాళాలూ కాగులూ దభ దభ మని శబ్దం చేసుకుంటూ, తోమటానికి పని మనుష్యులు దొర్లించుకొంటూ తీసికెళ్తున్నారు. దినం చెయ్యటానికి వచ్చిన ముట్టపక్కాలు అలికికాకుండా తిని అరుగుల మీద చావిట్లో కాళ్ళు పంజతన్ని పడుకొన్నారు.

'ఇంకెవ్వరన్నా ఉన్నార్రా' కోటయ్య అరిచాడు—ఒక చేత్తో సత్తువడ్డన పళ్ళెం పట్టుకొని మరో చేత్తో నడుంకు కట్టుకొన్న కండువా ఊడదీసికొంటూ.

పందిట్లో — రోడ్డుకేసి తేరిపార చూశాడు.

గోడ అవతల దిబ్బపైన ఎత్తుగా పడిన ఎంగిలాకులతో కుస్తీ పడుతున్నాయి కుక్కలు—కాకులు వాటి తలపై తన్ను తున్నాయి. విసుగ్గా వాటి వెంటబడి మళ్ళీ పచ్చి ఆకులు వెతుక్కుంటున్నాయి.

'ఇంకెవరున్నారురో—నీవూ— నేనూ— పంతులుగారూ' అవతల గదిలోంచి పురుష కంఠం వినిపించింది.

'మరి అచ్చమ్మగారో—ఆమెను లేవి ఇంత ఎంగిలి పడమనండి పొద్దుగూకులా ఏడిస్తే మాత్రం తిరిగొస్తాడా.'

'పంతులుగారూ! ఏందండీ మీరు గూడా అందరికీ ధైర్యం చెప్పేవాళ్ళు మీరే ఇట్టాయితే.'

వాలు కుర్చీలో కళ్ళు మూసికొని పడు కొన్న కామయ్యగారి కళ్ళు విప్పారాయి.

శుష్కించిన ఆ వదనంలో విషాదఛాయలు సుస్పష్టంగా గోచరిస్తున్నాయి. వెంకట్రామయ్యగారి అస్తమయం వారిని ఎంతగా కృంగదీసిందో—దానికి వారి వాడిపోయిన కనురెప్పలే నిదర్శనం. తనకు చేదోడు వాదోడుగానుండి తన అడుగుజాడల్లో నడిచిన ఏకైక మిత్రుడు తననుంచి దూరమైనాడు. దాదాపు రెండు దశాబ్దాల స్నేహం, ఈ ఆకస్మిక దుర్ఘటనవలన తెగిపోయింది. కంటకావృతమైన తన జీవితపథాన్ని సరళంచేసి, తన ఆదర్శాలకు రూపం ఏర్పరచిన ఆత్మీయుడు విశ్వసౌందర్యంలో కలిసిపోయ్యాడు. ఈ దుర్ఘటననుండి తేరుకోవటం అంత సులభసాధ్యంగా కనిపించటం లేదు. పదిరోజులనుండి ఆహారం వేళకు తీసికోకపోవటంవలన మనిషిలో బాగా నీరసం ఏర్పడ్డది. కళ్ళముందు చీకటిగా ఉంది. మళ్ళీ కళ్ళుమూసికొని సమాధానం చెప్పాడు.

'పొద్దు బాగా వాలిపోయింది కోటయ్యా ఇప్పుడు తిన్నా నాకు ఒంటబట్టదు —వాళ్ళకిన్నిపాలిచ్చి నీవు కానివ్వు'

'భలేవారండీ మీరు యాలకింత తిన కుండ ఎవురన్నా పడ్డారటా. అప్పుడు తిన మంటే ఇప్పుడేం తొందరన్లే, అందర్నీ కానియ్యి అంటిరి. ఇప్పుడేమో ఇట్లా'

అవి వణుక్కుంటూ లోపికెళ్ళి చిక్కటి పాలు పెద్ద ఇత్తడి గ్లాసునిండుగా తెచ్చాడు. రెండులడ్లు కూడ పట్టుకొచ్చాడు.

'ఇదుగోనండీ...ఇవి నోట్లో వేసుకొని పాలు తాగండి...మరీ ఇదయిపోతున్నారు పంతులుగారూ' అంటూ స్టూలు ముందుకి లాగి దానిమీద లడ్లు పాలగ్లాసు పెట్టాడు.

అంతలోనే జరీఅంచు ధోవతి కుచ్చుళ్ళు పైకెత్తి పట్టుకొని వయసు మళ్ళిన ఆసామి అక్కడకుచేరాడు. పైకీక్రిందకూ కుదించిన వడ్లగోతాంలా మట్టసరిగా ఉన్నాడు నల్లగా. నున్నగా ఈనెలా. కత్తిరించుకొన్న కోరమీసం నలుపువర్ణం ముఖంలో కలిసిపోయింది. అతను ధరించిన ఖద్దరుపిల్కు లాల్చీ తడిసి నలిగిపోయింది.

'కోటయ్యా!...ఇక మిగిల్నవాళ్ళే మిగిలింది మనిద్దరికీ వడ్డించు. అక్కయ్య గొంతులో ఇన్ని పాలుపోసేటప్పటికి నా తాతలు దిగి వచ్చారనుకో' అన్నాడు.

'అదికాదు శివరామయ్యా!...నీవు కూడ ఇప్పటివరకూ తినకుండ ఉండటానికి నీ మాతికి 'చిక్కం'బెట్టారా ఎవరైనా?... రా...రా?' అంటూ విస్తళ్ళు తీసికొని నీళ్ళు చల్లి ఇద్దరికీ వడ్డించి తను ఆవురావురుమంటూ తినసాగాడు.

ఈ వంటలూ వార్పులూ వాళ్ళిద్దరి అజమాయిషీ క్రిందనే జరిగాయి. ప్రొద్దుటి నుండి వంచిన నడుం ఎత్తకుండ పని చేశారు. అలసిపోయి తిన్నంతసేపూ ఎవరూ ఎవర్నీ పల్కరించుకోలేదు. తల క్రింద చెయ్యిపెట్టుకొని వెల్లకిలా పడుకొని కళ్ళు మూసికొన్న మాష్టారు పాలగ్లాసు ముట్టుకోలేదు. చప్పున భోజనం ముగించుకొని కోటయ్య బలవంతాన మాష్టారిచేత పాలు తాగించాడు. ఆతరువాత ముగ్గురూ ఇళ్ళకు వెళ్ళటానికి సంసిద్ధులయ్యారు.

'అక్కాయ్...మేం వెళ్తున్నాం' కేక పెట్టాడు దర్వాజలోకి తొంగిచూస్తూ. చిరబోసికొన్న జుట్టుతో, బోసికొడుతున్న మెడచుట్టూ చీరె కప్పుకొంటూ ఆమె వెలుపలికివచ్చింది. కళ్ళు ఉబ్బిపోయి పొయ్యాయి. జుట్టు ముడివేసికొంటూ

'వెళ్ళండి...వెళ్ళండి నాయనా...మళ్ళీ ఈ గడపతొక్కే అవసరమేముంది మీకు... ఎప్పుడూ పెళ్ళి ఇల్లులా కళకళలాడుతూండేది...మీరు పిలవటానికి, రావటానికి ఇప్పుడెవరున్నారిక్కడ'... వెక్కి వెక్కి బావురుమంది ఆమె.

'శివరామయ్యగారూ...మీరిక్కడ్నేఉండండి ...ఒక్కర్తెనే విడిచి అందరమూ పోవటం మంచిదికాదు' అంటూ కోటయ్య చెంబు పెట్టుకొని ముందుకు కదిలాడు.

అంతలో అచ్చమ్మగారు పెద్దగా పిలిచింది. 'కోటయ్యా!...ఇదిగో...ఇది వంటలు



నాకిచ్చెయ్యి.' అంటూ ఒకకవరు చేత్తో పట్టుకొని వాకిలిముందు నిలబడింది.'

'అయ్యో...ఆ కవరు... ఇప్పటి వరకూ చేతిలో పెట్టుకొని అక్కడే మరచిపోయి వస్తున్నాను...అందులో వెంకటాచలయ్య గారు ఏవేవి ముఖ్యవిషయాలు వ్రాశారో ఏమో' అంటూ వెనుతిరిగాడు.

వకాష్టరు మాటలు పూర్తికాకముందే కోటయ్య వెళ్ళి దాన్ని అందుకొని తిరిగి వచ్చాడు. ఇద్దరూ గేటుదాటి వెళ్ళి పోయారు.

శివరామయ్య వాలుకుర్చీ ఆమెకు దగ్గరగా లాక్కొని అందులో వాలాడు, ఆయాసం తీర్చుకొంటూ. చుట్టు పక్కల పరాయివాళ్ళు ఎవరూ లేకపోవటం గమనించి అచ్చమ్మగారు కళ్ళు తుడుచుకొని, ఏడుపు వాయిదావేసికొని కంఠం పెగుల్చుకొంది.

'అబ్బాయ్!'

'ఊఁ.'

'ఇన్నాళ్ళూ మీ బావగారు—ఊరంటూ తన జీవితాన్ని వెళ్ళదీశాడు. ఒక్కగా నొక్క కొడుకు వాడిపెళ్ళి—పేరంటం అనేధ్యాసే లేకపోయింది ఆయనకు—తను కళ్ళు మూయకముందే ఈ శుభకార్యం జరిగితే నాకింత దిగులుండేది కాదురా...చదువో—చదువని—అది పూర్తయిందాక పెళ్ళిమాట ఎత్తవద్దని...చివరకు చూడకుండనే పోయాడుగదా...ఎంతవరకూ రుణమో అంత వరకే...' ముక్కు చీదుకొని పమిట చెరుగుతో తుడుచుకొంది.

'ఇక జరిగిపోయిన వాటిని తలుచు కుంటే ఏమొస్తుందిలే...' సిగాకు తీసి పాయ తొడపై పెట్టుకొని సాపు చేసికోసాగాడు.

'ఊర్మిళ వచ్చిందా!...నాకు అగుపడ లేదే,' ఉత్సాహంగా అడిగింది.

'అప్పుడే వెళ్ళారు వాళ్ళమ్మా—అదీనూ'

'ఈమధ్య నేను చూడలేదు—మొన్న అదాటునచూస్తే బాగా ఒళ్ళుచేసింది. కొద్దిగా పొడుగయినట్టనిపించింది... ఈ ఏడయినా దాన్ని ఒక ఇంటిదాన్ని చెయ్య దలచుకొన్నావా లేదా?'

అనూహ్యమైన ఈ మాటలకు అతను విచలితుడయ్యాడు, తన తత్తరపాటును ఆమె గ్రహించకముందే సర్దుకొన్నాడు.



మట్టమైన కొద్దిగా కొరికి ఊశాడు.

'ఇప్పుడేం తొందర్లే...చిన్నపిల్ల' విర్లి ప్తతి వ్యక్తమౌతూన్న కంఠంతో పలికాడు.

'ఇంకా చిన్నపిల్లరా... తండ్రివికాబట్టి నీ కట్టనిపిస్తుందికానీ వయసొచ్చినపిల్లను ఎన్నాళ్ళని ఇంట్లో ఉంచుకొంటావ్... పెద్దదాన్నో చిన్నదాన్నో నే చెబుతున్నాను. దాని ఇంటికి దాన్ని పంపించెయ్యి.'

ఎవరిహృదయ రహస్యాలను వారు నిగూఢంగా దాచుకొని ఎలా బైటపడాలా అని ప్రయత్నించసాగారు. నోరువిప్పి అడిగాక తిరస్కారం ఎదురైతే తలవంపు లుగా ఉంటుందని ఇద్దరూ సంకోచించ సాగారు. తనకూతుర్ని కోడలుగా చేసి కొమ్మని తనే అడగాలని అచ్చమ్మగారి కోరిక. ఎందుకంటే అంత అంతస్థులో వియ్యమందుకోవటం మహద్భాగ్యంగా అతను భావించాలని ఆమె. అతను ఆడపిల్లతండ్రి—చప్పున బయటపడిపోతే చులకనయిపోతానని భయం.

ఆమాట వినగానే అతనికళ్ళు చెమర్చి నట్లు తుడుచుకొన్నాడు.

'అక్కాయ్...నీకు తెలుసుగా...దాన్ని నేను ఎంత అల్లారుముద్దుగా పెంచానో...అది ఇంట్లో లేకపోతే ఒక్కగడియ బ్రతక లేను. అందుకే దాన్ని కాలేజీకికూడ పంపలేదు.' ఆమె మనోభావాన్ని పసికట్టి మాటలాడటంలో చాలా జాగ్రత్త వహిం చాడు. ముట్టిన చుట్ట కాల్చుకోవటం కూడ విస్మరించాడు.

'అబ్బాయ్...చూడూ...ఆ డపిల్లమ ఏనాటికైనా ఒక అయ్యచేతిలోపెట్టి సాగ నంపాల్సిందే...ఏమంటావ్'...అతనిముఖంలోకి చూసింది.

'ఆమాట నిజమేననుకో. కానీ ఏది ఎలాఉన్నా అమ్మాయి మా కళ్ళముందే ఉండాలి. మగారువారుకానీ...వారు వారుకానీ. అందు కిష్టపడ్డవాణ్నే చూస్తాను' తన నిశ్చితాభిప్రాయాన్ని వెలిబుచ్చుతూ లేచి నిలబడి గూట్లోఉన్న అగ్గిపెట్టె అందు కొని చుట్ట ముట్టించుకొన్నాడు.

'ఇల్లరికపుటల్లుడ్ని చూస్తున్నావా? మరీ గొంతెమ్మకోరికలుకోరకు. అంతకంటె నేనొకటిచెబుతాను. మావాడు నీకు కివ్వేంటు నీ కూతుర్ని... ఉన్నఊళ్ళో సంబంధం. తల్లిగారిఊరూ... అత్తగారి ఊరూ ఇదే అవుతుంది దానికి' వ్యవహారం నాన్చటంవలన ప్రయోజనం లేదని ఆమె తన అభిప్రాయాన్ని కుండ బద్దలు కొట్టి నట్లు చెప్పింది.

'అక్కాయ్. ఎన్నాళ్ళకు నామీద దయ కల్గిందే' చుట్ట నోట్లోనుండి తీసికొని కళ్ళుప్పగించి ఆమెకేసి చూడసాగాడు.

'ఎంత తెంచుకొందామనుకొన్నా రక్త సంబంధం ఎక్కడికి పోతుందిరా? ఒక రక్తం పంచుకొని పుట్టినంతమాత్రాన దూరమైపోతామా? పిల్లలిద్దరూ చిలకా గోరింకల్లా మన కళ్ళముందుంటారు. కట్నానికి ఆశపడి పరాయి సంబంధం చేసినా లంకంతఇంట్లో నేనొక్కదాన్నే దయ్యంలా చావాలి, వాడటు అత్తగారింటికని, పట్నమని అటూఇటూ తిరుగుతాంటే.'...

'అక్కాయ్! ఈసంపాదనంతా దానికి కాకపోతే మరెవరికే.. పోతా నేను కట్టుకు పోతానా! నేనుమాత్రం తక్కువ చేస్తాం దేమిటే!...' ప్రశాంతంగా పొగ వదులుతూ వాలుగా సర్దుకొంటూ అన్నాడు.

'అయ్యో, డాను డామా ఎంతమా టన్నావ్‌రా. కట్నాన్నిగూర్చి నేనెత్తి మాటన్నానా. మాటవరసకు చెబుతున్నా నంతే వాళ్ళతాత వాడికి మిగిల్చి పోయింది చాలక ఇంకా ఎందుకు? కాలుమీద కాలువేసుకొని తరతరాల వరకూ అనుభవించవచ్చు, విక్టోరియాలాటి పొలాలు. ఇంకా నాళ్ళనాన్న మ్యాచ్యాలనీ, ఆస్తి తనీ, మన్ను మశానం కట్టించి డబ్బు తగలేశాడు కానీ ఆ పంతులుగారిమాటవిని... లేకపోతే ఇంకా ఎట్లా లేదన్న'.. అని ఏమో చెప్పబోయింది.

'అక్కాయ్ నేను అరవిడిచి మాట్లాడు తున్నా... వాడికోసం కాదంటే నేనిన్నాళ్ళూ ఎవడిచేతుల్లో పెట్టింది. లేకపోతే! ఈ ఊరి వ్యవహారాలు నెత్తినవేసుకొని, జావమంతా తిరిగి ఈ అరవచాకిరీ అంతా ఎందుకు?... ఆపని కాస్త ముగించుకొని నేనలా, నీ మరదలూ, నిబ్బరంగా గుండెమీద చెయ్యివేసికొని పడి ఉండలేకపొయ్యామా?'...

'అయితే ఎన్నాళ్ళనుంచి నీ కీబుద్ధి

పుట్టింది. నీవూ నీబావకు తగ్గవాడి వేరా' అతనిముఖంలోకి కుతూహలంగా చూస్తూ అడిగింది—తాను కూర్చున్న పీట మరింత దగ్గరకు లాక్కుంది.

'మరి ఇన్నాళ్లూ బావవెంట ఎందుకు తిరిగా ననుకొన్నావ. బావ చెప్పినట్లు హైస్కూలికి ఎనభై వేలు ఎందు కిచ్చా ననుకొంటున్నావ్. ఎప్పుడయినా బావ మామంచిని గ్రహించి దాన్ని కోడలుగా చేసికొంటాడనే. కానీ బావ ఎన్నాళ్లు ఎదురుచూసినా ఈ సంగతే పట్టించుకో లేదు.' లేచి కిటికీనుండి కాండ్రించి ఉమ్మివేసి, మళ్లీ 'ప్చ్'—'ప్చ్' అంటూ చప్పరించసాగాడు.

'అదంతా ఆ పంతులుగారి మాయ. మరి ఆయనమాటంటే ఎందుకంతగురో అంతు చిక్కలేదునాకు—ఆయన గీసినగీటు దాటే వాడుకాదు. పంతులుగారు రమ్మన్నారంటే చాలు, తింటున్న కంచం అలా వెట్టివేసి, చెయ్యి తుడుచుకొని పొయ్యేవాడు. ఆయన మాటలు విని స్కూలుకు రాసిచ్చిన ఆస్తి లక్షన్నర దాదాపులేదూ— పొలం డబ్బూ. అంతా కలుపుకొంటే' ఆమె ఊహాపథంలో హైస్కూలుకై భర్త వెచ్చించిన స్థిరచరా స్థులు లెక్కించుకోసాగింది.

'అది మంచిపనేలే అక్కాయ్! మనం తిని తలకు పోసికొంటే చూసేదెవడు? తెలిసిందా? పరులకింత సహాయం చేయ్యాలనీ, పదిమందికీ మేలుజరిగే ఒక మంచిపని చెయ్యాలనీ పంతులుగారు చెప్పేదికూడ నిజమే. ఇతరు లకు మేలూ జరుగుతుంది. మనకూ పేరుంటుంది... తెలిసిందా ... వెధవడబ్బు... పెదనాన్నగారి పేరు శాశ్వతంగా ఉండి పోయిందా లేదా? ... సోమేశ్వరరావుగారి ఉన్నత పాఠశాలని.'

అతని మాటలకు అడ్డొచ్చి ఆమె అంది 'నాకివన్నీ ఏమి తెలుసురా ... మాబావ ఖర్చు లించకుండ చేసేవాడా, ఏపనైనా అని నన్ని పెట్టుకోనేదాన్ని ... ఆయన ఎదుటపడి మాట్లాడాలంటే భయం వేసేది. మరి పెళ్ళివిషయం ఏంచేద్దాం...పెళ్ళి ఎప్పుడైనా కానియ్యిగానీ పసుపుకుంకుమ పెడతాం అమ్మాయికి' ... ఆమె కంఠంలో ఆతురత కన్పించింది. అప్పటివరకూ కిటికీలోనుండి బయటికి చూస్తూన్న అతను ప్రక్కకు తిరిగిచూశాడు. ఆమె కళ్ళల్లోకూడ పెళ్ళి పట్ల తహతహ కనిపించింది.

'వాడ్నికూడ కనుక్కొందాం— చిన్నపిల్ల వాడు కాదుగా! ... బాసికం కట్టి కూర్చో పెట్టటానికి' అతను అనుమానంగా అన్నాడు, చుట్టకొరికి ఊస్తూ.

'అందుకనే అబ్బాయ్ నేను తొందర పడేది. వాడి వ్యవహారం నాకు అంతగా నచ్చలేదు' కళ్ళు గుచ్చిగుచ్చి అతనివేసి చూస్తూ గొంతు తగ్గించుకొని అంది.

'మరీ పదిహేను రోజులనుండి...రోజుకు మూడు జతలబట్టలు విడిచి అవతల విసి రేస్తాడు. రాత్రిళ్ళు ఎక్కడెక్కడో తిరిగి ఇంటికొస్తాడు. కిటికీ చువ్వలు పట్టుకొని అలానే దిమ్మెలా నిలబడతాడు. వాళ్ళనాన్న విూధ దిగులుపెట్టుకొన్నాడేమో ననుకొన్నా మొదట. అదీలేదు.' 'నాకిక్కడ బాగు లేదు మద్రాసు పోతానని కూర్చున్నాడు మొన్న వారంరోజుల క్రిందట. పెద్దదినం అయిందాక ఇంటిపట్టునుండాలి నాయనా! నల్గురూ ఏమనుకొంటారని బలవంతంగా ఉంచా.'

ఆమె ముఖంపై మళ్ళీ విషాదఛాయలు కమ్ముకొన్నాయి. ముఖం బుసబుస పొంగి పోయింది.

'ఇక నీవుతప్ప మాకు మగదిక్కు ఎవ రున్నారు' అంటూ ముక్కు చీదుకొని మళ్ళీ ఏడవటానికి ఉపక్రమించింది.

'వాడ్ని నీచేతుల్లో పెడుతున్నా...ఈ ఇల్లూ, వ్యవసాయం నాకేం పాలుపోవటం లేదు' అంటూ ముఖానికి చెరుగు అడ్డ మేసుకొని, గోడకు చేరగిలాపడి గొల్లు మంది. అతను మడతకుర్చీలోనుండి లేచి క్రింద కూర్చొని ఆమెను అనునయించ సాగాడు.

'అక్కాయ్...నీపిచ్చేపిచ్చిగానీ...మామాట పొరనివ్వవు కదా?...బావపోతే మేమందరమూ ఎక్కడికిపొయ్యాం. వ్యవసాయమూ, కవుళ్ళు వ్యవహారాలు నేను చూస్తానంటినిగదా... అబ్బాయి విషయం ... వాడితో నేను మాట్లాడతా నీవెళ్ళిపడుకో' అంటూ బల వంతాన రెక్కపుచ్చుకొనిలేపి వాల్గడుగులు లోనికి నడిపించాడు. ఆమె ఊడిపోయిన జుట్టుము ముడివేసుకొంటూ వెళ్ళిపోయింది



పిలుస్తూ

అతను మళ్ళీ తలపైకెత్తి నాల్గువైపులా పరకాయించి చూశాడు. పనిమనుషులు తోమిన గిన్నెలను వెనకగదుల్లోకి మోసి కెళ్తున్నారు. దొడ్లో వసారాలో ముట్లాలు విరగదొబ్బుతున్నారు. అవతల జీతగాళ్ళు పని చేసుకొంటున్నారు. అంతా తేరిపారచూసి.

'ఒరేయ్ — మధు — మధుసూదన్‌రావ్' అంటూ కేకపెట్టాడు.

*   *   *

ఆ రోజు ఉదయం వంటపని ముగిశాక సామానులు అవీ సర్దటంలో నిమగ్నురాలయి పోయింది శారద. తండ్రి అతిథులతో మాట్లాడటానికి, ప్రశాంతంగా కూర్చొని చదువుకోటానికి ఒక ప్రత్యేకమైన గది ఏర్పాటు చేసింది. ఒక క్రమం లేకుండ చెల్లా చెదరుగా పడిఉన్న పుస్తకాలను శుభ్రంగా తుడిచి ఏటవాలుగా నిలబెట్టింది.

ఇంగ్లీషు నవలలు, నాటకాలు. కావ్యాలూ ఒక్కొక్క వరుసలో అమర్చింది. తెలుగు సాహిత్యాన్ని ప్రత్యేకమైన అలమారాలో అదే క్రమంలో పొందుపరచింది. టేబిల్ పైన దుమ్ముదులిపి, చక్కగా లతలతో అల్లిన ఎంబ్రాయిడరీ బట్టలు పరచింది. ఫ్లవర్ వాజ్‌లో ఎండిన పూలను మార్చి కొత్త పూలు పెట్టింది. దాని ప్రక్కనే పోట్లా టకు సన్నద్ధమౌతున్న రెండు పింగాణీ వృషభాలను ఎదురెదురుగా అమర్చింది.

సాహిత్య సమాలోచనలు చర్చల నిమిత్తమై 'టీ' పాయ్‌చుట్టూ నాలుగు

# మట్టి బొమ్మలు

కుర్చీలు ఏర్పాటు చేసింది. ఆ గదిలో ప్రతి అంశమూ తన కళాకౌశలాన్ని అభిరుచిని వ్యక్తం పరుస్తున్నాయి.

'భాసూ'...పిలిచింది.

'వస్తున్నా' అంటూ వ్రాసికొంటూన్న కలాన్ని అలానే పట్టుకొని గదిలో అడుగు పెట్టింది.

'ఎలా ఉంది?. నేను కాలేజీకి వెళ్ళి పోయన్యాకకూడా, రోజూ మన ఇల్లు ఈ విధంగానే ఉంచాలి...అర్థమయిందా?...ఎంత అందంగా శుభ్రంగా ఉంచితే అంత ఆనం దంగా ఉంటుంది మనస్సు...ఆ—నే చెప్పిన విషయం...! జ్ఞాపకముందా?...ప్రసాద్‌తో వెంటనే చెప్పివేయకు'

'ఓ...ఏడిపించి ఏడిపించి చెబుతా.'

అక్కా చెల్లెళ్ళిద్దరూ ఎదురెదురుగా ఆ కుర్చీల్లో కూర్చొని మాట్లాడుకోసాగారు. అంతలో అడుగుల సవ్వడి వినిపించి దృష్టి మరల్చుకొన్నారు. ప్రసాద్—మాష్టారు ఇద్దరూ పెద్దపెద్దగా సాహిత్య విషయాలు మాట్లాడుకొంటూ లోనికొచ్చారు. వచ్చి రావటంతోటే ప్రసాద్‌బట్టలు మేకుకు తగిలించి, తువ్వాలు భుజంపై వేసికొని బావివైపు నడిచాడు.

'ఈవేళ త్వరగా రమ్మని చెప్పాముగా నాన్నా'... గారాబంగా అడిగింది శారద గడియారం కేసిచూస్తూ. చిన్నముల్లు పన్నెండు దాటిపోతోంది.

పెదితల్లీ...పనులు...ఊపిరి సలపటానికి కూడ వీల్లేని పనులు. ప్రసాద్ చూశాడుగా అడుగు అరే, శభాష్, నేనింకా చూడనే లేదు. చాలాచక్కగా అమర్చావమ్మా. అయితే గీతాంజలి—రస్సెల్ పుస్తకాలు ఈ టేబిల్ పైనసే ఉంచు. ఎప్పుడైనా ఉబుసుపోక పోతే తెరచుకోటానికి వీలుగా' అంటూ 'రస్సెల్' రచించిన ఒక తాత్విక గ్రంథాన్ని చేతిలోకి తీసికొని పేజీలుతిప్పుతూ వాలు కుర్చీలో కూర్చున్నాడు. అంతలోనే ఏదో జ్ఞాపకమొచ్చినట్లు తలపైకెత్తి.

'చూశావా—భాసగా అక్కయ్య ఎంత చక్కగా అమర్చిందో... నేర్చుకో'. టీపాయ్ ముందు కుర్చీలో కూర్చొని బొమ్మలున్న ఇంగ్లీషుపుస్తకం తిరగవేస్తున్న భాను తలెత్తకుండ సమాధానం చెప్పింది. 'నేనింకా బాగా అమర్చుతా నాన్నా.. రేపు చూడు' అంది.

'వద్దులే తల్లీ... నీ పుస్తకాలు నీవు జాగ్రత్త చేసికో అదే పదివేలు.' అంటూ తలవంచుకొని పుస్తకంలోకి చూస్తూ 'ఇంకా వంటకాలేదామ్మా' అన్నాడు.

'ఎప్పుడో అయిపోయింది నాన్నా' వయ్యా రంగా తండ్రి కూర్చున్న వాలుకుర్చీ చేతి పైన సరసనే కూర్చొని తనుకూడ పేజీల కేసిచూస్తూ సమాధానం చెప్పింది శారద.

'మరి ఇక ఆలస్యమెందుకు ?... త్వరగా వడ్డించు ' .. పుస్తకం టేబిల్ పై పెట్టి లేవటానికి సంసిద్ధుడయ్యాడు.

'మీ కొక్కరికే వడ్డించనా' తంకరయా త్మకంగా అడిగింది.

'అలా ?... ప్రసాద్ ఇప్పుడు భోం చెయ్యడటనా ?'

'స్నానానికి వెళ్ళాడు నాన్నా...రానివ్వండి ...ఇద్దరికి ఒక్కసారే వడ్డిస్తాను.' 'నీవు ముందు వడ్డించమ్మా... ప్రసాద్ స్నానం ముగించుకొని ఈ లోగా వచ్చేస్తాడూ ... తొందరగా వెళ్ళాలి' అంటూ లేచాడు. తండ్రి అక్కడపెట్టిన పుస్తకాన్ని చేతిలోకి తీసి కొని, ఒక పేజీలోకి చూస్తూ ' భానూ... వెళ్ళి పళ్ళాలు కడుగు నే వస్తాను' అంది...

'నేను నీకు చెబితే నీవు దానికి చెప్పు... భలే పిల్లలమ్మా మీరు'అంటూ ప్రసన్న వదనంతో కావ్యా చేతులూ కడుక్కొటా



నికి బయటికి వెళ్ళారు. అంతలోనే ప్రసాద్ ఒళ్ళు తుడుచుకొంటూ లోనికొచ్చాడు.

వనాడు పీటలువేసి కంచాలు పెట్టి వడ్డించటం ప్రారంభించింది శారద. మామూలుగా ఉండే పప్పుపులుసు ఆవకాయ పచ్చడి స్థానే ప్రత్యేకమైన వంటలు కనిపిస్తున్నాయి. వప్పుచారు. బంగాళాదుంపల వేపు, కొబ్బరి పచ్చడి, మైసూర్ పాక్ ముక్కలు, చక్కెర కేళీలు ఏమిటేమిటో చిన్నచిన్న గిన్నెల్లో ఉన్నాయి హోటల్ లోలా.

పీటపై కూర్చుంటూనే ప్రసాద్ అడిగాడు 'ఏమిటీ విశేషం ?'.

'చెప్పు చూద్దాం'. భానూ అతనికళ్ళలోకి చూసింది కొంటెగా.

'ఈ వేళ ఏదైనా పండుగ వచ్చిందా. ఇల్లుకూడా నీటుగా అమర్చారు.' కుతూహలంగా అడిగాడు మళ్ళీ. ముద్ద నోట్లోకి పోనిస్తూ.

'పండుగే. ఎమిటో చెప్పు',

'ఇంతలో పండుగ లేమున్నాయి?' అన్నం తినటం విస్మరించి ఓ నిముషం పాటు ఇంటి వాసాలు లెక్కపెట్టాడు. ఎమీ పాలుపోలేదు.

'తెలియదు భానూ. నీవే చెప్పు' మంచి నీళ్ళు తాగుతూ భానుకేసి తిరిగి అన్నాడు.

'చెబితే మరి నాకేమిస్తావ్ ?'.

'ఏ మిమ్మంటావ్'.

'మంచి కలర్‌బాక్స్ కావాలి. బొమ్మ లేసుకోటానికి'

'ఓస్. ఇంతేనా. అయ్యో శారదా. మాటల సందడిలో భలేపని చేశావ్. చాలుచాలు మాస్టారికి వడ్డించు' అంటూ చెయ్యి అడ్డం పెట్టుకొన్నాడు. వంగి వడ్డిస్తున్న శారద కళ్లల్లోకి చూస్తూ. ఆ కళ్ళలో అతనికి కొత్త కాంతి కనిపించింది.

'తినవోయ్. వయస్సులో ఉన్నవాడివి. ఆ మాత్రం తినకపోతే ఎలాగ?'. అంటూ భానుకేసి తిరిగి 'అసలు విశేష మేమిటో తొందరగా చెప్పండమ్మా. ప్రసాద్‌తో చెప్పమనే' అన్నాడు. వాళ్ళ పరాచికాలలో తండ్రి కూడ భాగస్వామి కావటంతో భాను కొద్దిగా తికమకపడి చెప్పటానికి సంశయిస్తూ రాలయింది. 'చెప్పనా?' అన్నట్లు అక్కయ్య కేసి చూసింది. శారద నవ్వుతున్న కళ్ళతో తన సమ్మతిని తెలిపింది.

'ఈ వేళ ప్రసాద్ పుట్టినరోజు నాన్నా'. గలగల నవ్వుకొంటూ చెప్పింది. అందరూ ఆ పిల్లతో శ్రుతికలిపి నవ్వుకెరటాలు ఇల్లంతటికీ ప్రవహింప చేశారు.

'నీవు పుట్టినరోజు నీకే జ్ఞాపకం లేకపోతే ఎలాగోయ్' అంటూ మాస్టారు పీటమీద నుండి లేచి చెయ్యి తుడుచుకొంటూ మధ్య గదిలోకి వెళ్ళిపోయ్యారు.

ప్రసాద్ ముఖంలో టక్కున నవ్వు మాయమైంది. ఆనందపు ఛాయలు మచ్చుకైనా కన్పించలేదు.

ముఖంపై నిరాశ అలుముకో పోగింది. ఓ క్షణ మయ్యాక మెల్లగా పెదవులు విప్పాడు.

'ఇవన్నీ మనలాటి వాళ్లకు కాదు శారదా. డబ్బుగల వాళ్లకు, సౌఖ్యానికి పెట్టి పుట్టిన వాళ్లకు. ఎండ కన్నెరుగకుండ, చుట్టూ డబ్బు పరచుకొని సుఖాలలో తేలి పొయ్యేవాళ్లు పనీ పాటా లేక పుట్టిన రోజనీ, చచ్చిన రోజనీ, విందులనీ, వినోదాలతో కాలక్షేపం చేస్తారు. నాలాటి నిర్భాగ్యుడి కెందుకివన్నీ' అంటూ కంచంలో నీళ్లు పోశాడు. అతని ముఖం అదోలా అయిపోయింది.

అతనిని సంతోష పెట్టడానికై తాను ఆవేళంతా ఎంతో శ్రమపడి అవన్నీ చేసింది. అతను ఆనందంతో పరవశమయి పోతాడని తాను విశ్వసించింది. చివరకు అది అతనికి దుఃఖం కలిగించినందుకు తాను నొచ్చుకొంది. కాని ఆ బాధను పైకి వ్యక్తపరచక తెచ్చిపెట్టుకొన్న చిరునవ్వుతో 'అయిపోయిందా నీ ఉపన్యాసం... మనం భారీ ఎత్తున ఒక పెద్ద పార్టీ చేసి నీ మిత్రులకు ఆహ్వానాలు పంపలేదు కదా... అసలు ఈ వేళ ఏదయినా స్పెషల్ చెయ్యాలను కొన్నాను. అంతలోనే నీ 'బర్త్ డే' అని స్ఫురించింది. అంతే... పేరు నీది, విందు మాది' అంది అతనిని ఉపశమింప చెయ్యటానికి ప్రయత్నిస్తూ.

'ఏం? 'బర్త్ డే' లు పెద్ద పెద్దవాళ్లే చేసికోవాలని 'రూలుం'దా?... మన మెందుకు చేసికోకూడదూ?' మైసూర్‌పాక్ ముక్క కొరుకుతూ భానూ అంది.

ఆ మాటతో ప్రసాద్ 'భలే చెప్పావ్ భానూ' అంటూ పెద్దగా నవ్వి బయటికి వెళ్లాడు. అప్పటికే రామయ్యగారు మధ్య గదిలో మంచంపై సన్నగా గురక పెడుతున్నారు. వారికి నిద్రాభంగం కాకుండ మెల్లగా బయటకు వెళ్ళి వేపచెట్టు క్రింద నున్న నులకమంచం వాల్చుకొని, ఆ మక్కెలోనే నడుం వాల్చాడు. ఎండపొడ పడకుండ భుజమ్మీద తువ్వాలు ముఖంపై నద్దుకొన్నాడు.

(ఇంకా వుంది)



# తలవంచని వీరవనిత

# రాణీ దుర్గావతి

[గోండులకు ప్రసిద్ధస్థలము 'గోండవానా'. అది ఇప్పుడు సెంట్రల్ ప్రావిన్స్‌లోని జబల్‌పూర్ జిల్లాగా పిలువబడుతూ వుంది. గోండవానాకి చరిత్రలో ఎంతో విలువైన స్థానముంది. అక్కడి 'మదన్—మహల్' పేరు వినని వారుండరు. నాలుగు శతాబ్దాల క్రితం సకల శోభాయమానంగా ప్రకాశించిన ఈ భవనం ఇప్పుడు శిథిలావస్థలో వుంది. ఆ భవనంలోని ప్రతి అణువూ రాణీ దుర్గావతిని గుర్తు చేసేదిగానే వుంటుంది. అందులో ఆమె నివసించిన రోజులు తక్కువే అయినా ఆమె జీవితానికి అదొక మధుర చిహ్నంగా నిలిచిపోయింది.

16 వ శతాబ్దంలో బుందేల్‌ఖండ్‌ను పాలించిన శాలివాహనుని కుమార్తె దుర్గావతి. శాలివాహనుని సమకాలికుడు అక్బరు. రాజస్థాన్ రాజవంశాన్నంతటినీ తన అధీనంలోకి తీసుకోవాలని అక్బరు తహతహలాడుతూ వుండేవాడు!]

'నా హృదయేశ్వరులయిన దల్పత్రాయ్ ప్రభూ! మా రాజవంశ మర్యాదల్ని అతిక్రమించి మీకీ ఉత్తరాన్ని రాస్తున్నందుకు మన్నించండి. నేనిలా రాస్తున్నట్టు మా తండ్రిగారికి కూడా తెలియదు.

దేవుడు నాకు ప్రసాదించిన అందాన్ని అందరూ ప్రశంసించారు. వివాహకాలం ఆసన్నమయే సమయానికి నా అందం నాకొక శాపంగా పరిణమించింది. అక్బరు చక్రవర్తికి ఇప్పుడున్న భార్యలు సరిపోక నన్ను కూడా చేర్చుకుందామని చూస్తున్నాడు. మహామండలాధీశుడవైన నీ పేరు వాడవాడలా చెప్పుకోవడం నేను విన్నాను. నన్ను మీ రాజధానికి తీసుకుపోయి మీ భార్యగా స్వీకరించండి. ఇట్లు,

మీ పాదదాసి'—

రాజకుమారి దుర్గావతి.

[గోండు రాజ్యపాలకుడు, మహామండలాధీశుడు అయిన దల్పత్రాయ్ రాజకుమారుడు దుర్గావతి రాసిన ఉత్తరాన్ని చదువుకుని మురిసిపోయాడు. వెంటనే శాలివాహన చక్రవర్తి దగ్గరకు తన దూతను రాయబారానికి పంపేడు. కాని, శాలివాహనుడు తన కూతురిని దల్పత్రాయ్‌కి ఇవ్వడానికి ఒప్పలేదు. దల్పత్రాయ్ యుద్ధానికి సన్నద్ధమై శాలివాహనుడి మీదకు దండెత్తి వెళ్ళాడు.]

'ఇంతటి దుర్దినం ఎదురవుతుందని కలలో కూడా ఊహించలేదు. నాకోసం నా తండ్రి, దల్పత్రాయ్ యుద్ధానికి తలపడ్డారు. వందలకొద్దీ శవాలను తేల్చి యుద్ధం ముగుస్తుంది. ఓ తండ్రీ! శాంతించండి. దల్పత్రాయ్ గురించి తక్కువగా అంచనా వేసుకోవద్దు. అతను అఖండ పరాక్రమవంతుడని మీరు వినియుండలేదా? అతను అడవిజాతికి చెందినవాడని మీరు నన్నతనికిచ్చి వివాహం చేయడానికి సమ్మతించలేదు. కాని, మన రాజపుత్రులవంటి శౌర్యము ధైర్యముకల గోండుజాతిని తక్కువ చేయకండి. వారూ క్షాత్ర వంశీయులే. రాజపుత్రులకంటే వారెన్నో రెట్లు మిన్న అని రూపించుకున్నారు. ఏ ఒక్కరూ ఢిల్లీ అక్బరు చక్రవర్తికి దాసోహ మనలేదు. తలొగ్గలేదు. వాళ్ళ చెల్లెళ్ళను, కుమార్తెలను అక్బరు చక్రవర్తికి భరణంగా ఇవ్వలేదు. వారు నిజమైన ధీరులు. కాని మన రాజపుత్రులు...?'

— రాజకుమారి దుర్గావతి.

[శాలివాహనుడి సైన్యం దల్పత్రాయ్ సైన్యంతో తలపడే ముందే దుర్గావతి గుర్రాన్ని అధిష్ఠించి వాయువేగంతో దల్పత్రాయ్‌ని చేరుకున్నది. ఆమె సాహసానికి ఆశ్చర్యపోయిన దల్పత్రాయ్ వెంటనే ఆమెను తన భార్యగా స్వీకరించాడు. ఆరోజు ఎంతో రక్తపాతం జరిగివుండేది. విపత్తును తప్పించి, తన మనోభీష్టాన్ని నెరవేర్చుకుంది దుర్గావతి.]

'నా ప్రియమైన నాథా! దల్పత్రాయ్ ప్రభూ! ఎంతో ధనాన్ని వెచ్చించి ఈ సుందరమైన 'మదన్—మహల్'ను నాకోసం నిర్మించవలసిన అవసరం ఏమొచ్చింది? ఢిల్లీ చక్రవర్తి అక్బరుకు తల వంచని వీరుణ్ని భర్తగా ఇచ్చిన అదృష్టానికి భగవంతుడికి నిత్యమూ కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. అంతకంటే నాకు వేరే భాగ్యమేమి కావాలి? ఈ భవనాలు, మణిమాణిక్యాలు సంపదలు నాకేమీ అక్కరలేదు. మిమ్మల్ని నా భర్తగా పొందిన ఆనందమే నాకు చాలు.'

— రాణీ దుర్గావతి.

[రాణీ దుర్గావతికి ఒక కుమారుడు కలిగాడు. అతని పేరు వీరనారాయణ్. అతడే గోండవనానికి తరువాతి వారసుడు. కుమారుడు పసితనంలో వుండగానే దల్పత్రాయ్ ఆకస్మాత్తుగా మరణించాడు. కర్తవ్య నిర్వహణను దృష్టిలో వుంచుకొని దుర్గావతి మనసును రాయి చేసుకుంది. కుమారుడికి మంచి శిక్షణ ఇచ్చి, తన మనోవ్యాకులత అతనికి ఏ మాత్రమూ తెలియనివ్వకుండా పెంచసాగింది. గోండరాజ్యం పెద్ద విస్తీర్ణతతో మవగారు వేయి పట్టణాలు, పల్లెలతో నిండివుండేది. ఇరవైవేల అశ్వికదళము, వేయి ఏనుగులు ఆమెకు అండగా వుంటూ వుండేవి. ఆమె సైన్యంలోని వారందరూ వీరులే. పదిహేను సంవత్సరాల పాలనలోను ప్రజలను కన్న బిడ్డల్లా చూసుకున్నది దుర్గావతి. పొరుగురాజ్యాల ఒత్తిడి తన రాజ్యానికి తగలనివ్వకుండా కాపాడింది.]

'దుర్గావతి రాజ్యాన్ని హస్తగతం చేసుకో

తాలన్న నా కాంక్ష నెరవేరేట్టు లేదు. రెండు సార్లు పరాజయాన్ని పొందాను. బాజ్ బహదూర్‌లా నోరుమూసుకు కూచోవడానికి నేనేం చేతకాని వాడినికాను. నేను ఢిల్లీ సామ్రాజ్యాధినేతను. సార్వభౌముణ్ని! ఇప్పుడే ప్రధాన సైనికాధికారి అసఫ్‌ఖాన్‌కు కబురంపి గోండు రాజ్యాన్ని కొల్లగొట్టి రమ్మంటాను. రాజ్యాన్ని పిడికిలిలో బిగించి దుర్గావతి దుర్గాన్ని వశంచేసుకుంటాను..'

—అక్బరు చక్రవర్తి.

[అక్బరు చక్రవర్తి యుద్ధానికి కాలు దువ్వుతున్నాడని విన్న దుర్గావతి అరణ్య ప్రాంతంలోని ఆటవికుల్ని అందర్నీ చేరదీసింది. దండోరా వేయించి ప్రతివారిచేత కత్తి పట్టించింది. లెక్కలేనంతమంది గోండువిలుకాండ్రు ఉత్సాహంతో యుద్ధంలో పాల్గొన్నారు. దుర్గావతి ఏనుగుమీద అధిష్టించింది. ఆమె కుమారుడు వీరనారాయణ్ ఆమె ప్రక్కనే స్వారీచేస్తూ వస్తున్నాడు. వీరనారాయణ్ సవ్యసాచిలా యుద్ధంచేశాడు. కాని దెబ్బతిని పడిపోయాడు. సైన్యమంతా తునాతునకలయిపోయింది. మూడువందల గోండులు దుర్గావతి చుట్టూచేరి ఆమెను రక్షించడానికి ఉద్యుక్తులయారు. కాని ఆమె వారి రక్షణను స్వీకరించలేదు. సైన్యాన్ని చీల్చిచెండాడి తన అక్కసునంతా తీర్చుకోవాలని చూసింది. విధివశాత్తు ఒక బాణం ఆమె కంట్లో దిగింది. రెండవది కుడి భుజంలో నాటుకుంది. ఆమె శక్తిహీన అయింది. అప్పుడు కూడా ఆమె ఆత్మగౌరవం, అభిమానం కించిత్తయినా తొణకలేదు. పగవారిచేతుల్లో తన భవిష్యత్తును ఊహించుకొని వెంటనే కత్తితీసి గుండెల్లో పొడుచుకుని యుద్ధరంగంలో పడిపోయింది.]

'దుర్గావతి అసమాన ప్రతిభకల రాణి. ఆమె పరిపాలనలో లోపమనేది లేదు. స్వతంత్రం కావాలనుకోవడమే ఆమె లోపం.'

'భారతదేశ చరిత్ర'లో—విన్సెంట్ స్మిత్.

'కొండలలోవున్న రాణి దుర్గావతి జ్ఞాపక చిహ్నం ఆమె చరిత్రను మరువకుండా చేస్తుంది. జయభేరీలు ఆమె సమాధి నుంచి మ్రోగడం ఇంకా వింటూనే వున్నామని అక్కడి ప్రజలు ఇప్పటికీ చెబుతున్నారు. యాత్రికులు ఆమె సమాధిని దర్శించి ఎంతో వినమ్రభావంతో శ్రద్ధాంజలి ఘటిస్తూ వుంటారు. పదహారేళ్ళ క్రితం నేనా ప్రదేశాన్ని దర్శించగానే నాలో ఆమె గురించి రాయాలన్న భావన కలిగింది.'

(బ్రిటిష్ ఐ. సి. యస్. ఆఫీసర్—స్లీమన్.

—వి. సు

# జనాభా పెరుగుదల కారణాలేమిటి?

డాక్టర్ జాయిస్ బ్రదర్స్

మానవుడు త్వరలో ఈ గోళాన్ని వదిలి ఇతర గోళాలకి వలస వెళ్ళవచ్చు. ఈ వలసకి కావలసినంత జనాభా తయారు చెయ్యటానికి మానవుడు సిద్ధం అవుతున్నాడంటాడు ఒక రష్యన్ శాస్త్రజ్ఞుడు. కాదంటాడు ఒక అమెరికన్ జనాభా నిపుణుడు.

పై రష్యన్ శాస్త్రజ్ఞుడి పేరు ఇగార్ జాబెలిన్. అమెరికన్ నిపుణుడి పేరు రాబర్ట్ కుక్—ఆయన అమెరికాలో జనాభా 'బ్యూరో' ఒకదానికి అధ్యక్షుడు. ఈయన వాదం—నేడు జనాభా పెరుగుదల నిరక్షరాస్యులలోనే అధికంగా ఉంది, వీరికి అంతరిక్షయానం గురించి ఏమితెలుసు? మామూలుగా పెరిగే జనాభా సంఖ్య కారణాలు ఇంత సూక్ష్మం కావని అంటాడు రాబర్ట్ కుక్. మనలో చాలామందికి కుక్ వాదమే సబబుగా తోస్తుంది!

కాని, ప్రత్యుత్పత్తి (రిప్రొడక్షన్) వెనుక మనకి సరిగ్గా అర్థంకాని సూక్ష్మ శక్తులు చాలాదాగి ఉన్నాయని మనస్తత్వ శాస్త్రజ్ఞులు చెప్తారు. చాలాకాలంగా గొడ్రాలుగా ఉన్న ఒక స్త్రీ హటాత్తుగా గర్భవతి కావచ్చు. అసలు గొడ్రాలుగా ఉండటానికి కారణం ఆ స్త్రీలో గాఢంగా—ఆమెకి తెలియకుండానే—దాగిఉన్న భయం లేక అయిష్టం అయి ఉండవచ్చు. అంటే, ఆమెకి గర్భం దాల్చటం అంటే భయంగా ఉండవచ్చు లేదా అనేక కారణాలవల్ల ఇష్టం లేకపోవచ్చు.

పరిశోధనలవల్ల మరికొన్ని వింత విషయాలు తెలిశాయి. భర్తలమీద కోపం ఉన్న వనితల శరీరాలు గర్భం ధరించటానికి వీలు లేకుండా మారిపోతాయి. కొందరు తమకి స్త్రీలుగా తగిన గౌరవం లభించలేదనుకుని తమకి తెలియకుండానే గొడ్రాళ్ళుగా అయిపోతారు.

యుద్ధసమయాలలో, ఇతర ప్రమాదకరమయిన పరిస్థితులలో జనాభా పెరుగుతూ ఉంటుంది. ఇరుకు పరిస్థితులలో నివసించే ప్రాణుల ఉత్పత్తి శక్తి తగ్గుతుందని ఎలుకలు మొదలయిన జంతువుల మీద జరిపిన పరిశోధనలు తెలుపుతాయి. గుంపు మరీ అధికం అయితే జంతువులు తమ పిల్లలని చంపివేస్తాయి.

ఈ పరిశోధనలకీ ఇరుకు ఇళ్ళలో నివసించే స్త్రీల విషయంలో జరిగిన పరిశోధనలకీ పోలికలు కనిపిస్తాయి. సంతానం గురించి వివిధ పరిస్థితులలో జీవించే మనుష్యుల వైఖరులు అంత భిన్నంగానూ ఉంటాయి.

ఏది ఎలా ఉన్నా, శ్రీ జాబెలిన్ చెప్పినంత సూక్ష్మం కాకపోయినా జనాభా పెరుగుదల కారణాలు సాధారణంగా అందరూ అనుకునేటంత నిరర్థకమయినవి మాత్రం కావు.

(ఇన్‌ఫో)




మధ్యాహ్నం ఒకటిన్నర గంటలకాలం. ఢిల్లీలోని పార్లమెంటు వీధి దృశ్యం. రిజర్వ్‌బ్యాంకువద్ద సిటీ బస్సుదిగి ఒక్కసారి చుట్టూవున్న ఎత్తయిన భవనాలవైపు దృష్టి సారించాను. భవనాలముందు అందమైన చిన్న గార్డెన్సు కొద్ది లాన్సుతో చూడటానికి అందంగాఉండి భవనాలకు మరింత కళనిస్తున్నవి. లాన్సనిండా రకరకాల డ్రస్సులతో ఉద్యోగస్తులు చిన్నచిన్న గుంపులుగా కూచొని కబుర్లు చెప్పుకుంటూ మధ్యమధ్య పెద్దగా నవ్వుకుంటూ టిఫిన్ బాక్సులలో తెచ్చుకున్న ఫలహారాలు తింటున్నారు. చాలామంది సూట్లలోనే ఉన్నారు. అందులో కొంతమంది కోట్లను విప్పి తొడలమీద పెట్టుకొన్నారు కూర్చొని. చలికాలం గనుక మధ్యాహ్నమైనా చలిగానే ఉన్నది. మధ్యమధ్య చలిగాలి వీచినప్పుడు చలి బాగా అనిపిస్తున్నది. రోడ్డుమీద వచ్చే పొయ్యే కార్లతో, సిటీ బస్సులతో, సిటీ బస్సులందుకోవడానికి పరుగెత్తే మనుష్యులతో రోడ్డంతా సందడిగాఉంది. జేబులో నుండి అడ్రసుతీసి చూసుకొని ప్రక్కనే వెళ్తున్న ఒకాయన్ను అడిగాను సెంట్రల్ స్టాటికికల్ ఆర్గనైజేషన్ ఎక్కడని. ఆయన పక్కనేఉన్న ఒక పెద్దభవనం వైపు చూపిస్తూ అందులో మూడవ అంతస్థులో ఉన్నది అని చెప్పాడు హడావిడిగా వెళ్తూ.

లోపలకు వెళ్ళాను. ఎన్‌ట్రెన్సుకు దగ్గరలోనేఉన్న రిసెప్షనిస్టువద్దకు వెళ్ళి డాక్టర్ టి. కె. మూర్తిని కలుసుకోవాలని అడిగాను. ఆమె ప్రస్తుతం రెండుకొట్టే వరకు ఆఫీసుకు లంచిటైమనీ, రెండుకాగానే ఆయనకు ఫోనుచేసి కనుక్కొని ఆయన పంపమంటే పాస్‌యిచ్చి పంపుతాననీ చెప్పి, అప్పటిదాకా వెయిట్‌చెయ్యమని ప్రక్కనే వరుసగా ఉన్న కుర్చీలవైపు చూపించింది. థాంక్స్‌చెప్పి కుర్చీలో కూలబడ్డాడు.

మనస్సు స్థిమితంగాలేదు. ఆ టి. కె. మూర్తిగారు ఏమంటాడో, ఖాళీలేమయినా ఉన్నయ్యంటాడో, ప్రస్తుతం ఏమీలేవు పొమ్మంటాడో. అసలు సరిగా మాట్లాడతాడో మాట్లాడడో. బహుశ మాట్లాడవచ్చు. ఆయనకు వీలయితే సహాయం కూడా చెయ్యవచ్చు. ఎందుకనంటే, తను ఢిల్లీ వస్తూ ఆగ్రాలోదిగి చౌదరిగారిని కలుసుకొని, నేను ఎం.ఎస్.సి. చదువుతూ ఆగ్రాలో ఉన్న రెండేళ్ళలో ఆయనతోఉన్న పరిచయాన్ని పురస్కరించుకొని ఆయనకు ఢిల్లీలో పెద్దహోదాలోఉన్న స్నేహితులెవరైనాఉంటే వాళ్ళకిలెటర్స్ వ్రాసియిస్తే వాటిని నేను ఉద్యోగం సంపాదించుకోవడానికి ఉపయోగించుకొంటానని అడిగినప్పుడు ఆయన, ఓ. అలాగే. కాని మీ స్టాటిస్టిక్సుకు సంబంధించిన పెద్ద ఉద్యోగాలలో నాకు అంతగా ఎవరూ తెలియదు. అయినా సి. యస్. ఓ. లో ఉన్న టి. కె. మూర్తి మీ లైనులోవాడే కనుక అతనివల్ల మీకే

పైనా లాభం కల్గవచ్చునని ఆయనకు అలాగే ఫుడ్ అండ్ ఎగ్రికల్చర్ మినిస్ట్రీలో, డిప్యూటీ డైరక్టరు డాక్టరు సూర్యనాథం, అనే ఆయనకూ ఉత్తరాలు వ్రాసి యిచ్చారు. చౌదరిగారు చాలా పెద్ద మనిషి. సహాయ కారి. పైగా పెద్ద ఉద్యోగంలో ఉన్నారు. అందువల్ల ఈ టి. కె. మూర్తి గారు చౌదరిగారి ఉత్తరానికి విలువ యివ్వ వచ్చు. అయినా ఖాళీలు లేనప్పుడు, ఆయన ఏమీ చెయ్యగలిగింది లేనప్పుడు ఆయన మాత్రం ఏం చేస్తాడు. అసలు ఈ వెధవ స్టాటిస్టిక్సు ఎమ్మెస్సీ చదవకుండా మరొక సబ్జక్టు చదవాల్సింది. ఇంత బొత్తిగా ప్రాస్పెక్ట్సు ఉండవని అనుకోలేదు. మేలో రిజల్ట్సు వచ్చింది మొదలు యిప్పటిదాకా గుంటూరునుండి సుమారు 10, 12 ఉద్యోగాలకు అప్లై చేసినా ఒక్కడూ యింటర్వ్యూకు కూడా పిలవలేదు. హాయిగా బి.యి. మెకానికల్ చదవాల్సింది. చేరటమే కనీసం 400 రూ.లు వచ్చే ఉద్యోగంలో చేరేవాడ్ని. బి.యస్సీలో వచ్చిన హై ఫస్టు క్లాసు బాగా ఉపయోగించుకో లేకపోయాను. అయినా యిప్పుడనుకొని ఏం లాభంలే; అలా రాసిపెట్టుంది, జరిగింది. చివరకు ఈ స్టాటిస్టిక్సు లైనులోనన్నా పైకివచ్చేందుకు ప్రయత్నం చెయ్యాలి.

'మిస్టర్! మీ పేరు, అడ్రసు, కాగితం మీద రాసివ్వండి డాక్టరు మూర్తికి ఫోను చేస్తాను' అని అడిగింది రిసెప్షనిస్టు ఆమె టేబుల్ మీద ఉన్న కాగితాల వైపు చూపిస్తూ. దాని మీద 'పి.యల్. మూర్తి ఫ్రమ్ శ్రీ ఎస్. కె. చౌదరి, ఆగ్రా' అని వ్రాసిచ్చాను. ఆమె ఫోను చేసి నాకు పాస్ యిచ్చి 306 నెంబరు రూము అని చెప్పింది. కొద్ది నిముషాలలో ఆ రూముకు వెళ్ళాను. బయట ప్యూన్ కూర్చొని ఉన్నాడు చీటి అతనికి యిచ్చాను. అతను లోపలకు వెళ్ళి వెంటనే తిరిగివచ్చి సాబ్ రమ్మంటున్నారు అని హిందీలో చెప్పాడు. 'డాక్టర్ టి. కె. మూర్తి; డిప్యూటీ డైరక్టర్' అని వ్రాసి ఉన్న తలుపును నెట్టుకొని లోపలకు వెళ్ళి 'గుడ్ ఆఫ్టర్ నూన్ సార్' అన్నాను. ఆయన తెలుగులో 'రండి, కూర్చోండి' అని ఆహ్వానించి కూర్చొన్న తర్వాత 'ఏమిటి విశేషాలు; చౌదరి బాగున్నాడా ?' అని మొదలు పెట్టారు. ఏకవచనప్రయోగాలు చేస్తున్నాడీయన, బహుశ చౌదరిగారితో బాగా పరిచయం ఉండవచ్చు అని అనుకొంటూ 'బాగానే ఉన్నారండి, ఈ ఉత్తరం మీకిమ్మన్నారు' అని యిచ్చాను. ఉత్తరం చదివాక ఆయన 'ఈ మధ్యనే 7, 8 మంది ఎమ్మెస్సీ స్టాటిస్టిక్సూ, ఎకనామిక్సు వాళ్ళను తీసుకొన్నామండీ. ప్రస్తుతం ఏమీ రిక్రూట్‌మెంటు లేదు. ఏదైనా వీలయితే మీకు తప్పకుండా తెలియపరుస్తాను' అని డెస్క్ డైరీలో నా పేరు, అడ్రస్ వ్రాసుకున్నారు.

'పోనీ, మీకు తెలిసినచోట్ల ఎక్కడైనా వేకెన్సీలు ఉంటే మీ ద్వారా ట్రై చేస్తే బాగుంటుందని నా ఉద్దేశ్యం.'

'అలాగే కానీండి. ప్రస్తుతం నేషనల్ కౌన్సిల్ లోనూ, నేషనల్ శాంపుల్ సర్వే లాంటి వాటిల్లో కూడా ప్రయత్నం చేసి చూడండి.'

'మీకు అక్కడ తెలిసిన వాళ్ళెవరైనా ఉంటే వాళ్ళకు మీరు ఫోనుచేస్తే నేను కలుసుకుంటాను సార్'.

'నేషనల్ కౌన్సిల్‌లో కె. యస్. రామారావుగారని స్టాటిస్టికల్ ఆఫీసరు ఒకాయన ఉన్నారు' ఆయన్ను కలుసుకోండి నేను చెప్పానని చెప్పండి.'

కాగితంమీద ఆ ఆఫీసుపేరు వ్రాసి యిచ్చారు.

'మీరు ఫోనుచేస్తే....' సణిగాను.

'అలాగే. మీరు వెళ్ళండి.'

ఈయన సహాయంచేసేటట్లుగానే ఉన్నాడనుకుంటూ రోడ్డుమీదకువచ్చి బస్సు నెంబరు తెలుసుకొని 'నేషనల్ కౌన్సిల్ ఆఫ్ అప్లయిడ్ ఎకనామిక్ రీసర్చి' చేరుకున్నాను. రామారావుగారిని కలుసుకొని 'డాక్టరు మూర్తి మీకు ఫోను చేసారనుకుంటాను నా గురించి'అన్నాను నేను ఎందుకు వచ్చిందీ చెప్పి, యింగ్లీషులో.

'మీ క్వాలిఫికేషన్' అన్నారాయన తెలుగులో మాట్లాడుతూ.

'ఎమ్మెస్సీ స్టాటిస్టిక్సు.

తర్వాత సంభాషణంతా తెలుగులోనే జరిగింది.

'ఏ క్లాసు.'

'హై సెకండుక్లాసు.'

'ఏ సంవత్సరం ప్యాసయ్యారు?'

'58.'

'ఫస్టుక్లాసు వచ్చుంటే బాగుండేది ఇక్కడ ఇంటర్వ్యూయర్ ఉద్యోగాలకు అంతా ఫస్టుక్లాసు వాళ్ళనే యింతవరకు తీసుకుంటున్నారు. సరే. ప్రస్తుతం కొద్ది వేకెన్సీలు ఉన్నట్టున్నాయి. ఎప్పుడు ఫిల్ అప్‌చేస్తారో తెలియదు. బహుశ 2, 3 నెలలు పట్టవచ్చు. ఆఫీసుల్లో అప్లికేషన్ యిచ్చివెళ్ళండి. నెలా, నెలా పదిహేనురోజుల తర్వాత నన్ను కాంటాక్టు చెయ్యండి.

'అలాగేనండి థాంక్యూ వెరీమచ్.'

'ఫరవాలేదు వెళ్ళిరండి.'

అప్లికేషన్ యిచ్చి బయటపడ్డాను. ఇంక ఎక్కడికెళ్ళడం అని కాసేపాలోచించి చౌదరిగారిచ్చిన రెండవ ఉత్తరం గుర్తుకు వచ్చి నేషనల్ శాంపుల్ సర్వేకు తర్వాత వెళ్ళచ్చునుకొని, సూర్యనాథంగారిని కలుసుకొందామని బస్సునెంబరు ఎవరినో అడిగి తెలిసికొని బస్సెక్కి 'కృషిభవన్'కు వెళ్ళాను. అప్పటికి టైము సుమారు నాలుగున్నరయింది. రిసెప్షనిస్టును అడిగాను డాక్టర్ సూర్యనాథంను కలుసుకోవాలని ఆమె ఫోనుచేసి ఆయన ఈరోజు సెలవలో ఉన్నారని చెప్పింది. ప్రాణం ఉసూరు మనిపించింది యింతదూరం అనవసరంగా వచ్చానే అని. ఇంతలో అక్కడున్న ఒకతను డాక్టరు సూర్యనాథం మర్నాడు కూడా రాకపోవచ్చునీ ఆయన వారం పదిరోజులలో అమెరికా వెడుతున్నారనీ అందువలన ఆయన్ను యింటివద్ద కలుసుకోవడం మంచిదని చెప్పాడు. ఆయన యింటి అడ్రసు నోటుచేసికొన్నాను అతనినుండి. బయటకు వచ్చాను. మధ్యాహ్నం కాఫీ త్రాగకపోవడం వల్ల తలనొప్పిగాఉంది. ఆ ఆఫీసు కాంటీనులో కాఫీ త్రాగి కరోల్‌బాగ్‌లో ఉన్న మా మెస్ (బోర్డింగు అండ్ లాడ్జింగు)కు బస్సెక్కాను 20 నిముషాలు ఆ బస్సుకోసం వెయిట్‌చేసి, అది వచ్చిన తర్వాత తగినంత రుసిస్తి పట్టి.

మర్నాడుదయం 8 గంటలకు కాల కృత్యాలు తీర్చుకొని, సీటుగా డ్రస్సైఅయి పూసారోడ్డులోనున్న సూర్యనాథంగారింటికి బయలుదేరాను. వాళ్ళనీ వీళ్ళనీ అడుగుతూ 8—30కు అయింటిని కనుక్కోగలిగాను.

గేటు తీసుకొని సెహ్మేదిగా లోపలకు నడిచాను. వరండాలో ఒక నడివయస్సాయన లుంగీ కట్టుకొని పొట్టిచేతులచొక్కా, స్వెట్టరూ వేసుకొని కుర్చీలో కూచొని పేపరు చదువుకొంటున్నాడు. బహుశ ఆయనే సూర్యనాధంగారని అనుకొంటూ, మెస్సులో నా ప్రక్కగదిలో ఉంటూ, కృషీ భవన్‌లో పనిచేస్తున్న ఒక యు. డి. సి సూర్యనాధం బహుకోపిష్టి అనీ, చాలా స్ట్రిక్టుమనిషనీ రాత్రి చెప్పిన విషయం, గుర్తుకొచ్చి బిక్కుబిక్కుమంటూ వరండాలో అడుగుపెట్టి అడిగాను యింగ్లీషులోనే.

'డాక్టర్ సూర్యనాధం ఎక్కడఉంటారు'

వెంటనే గద్దించినట్లు సమాధానం వచ్చింది.

'నేనే సూర్యనాధాన్ని ఏంకావాలి'

కొంతుతడారిపోతుండగా.

'నేను ఆగ్రాలోని చౌదరిగారినుండి వస్తున్నాను'

వెంటనే ఆయన తెలుగులో.

'రండి,రండి. మీరు చౌదరిచుట్టాలా?' అన్నారు లోపలికి దారి చూపిస్తూ ఆయన కూడా లేచి లోపలికి నడుస్తూ.

ఏమి సమాధానం చెప్పాలో తోచక మౌనంగా ఆయనవెంట ముందు గదిలోకినడిచాను మళ్లీ అడిగారు ఆయన.

'చౌదరి మీకు బంధువా?'

'కాదండి స్నేహితులు' అన్నాను, ఉత్తరం తీసియిస్తూ.

'స్నేహితుడా' అన్నారు ఆయన 28 ఏళ్ళ వాకూ, 45 ఏళ్ళుండి పెద్ద పదవిలోనున్న చౌదరిగారికి స్నేహమేమిటని కాబోలు ఆశ్చర్యపోతూ.

'.......'

ఉత్తరం చదువుకున్నారు.

'మీరు ఏ ఉద్యోగానికి ట్రైచేస్తున్నారు?'

'స్టాటిస్టికల్ అసిస్టెంటు ఉద్యోగానికండి.'

'210—425 స్కేలుదా?'

'అవునండి.'

ప్రస్తుతం ఎక్కడన్నా యింటర్వ్యూ వచ్చిందా?'

'ఇంకాలేదండి.'

'నేనూ ఎక్కడన్నా కనుక్కుంటాను. మీరుకూడ ప్రయత్నంచెయ్యండి ఎక్కడైనా

# ఇన్‌ఫ్లుయెన్సు

యింటర్వ్యూవస్తుందేమో.ఇంటర్వ్యూవస్తే అందులోఉండే మెంబర్లలో ఎవరితోనైనా మాట్లాడవచ్చు.

'అలాగేనండి' మీ ఆఫీసులో ఏమైనా...

'మా ఆఫీసులో కుదరదు' నిర్మొహమాటంగా చెప్పారు. కొంచెం కష్టమనిపించింది నాకు. ఇంతలో టీ వచ్చింది.

'టీ తీసుకోండి.'

'నేను తీసుకొనే మీ యింటికి బయలుదేరానండి.'

'మరేం ఫరవాలేదు. మరోమారు తీసుకోవచ్చు. మొహమాటపడకండి' తీసుకున్నాను.

'వస్తానండి. మీకు మళ్ళీ ఎప్పుడు కన్పించమంటారు?'

'3, 4 రోజులాగిరండి. అయినా నేను 10 రోజుల్లో డెప్యుటేషన్‌మీద అమెరికా వెడుతున్నాను. ఈలోగా 24 రోజులు మా ఊరు వెళ్ళిరావాలి. మీకు నేను ఎక్కువ సహాయపడటం ఈకొద్ది వ్యవధిలో కష్టం. అయినా చూద్దాం వెళ్ళిరండి.'

* * *

ఆరోజురాత్రి మెస్సులో భోజనాలయింతర్వాత అజ్మల్‌ఖాన్ రోడ్డుమీదకువచ్చి కిళ్లీ వేసుకొంటూవుంటే ఆగ్రాలో మా హాస్టల్లో ఉండి ఎమ్.ఏ సోషియాలజీ చదివిన రామ్మోహన్ కన్పడ్డాడు. ఎప్పుడూ నవ్వుతూ హుషారుగా ఉంటాడు. కబుర్లపుట్ట. ఎన్నిగంటలయినా అనర్గళంగా కబుర్లు దంచుతునే ఉంటాడు మనం మధ్యలో ఆపకపోతే. హాస్టల్లో ఉండగా తరచూ నా రూముకు వచ్చి బాతాఖానీ వేసేవాడు. అతనిలో ఉన్న మంచితనం ఏమిటంటే—అతని వాక్ప్రవాహానికి మనం అడ్డుపడి 'రామ్మోహన్‌గారూ! ఇంక చదువుకోవాలి మీరు ఏమీ అనుకోకపోతే—' అంటూండగానే 'హ్హా! భ్హా లేవాలే! అనుకోటం ఎందుకు సార్. నేను బాగా చదవనని మీ చదువు చెడగొడతా ననుకున్నారా. హాయిగా చదువుకోండి. చదివి చదివి బోరుకొడితే మాత్రం నన్నుకేకెయ్యండి. మళ్లీ గాపిప్పేసుకుందాం' అని, ఈల వేసుకొంటూ వెళ్ళిపోయేవాడు. సాధారణంగా వరండాలో ఈల విన్పడితే అతను వస్తున్నట్లు గుర్తు. అందుకని తెలుగువాళ్ళలో కొందరం

అతన్ని ఈలవాలాస్ అని పిల్చుకునేవాళ్లం. పరీక్షలయిన తర్వాత అతను మళ్ళీ యిదే కన్పడటం. నన్ను చూసి చూడ్డంతోటే—

'హల్లో మూర్తిగారు! ఎప్పుడు రావడం? ఏమిటి విశేషాలు? హ్హా! భలేగా కలిశారంటి' అన్నాడు నవ్వుతూ.

నేను ఎప్పుడు, ఎందుకు వచ్చిందీ చెప్పి అతని విషయం అడిగాను. అతను నవ్వుతూ 'ఇంకా యింత దూరం ఎందుకు వస్తాం సార్. నేనూ అందుకే. ఈ రోజుల్లో చలా మంది పోస్టుగ్రాడ్యుయేట్‌లు. డాక్టరేట్‌లు పాస్ అయిన వెంటనే బొంబాయికో, ఢిల్లీకో రైలెక్కుతున్నారు ఉద్యోగాలకోసం. నేనిప్పుడు రామానుజం మెస్సులో ఉంటున్నాను, రండి నాతో; చూపిస్తాను యింకా ఎంతమంది ఈ ఉద్యోగపు వేటగాళ్ళున్నారో. అసలు ఈ కరోల్‌బాగ్‌లో ఉన్న మెస్సులను సగం పోషిస్తున్నదీ వాళ్ళూనూ, మిగతాది ఉద్యోగం వచ్చి సంసారాలు లేనివాళ్ళూనూ. రండి రూముకుపోయి మాట్లాడుకుందాం. అని దోవ తీశాడు.

రూములో అడిగాను. ఏ క్లాసు వచ్చిందని!

'ఇంకే క్లాసు సార్! జనతా! హ్హా!హ్హా!హ్హా. అది మనకు తప్పదు. నార్తిండియా రావడం మొదలుపెట్టి 3 ఏళ్ళయింది. ఇంతవరకు 10, 12 సార్లు ఈ మెయిన్ లైన్ మీద రైళ్ళలో తిరిగాను. అన్నిసార్లు జనతా ఎక్స్‌ప్రెస్‌లో వచ్చి వెళ్ళక తప్పలేదు. పరీక్ష అయింతర్వాత మాత్రం పట్టుబట్టి, నానా అవస్థలు పడి, జి. టి. ఎక్స్‌ప్రెస్‌లో యింటికి వెళ్లాను ఎమ్. ఏ. వరకు అన్నీ థర్డు క్లాసులే కనుక. అయినా తప్పలేదు మూర్తిగారూ! లైఫంతా జనతా అయిపోయింది సార్!' అన్నాడు విచారం నవ్వు మిళాయిస్తూ.

నాకు జాలేసింది. రామ్మోహన్ స్వతహాగా తెలివయినవాడు. ఏకసంథాగ్రాహి. కాని అతను పరీక్షలను చాలా తేలికగా తీసుకొనేవాడు. పట్టుబట్టి చదవలేకపోయేవాడు. ఎప్పుడన్నా మూడ్‌వచ్చి సీరియస్‌గా చదువు మొదలుపెట్టి 1, 2 రోజులు చదవగానే యింతలో ఎవడో ఒక స్నేహితుడు సిని మాకు బయలుదేరదీసేవాడు. అంతే. ఆ మూడ్‌కు అంతటితో ఫుల్‌స్టాప్ ఒకటి ఒకటిన్నరనెలలవరకు మొదట్లో, పిలవిప్

'పని చెయ్యడానికి 2, 3 నెలలు చాలులే అని అశ్రద్ధచేసేవాడు. పరీక్షలు రెండు మూడునెలలుండగా చదువు మొదలుపెట్టి చదివాల్సింది అర్థంచేసుకోని నిరాశపడి పోయేవాడు.

'ఏమైనా ఛాన్సులు కన్పడుతున్నాయా మీప్రయత్నంలో' అడిగాను.

'లేదుసార్. ఈ ఊళ్ళో మా బావగారు ఫైనాన్సు మినిస్ట్రీలో డిప్యూటీ సెక్రటరి. ఆయనద్వారా ప్రయత్నంచేస్తున్నా. వచ్చినెల రోజులయింది. ఐ.ఏ.ఎస్.కుగాని, ఎల్లయిడ్ సర్వీసెస్ కుగాని కాంపీటుచేద్దామని ఈ ఊరులోచేరాను, ఎన్నాళ్ళు మట్టాలింట్లో ఉంటాయని. అన్నట్లు మీ ప్రయత్నా లెంతవరకువచ్చాయి?' జరిగింది చెప్పాను. తర్వాత మాటల్లో తనకుగూడ నాకు మాదిరే యిద్దరు ముగ్గురు ఆఫీసర్లు తన పేరు నోటుచేసుకొన్నారని. తర్వాత కనబడ మన్నారని చెప్పాడు.

* * *

మర్నాడు 'ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఎకనామిక్ గ్రోత్' అనే ఆఫీసుకువెళ్ళాను. రామ్మోహన్ అందులో పోస్టులు ఉన్నట్లు విన్నానని రాత్రి చెప్పిన దానినిబట్టి అక్కడ రిజిస్ట్రారును కలుసుకొన్నాను. ఆయన 5, 6 రోజుల్లో యింటర్వ్యూలు జరుగు తవని అప్లికేషన్యిచ్చి వెళ్ళి కన్సిడర్ చేస్తామని చెప్పాడు. నావద్ద రెడీగాఉన్న అప్లికేషనుపై ఆ ఆఫీసు అడ్రసు వ్రాసి

# ఇన్‌ఫ్లుయెన్సు

యిచ్చివచ్చాను. మూడురోజుల తర్వాత యింటర్వ్యూ లెటర్వచ్చింది. అది తీసికొని సూర్యనాథంగారింటికి వెళ్ళాను. ఆయన అప్పుడే ఊరినుండి వచ్చారు. సంగతివిని ఆ యింటర్వ్యూకమిటీలో బహుశ జైన్, శ్రీవాత్సవ, గుప్త అనేవాళ్ళుంటారనీ, తను శ్రీవాత్సవతో మాట్లాడుతాననీచెప్పి, యింట ర్వ్యూకు బాగా తయారయివెళ్ళమనిచెప్పారు. ఆయన ఎటూ తిరిగివెడుతున్నారుకదా అని గుర్తొచ్చి 'మీరు వెళ్ళేలోగా ఎవరికన్నా ఇంట్రడ్యూస్ చేసివెళ్తే నేను వాళ్ళద్వారా కూడా ప్రయత్నంచేస్తాను' అన్నాను. ఆయన 'అలాగే. నేషనల్ శాంపుల్ సర్వేలో సుబ్రహ్మణ్యమని స్టాటిస్టికల్ ఆఫీసరు ఉన్నాడు, ఆయనన్నా, హెల్త్ అండ్ డిస్పోసల్స్లో డాక్టర్ జి. యం. సింగ్ అనే అసిస్టెంటు డైరెక్టరు ఉన్నాడు, ఆయనన్నా కలుసు కోండి. నేను వాళ్ళతోచెప్పి వెళతాను' అన్నారు.

అప్పటినుండి ప్రయత్నాలుమానేసి యింట ర్వ్యూకు చదవడం మొదలుపెట్టాను. బాగానే ప్రిపేరయి వెళ్ళాను. ఇంటర్వ్యూలో సంతృప్తికరంగానే జవాబులు చెప్పాను. ఇంటర్వ్యూ తర్వాత 2, 3 రోజులు ఫైనాన్సు సైన్సులేదరేట్లులోనా, ఆడిట్ స్టాటిస్టికల్ ఆర్గనైజేషన్లోనా, మరి కొన్ని ప్రైవేటు కంపెనీలలోనూ కనుక్కొని

కలుసుకొన్నాను. సూర్యనాథంగారు చెప్పిన నేషనల్ శాంపుల్ సర్వేలోని సుబ్రహ్మణ్యం గారిని కల్సుకొని సూర్యనాథంగారు కలుసుకో మన్నట్లు చెప్పాను. ఆయన ఏమిటనని అన్నారు. సూర్యనాథంగారు చెప్పలేదా అని ఆశ్చర్యపోతూ నాపని చెప్పాను. ఆయన 'ఏమీ ఖాళీలులేవు. ఇప్పట్లో నేకెన్సీలువచ్చే అవకాశాలుకూడలేవు' అన్నారు. అంటూ ప్రక్కసీటులో కూర్చొన్నాయనకేసి చూశారు నవ్వుతూ. బయటకువచ్చాను. అక్కడనుండి సింగుగారివద్దకుపోయాను. సింగుగారు ప్రస్తుతం ఖాళీలులేవని, నెలరోజులలో ఎంప్లాయిమెంటు ఎక్స్ఛేంజిద్వారా 4, 5 పోస్టులురిక్రూట్ చేస్తామనీ,కనుకఎంప్లాయి మెంటు ఎక్స్ఛేంజిలో రిజిస్టరుచేసుకొని, తన ఆఫీసువాళ్ళు కొండడేట్లు లిస్టు పంపమని ఎంప్లాయిమెంటు ఎక్స్ఛేంజిని కోరగానే తన పేరుగూడ ఆలిస్టులో పంపేటట్లు చేసుకో మనీ చెప్పారు. అంతవరకువస్తే అప్పుడు తను ప్రయత్నం చెయ్యగలననిచెప్పారు. ఎంప్లాయిమెంటు ఎక్స్ఛేంజిలో త్వరగానే రిజిస్టరు చేసుకున్నాను. కాని అప్పుడే ఎలా నాపేరు పంపుతారు? సంవత్సరం క్రిందట రిజిస్టరు చేసుకొన్నవాళ్ళ టర్నే యింతవరకు రాలేదని తెలిసింది. ఇక నా సంగతేమిటి. ఆలోచించుకుంటూ రూముచేరాను.

మర్నాడు, మళ్ళీ సి. యస్. ఓ లోని మూర్తిగారివద్దకు వెళ్ళాను. ఆయనకి సంగతిచెప్పి ఎంప్లాయిమెంటు ఎక్స్ఛేంజిలో ఆయనకు తెలిసినవాళ్ళెవరైనా ఉన్నారేమో నని అడిగాను. ఆయన తనకు 'డైరెక్టరేట్ జనరల్ ఆఫ్ ఎంప్లాయిమెంట్ ఎండు ట్రెయినింగ్'లో అసిస్టెంటు సెక్రటరీ రెడ్డి గారు తెలుసనీ, ఆయన్ను కలుసుకోమనీ చెప్పారు. తను ఆయనకు టెలిఫోను చేస్తా నని కూడ అన్నారు. రెడ్డిగారి ఆఫీసుకు వెడితే ఆయన టూరులో ఉన్నారనీ, ఆయనా తిరిగిరావడానికి యింకా 3, 4 రోజులు పట్టవచ్చుని ఆయన ప్యూను చెప్పాడు. వాడితో కొంచెం కబుర్లు మొదలెట్టాను రెడ్డిగారిని గురించిన వివరాలేమయినా తెలుసుకోవచ్చుని. అతను, అయ్యగారు పోధార ణంగా తెలుగువాళ్ళకు సహాయం చేస్తాడని చెబుతూ మీరు తెలుగువాళ్ళేనా అని అడి గాడు. నేను సమాధానం చెప్పకుండా నీవు



ఎక్కడివాడివి అని అడిగాను. అతను యు.పి. వాడినని చెప్పాడు. మళ్ళీవస్తానే అని చెప్పి వచ్చేశాను.

మరో 3, 4 రోజులు రాత్రిళ్ళు రామ్మోహన్‌తో పాస్కు, పగలు మరికొన్ని ఆఫీసులు, కంపెనీలకు తిరగడంతో గడిపాను. వాటిలో రెండోరోజుమాత్రం ఢిల్లీ క్లాత్ మిల్స్‌లో అడిగితే, ఆ మర్నాడు అక్కడ సైంటిఫిక్ అసిస్టెంట్లకు సెలక్షను జరుగుతుందనీ, నేనుకూడ టెస్టుకు రావచ్చనీ, చెప్పాడు పర్సనల్ ఆఫీసరు. మర్నాడువెళ్ళి రిటెన్‌టెస్టు వ్రాశాను. 36 మంది వచ్చారు పరీక్షకు, అందులో బి.యస్సీ.లో ఫస్టుక్లాసుఉన్నవాళ్ళం నలుగురం ఎమ్మెస్సీలు ఆరుగురం, ఆ టెస్టులో ఆరుగురు సెలక్టయినట్లు చెప్పి వాళ్ళ పేర్లు చదివి, వాళ్ళు ఆ మర్నాడు 10 గంటలకు యింటర్వ్యూకు రావచ్చని చెప్పారు. అందులో నేనుకూడా ఉన్నాను గనుక మర్నాడు యింటర్వ్యూకువెళ్ళాను. రికమెండేషన్‌కోసం ప్రయత్నంచేసే టైము లేకపోయింది. అలాగే వెళ్ళాను. ఇంటర్వ్యూకువచ్చిన వాళ్ళలో నలుగురు ఎమ్మెస్సీలు యిద్దరు బయస్సీలు ఉన్నారు. అందులో ఒకతను బొంబాయినుండివచ్చాడు. అతను తను సెలక్టవుతానని ధీమాగా ఉన్నాడు. తనూ ఏమ్మెస్సీ కనుకనూ, 3 ఏళ్ళ అనుభవం ఉంది కనుకనూ, తను అప్లికేషనులో 400కు జీతం తక్కువ యిచ్చేటట్లయితే యింటర్వ్యూకు పిలవవద్దని రాశినా సెకండ్ క్లాస్ చార్జీలిచ్చి యింటర్వ్యూకు పిలిచారు కనుకనూ. ఇంటర్వ్యూలు అరగంటలో అయిపోయినవి. ఒక బి యస్సీ (సెకండ్ క్లాసు) అతను సెలక్టయినట్లు ఎనౌన్సు చేశారు. నాకు ఆశ్చర్యం కలిగింది ఎమ్మెస్సీవాళ్ళలో ఎవరూ సెలక్టు కాలేదే అని. ఇదే తర్వాత రామ్మోహన్‌తో అంటే 'అదో కరకమైన టాక్టిక్సు, ఎమ్మెస్సీ ఒకట్రెండ క్లాసు వాళ్ళను తీసుకుంటే మొదటవాళ్ళకు కనీసం 350, 400 రూపాయలు యివ్వాలి. వాళ్ళు ఉద్యోగంలోచేరి కొంత అనుభవం గడించగానే మరోచోట ఇంకో వందో, రెండొందలో ఎక్కువిస్తామని ఆఫర్లువస్తాయి. అప్పుడువాళ్ళను పోకుండా చేసుకుంటానికి అంత జీతం ఈ కంపెనీవాళ్ళు యివ్వాలి. అలా కాకుండా బియస్సీ సెకండుక్లాసువాళ్ళైతే కనీసం 5, 6 సంవత్సరాలు కదలక పోవడానికి అవకాశం ఎక్కువ. ఈ లోగా వాడినుండి, కంపెనీవాళ్ళు వీలయినంత పని రాబట్టుకోవచ్చు' అన్నాడు. అయితే రామ్మోహన్ ఇలాంటి వ్యవహారాల్లో బాగానే అనుభవం గడించాడన్నమాట.

ఆ మర్నాడే రెడ్డిగారిని కలుసుకోగలిగాము. ఆయన తనుచేయగలిగింది ఏమీ లేదనీ, అయినా ఎంప్లాయిమెంట్ ఆఫీసర్ మిగానన్‌ను కలుసుకొని రిక్వెస్టుచేస్తే అతను మంచివాడు కనుక సహాయం చెయ్యవచ్చనీ చెప్పారు. ఆయననూ మిగానన్‌కు టెలిఫోనుచెయ్యమని అడిగాను. రెడ్డిగారు 'అక్కర్లేదు. మీరు వెళ్ళి మాట్లాడండి. ఏమయిందో ఫోనులో చెప్పండి. మీరు రానవసరంలేదు' అన్నారు. వెంటనే ఆరబ్‌కిసరాయిలో ఉన్న ఎంప్లాయిమెంటు ఎక్స్చేంజికి వెళ్ళి మిగానన్‌ను కలుసుకొని రిక్వెస్టుచేసి రెడ్డిగారు ఆయన్ను కలుసుకోమని సలహా యిచ్చినట్లు చెప్పాను మిగానన్ కొంచెంసేపు ఆలోచించి 'అయితే మీరు ఏ ఆఫీసులో ప్రయత్నంచేస్తున్నారని' అడిగాడు. చెప్పాను. డి. జి. యస్. డి.లోవని సింగ్‌గారు చెప్పిన సలహాకూడా చెప్పాను. అప్పుడు మిగానన్ నవ్వి 'అది మీలాంటి ఉద్యోగపు వేటగాళ్ళనుండి తప్పించుకొటానికి చెప్పేమాటలేకాని నిజంగా మేము మీపేరు పంపినా వాళ్ళు యింటర్వ్యూకు కూడా పిలవరు. అయినా సీరియల్ ఆర్డరులో కాండిడేట్ల పేర్లు పంపాల్సిందే గాని వెనకాముందు చెయ్యడం వీలుండదు. అయినా డి.జి.యస్.డి.(డైరెక్టరేట్ జనరల్ ఆఫ్ సప్లయిస్ అండ్ డిస్పోసల్స్) మమ్మల్ని ఎప్పుడడిగినా 50, 60 మంది తిన్నకు తక్కువ అడగరు. కనుక మీకు గూడా 'కాల్' రావచ్చని అనుకుంటున్నాను' అన్నాడు.

తర్వాత 10 రోజులు యిలాంటి ప్రయత్నాలతోనే గడిచిపోయాయి. ఈ లోగా నాలాగా ఉద్యోగాలకోసం ఢిల్లీ వచ్చి మెస్సుల్లో ఉంటున్నవారు మరి కొందరితో పరిచయాలు ఏర్పడ్డాయి. ప్రతి రోజూ ఎవరు ఏయే ఆఫీసులు తిరిగారో, ఏమేవి



# ఇన్‌ఫ్లుయన్స్

జరిగాయో అన్నీ చెప్పుకునేవాళ్ళం. నా కనిపించింది మాలో దాదాపు అందరికీ ఒక రకమైన సంఘటనలు ఎదురవుతున్నవని. ప్రతివాడూ ఎవరో ఒక ఆఫీసరుని పట్టుకోవడం ఆయన ఏదో విధంగా కొన్ని సలహాలిచ్చి పంపుతూండటమూ.

ఈ లోగా సూర్యనాథంగారు అమెరికా వెళ్ళిపోయారు. ఎకనామిక్ గ్రోత్ యిన్స్టిట్యూట్ నుండి ఏ కబురూ రాలేదు. సి. ఎస్. ఐ. ఆర్. (కౌన్సిల్ ఆఫ్ సైంటిఫిక్ అండ్ ఇండస్ట్రియల్ రీసర్చి)లో ఒక సైంటిఫిక్ అసిస్టెంటు పోస్టుకు పేపరు అడ్వర్టయిజుమెంటు చూచి అప్లై చేశాను. ఇంటర్మీడియట్ చదువుతుండగా నేర్చుకొన్న టైపు అక్కరకువచ్చి, లక్కీగా 'నయ్యర్ & కంపెనీ' అనే ఇంజనీరింగు కంపెనీలో 200 రూ.ల టెంపరరీ ఉద్యోగం దొరికింది. ఆ ఉద్యోగం చేస్తూ ఏదైనా మంచి ఉద్యోగం చూచుకోవచ్చన్న ఆశతో అక్కడ చేరాను. కాని యిదివరలో కలుసుకున్న వాళ్ళందరినీ వదలిపెట్టకుండా మధ్య మధ్య ఏవైనా అవకాశాలు వచ్చాయోమో తెలుసుకొంటూనే ఉన్నాను. ఒక్కొక్కసారి అనిపించేది హాయిగా గుంటూరు, బెజవాడల్లో ఏ కాలేజీలో నయినా డిమాన్స్ట్రేటరు ఉద్యోగం సంపాదించుకొన్నా యీ తిప్పలన్నీ ఉండేవి కావేమోనని. కాని అది యిచ్చే దాత మాత్రం ఎవడులే, దానికి ఎన్ని తిప్పలు పడాలో అనుకొని సరిపెట్టుకునేవాడిని.

అలా 2 నెలలు గడిచిపోయాయి. డి. జి. ఎస్. డి. నుండి గాని, ఎకనామిక్ గ్రోత్ ఇన్స్టిట్యూట్ నుండి గాని ఏ కబురూ రాలేదు. ఒకనాడు, యిదివరలో నేను సి.ఎస్.ఐ.ఆర్. యొక్క నేషనల్ కెమికల్ లాబరేటరీకిపంపిన అప్లికేషనుకు యింటర్వ్యూ వచ్చింది. కంపెనీవాళ్ళకు ఈ సంగతి చెప్పకుండా సెలవు అతి కష్టంమీదసంపాదించి యింటర్వ్యూకు వెళ్ళాను. సంతృప్తికరంగానే సమాధానాలు చెప్పాను. ఇంటర్వ్యూ అయిన వెంటనే సెలక్టయిన వాళ్ళ పేరును ప్రకటించారు. అందులో నా పేరు వినగానే నా ఆనందానికి అంతు లేకపోయింది. ఇన్నాళ్ళకు ఎవరి సహాయం లేకుండా ఉద్యోగం సంపాదించుకోగల్గాను. ఢిల్లీలో మాదిరిగా యిక్కడ ఇంటికి అవస్థ పడక్కరలేదు. ఇక్కడి ఆఫీసుకు క్వార్టర్సు ఉన్నాయి. కొంత కాలంపాటు స్థిమితంగా జీవితం గడపవచ్చు. ఈ డిపార్టుమెంటులో ప్రతి పోస్టు పేపరులో అడ్వర్టయిజు చేసి ఇంటర్వ్యూద్వారా సెలెక్టు చేస్తారు గనుక సబ్జక్టులోనూ, చేసే వర్కులోను ధరోగా ఉండి ఇన్‌చార్జి మెప్పు పొందేటట్లు పని చేస్తే ప్రమోషన్లు త్వరగానే రావచ్చు.

* * *

తమాషాగా ఉంటుంది గడచిన ఆ రోజులన్నీ యిలా గుర్తుకు వస్తుంటే. ఈ పదేళ్ళ కాలంలో చాలా మార్పులు వచ్చాయి నిజానికి. ఎన్.సి.ఎల్ నుండి అదే డిపార్టుమెంటులో ప్రమోషను మీద మైసూరుకు మారడం అక్కడ ఉద్యోగం చేస్తూనే పి. హెచ్.డి. పూర్తి చేసుకోవడం, అక్కడనుండి బెంగుళూరుకు, అక్కడనుండి యిక్కడకు ప్రమోషన్లమీద మారడం జరిగింది. సంసారం కూడా కొద్దిగా పెరిగింది. ఇంకా ఎన్నో మార్పులు. ఇలా చాలాసార్లు గుర్తుకు వచ్చాయి గాని ఈనా రోజు ఆ రాఘవరావనే అతను ఉద్యోగంకోసం వచ్చి, నేను బిజీగా ఉన్నానని చెప్పినా వినకుండా తనయిబ్బందులు చెబుతూ తనకు మా ఆఫీసులో ఎల్లుండి జరగబోయే యింటర్వ్యూలో సహాయం చెయ్యమని మరీ మరీ బతిమలాడుతుంటే ఏం చెయ్యాలో తోచకపోయింది. ఎల్లుండి జరగబోయే ఇంటర్వ్యూలో నన్ను కూడా కమిటీ మెంబరుగా ఉండమని డైరక్టరునుండి ఈ రోజే ఇన్విటేషన్ వచ్చింది. ఇతనికి ఏ మాత్రం సహాయం చేయటానికి ప్రయత్నించానన్నా యిదివరలో పేరుబడ్డ నా ఆంధ్ర పక్షపాతం మరింత పేరుబడుతుంది. ఎల్లుండి సెలక్షన్ కమిటీలో బల్‌రాజ్ సింగ్ కూడా ఉంటాడు. అతను నాతో అప్పుడప్పుడు అంటునే ఉంటాడు నవ్వుతూ. 'మూర్తి సాబ్‌కు తెలుగువాళ్ళంటే సాఫ్ట్ కార్నర్)' అని. అతన్ని

పెండార్కర్ కొన్ని యింటర్వ్యూలలో ఆ ఉద్యోగాలకు పూర్తిగా పనికిరాని వాళ్ళను సెలక్టు చేసుకోవడంలో సఫలీకృతులైనారు. నేను తెలుగువాళ్ళకు సహాయం చెయ్యలేదనను గాని నేను సహాయం చేసినవాళ్ళను వాళ్ళ యింటర్వ్యూలలో బాగా ఫేర్ చేసినవాళ్ళలో ఉన్నవారే. ఎటొచ్చీ నేను చేసిన సహాయమల్లా కుడి ఎడమగా ఉన్న వాళ్ళనల్లా వాళ్ళు బాగా ఫేర్ చేశారని చెప్పి నానంతు మార్కులు బాగా వేసి డైరక్టరును, మిగతా మెంబర్లను కన్విన్సు చేయడానికి ప్రయత్నం చెయ్యడమే. అలాగే కొన్ని సమయాల్లో నేను కూడా సఫలీకృతుడైనాను. కాని నేను బల్‌రావ్‌సింగ్, పెండార్కర్‌ల లాగా పనికిరానివాళ్ళను ఎప్పుడూ సెలక్టు చేద్దామని ప్రయత్నం చెయ్యలేదు. అదీ గాక ఈ రాఘవరావులాంటి వాళ్ళెవరైనా నన్ను పట్టుకొంటే వాళ్ళకు వాళ్ళ యింటర్వ్యూ వేయబడే ఉద్యోగం యొక్క డ్యూటీలను, పద్ధతులను గురించి చెప్పి ఆ పద్ధతిలో ప్రిపేర్ కమ్మని చెప్పేవాడిని. వాళ్ళు అలాగే తయారయి వచ్చి యింటర్వ్యూల్లో బాగానే ఫేర్ చేసేవారు. నేను అప్పుడు ధైర్యంగా వాళ్ళ పేర్లు సజెస్టుచేసి యింటర్వ్యూ ఛైర్మన్ ముఖంలోకి చూసేవాడిని. ఆయనకి కూడా వీళ్ళ జవాబులు కొంత తృప్తినిచ్చి ఓ. కే. అనేవారు. కాని ఒకటి రెండుసార్లు అలా జరగగానే లేబరేటరీలో నా పేరు ఆంధ్రజన పక్షపాతిగా ప్రాకనారంభించింది. కాని బల్‌రావ్‌సింగ్, పెండార్కర్, వాళ్ళక్రింద పనిచేసే వాళ్ళలో సగంమందిని వాళ్ళకు తెలిసిన వాళ్ళనుండి సెలక్టు చేయించుకున్నారు, ఆ కాండిడేట్లు యింటర్వ్యూలల్లో బాగా ఫేర్ చెయ్యకపోయినా. పైగా వీళ్ళే నా గురించి ఇలా ప్రచారం చేస్తున్నారని కూడా నా అనుమానం. ఎప్పుడు నాన్‌గెజిటడ్ పోస్టులకు యింటర్వ్యూలు జరగనున్నా, వాటికి కొద్ది రోజులు ముందునుంచీ వారకాముపైపుకొందరి కళ్ళు కాపువేస్తుంటాయి. ఎవరన్నా క్రొత్త వాళ్ళు నన్ను కలుసుకొంటానికి వస్తారేమోనని. వచ్చేవాళ్ళకు యివేవీ తెలియవు. రావద్దని పంపివేయలేముకదా. వాళ్ళతో 5 నిముషాలు మాట్లాడి పంపినతర్వాత మర్నాడు అమాట్లాడివెళ్ళిన తనుయింటర్వ్యూకువస్తే అతన్ని దూరాన్నుంచి కేలెట్టిచూస్తూవుతూ గుసగుసలు. చివరికి అతను నా ప్రమేయం లేకుండా సెలక్టుకాగలిగినవాడయినా సరే, అతనిపేరు సజెస్టు చేయడానికి నాకు అవకాశం ఉండదు. ఎందుకంటే అంతకు ముందే ఎవడోఒకడు అడిగితీరతాడు 'నిన్న వచ్చినవాళ్ళు ఉద్యోగంకోసమేనా' అని. ఒకసారి నాక్లాసుమేటు, ప్రాణస్నేహితుడు అయిన విశ్వనాథం అతనిమేనల్లుణ్ణి పంపాడు నావద్దకు. అతను ఎమ్మెస్సీ ఫస్టుక్లాసుతో రెండవవాడుగా పాసైఅయాడు. కుర్రవాడు మంచి చురుకుగా ఉన్నాడు. ఇంగ్లీషు బాగా మాట్లాడుతున్నాడు. ఎవ్వరి సహాయం లేకుండానే అతనికి ఉద్యోగం వస్తుంది. కాని విశ్వనాథం నన్ను అడిగాడు. అప్పుడు యింటర్వ్యూలో మరోమెంబరు ఎవరో సజెస్టుచేస్తే నేను అతనికంటె యితనే బాగా ఫేర్‌చేసాడని కమిటీ ఛైర్మనైన వక డైరక్టరుతో వాదించి అదృష్టవశాత్తు అయిన్ని ఒప్పించగలాను. మరోసారి ఎవరో ముక్కూమొఖం తెలియని ఒక తెలుగు కుర్రాడు ఒక యింటర్వ్యూలో బాగా ఫేర్‌చేస్తే నేనతనిపేరు సజెస్టుచేశాను. అంతకుముందు ఆకుర్రాడు నన్ను కలుసుకోవడంగానీ, ఏమీ చేయలేదు. ఈసారి డైరక్టరు (సాధారణంగా నాన్‌గెజిటడ్ పోస్టుల యింటర్వ్యూ కమిటీలకు, ఈయనే ఛైర్మను) కూడా నా నిర్ణయం అనుమానించి మరొకమెంబరుతో ఏకీభవించాడు. అప్పుడూ గోలకావడం మాత్రం తప్పలేదు.

ఒక్కోసారి అనిపిస్తుంది, నాకున్న కొద్ది అవకాశంతో నేను తెలుగువాళ్ళకంటె యితర రాష్ట్రంవాళ్ళకు ఈ ఉద్యోగాల విషయంలో సహాయపడగలగడం సులభమని. అలాగే తెలుగువాళ్ళు కూడా ఇతరులద్వారా పనిచేయించుకోవడం కొంచెం సులభం. ఎందుకంటే సహాయం చెయ్యడానికి ముఖ్యంగా ఈ ప్రాంతీయతే ప్రతిబంధకం. అదే నేను పరాయిరాష్ట్రంవాళ్ళకు వరుసగ నలుగురైదుగురికి సహాయం చెయ్యడానికి ప్రయత్నించినావరే నాకు చెడుపేరురాదు. కాని తెలుగువాళ్ళకు యిద్దరికు సాయంచేస్తే చాలు కావలసినంత చెడుపేరు సంపాదించుకోవడానికి. అలాగని నావద్దకు ఉద్యోగంకోసం వచ్చినవాళ్ళకు ఈ సలహా నేనిస్తే, నేను తప్పించుకుంటానికి ఈ నాటకం ఆడుతున్నానని చాటుకువెళ్ళి తిట్టుకుంటారు. ఇలాంటిబాధే కొద్ది, గొప్ప అవకాశాలు ఉద్యోగపు విషయాల్లో ఉన్న తెలుగువాళ్ళకు చాలమందికీ ఉన్నట్లు నాకు తెలుసు. అందుకే ఈమధ్య తెలుగువాళ్ళెవరైనా ఉద్యోగవిషయమై నన్ను కలుసుకుంటే వెంటనే నాకు సి. యస్. ఓ. లోని మూర్తిగారు? సూర్యనాథంగారు మొదలైన నేను నా ఉద్యోగపు ప్రయత్నాల రోజుల్లో కలుసుకొన్న తెలుగు అధికారులు, వాళ్ళు నాకుచెప్పిన జవాబులు, సలహాలు అన్నీ ఒక్కసారి కళ్ళముందు కన్పడతాయి. ఇకనాకు అంతకంటె గత్యంతరంలేదు. కనుక ప్రస్తుతం నేనుకూడా అదేపంథాలో నడవాల్సి వస్తున్నది. ఎవరైనా ఉద్యోగం విషయాల్లో నేను వాళ్ళకు సహాయం చెయ్యగలననుకొని (ఒక్కొక్కసారి అది నిజంగా కూడా అయినా) నావద్దకువస్తే, వాళ్ళకు మర్యాదచేసి, నాకు చేతనయినంతవరకు ప్రయత్నం చేస్తామకాని గట్టిగా ఏసంగతీ చెప్పలేననటం; అలాంటివాళ్ళలో సెలక్టుకానివాడు ఎవరైనా మళ్ళీవచ్చి ఏమండీ సహాయం చెయ్యలేదేమని అడిగితే, నేను చెయ్యగలిగినదంతా చేశాను కాని నా పై అధికారి తనకాండిడేటుకై గట్టి ప్రయత్నం చేసాడని చెప్పి కొంచెం నేను విచారించి పంపెయ్యడమే. కాని నాకు ఎప్పుడూ 'తెలుగువాళ్ళకు పరాయిరాష్ట్రంలోగాని సెంట్రల్ గవర్నమెంటులోని ఉద్యోగాల విషయమై తెలుగువాళ్ళకంటె పరాయివాళ్ళద్వారా పనులు చేయించుకోవడం (అన్యాయం జరగకుండా చూసుకోవడం కూడా) సులభం' అనే సలహామాత్రం నావద్దకు ఉద్యోగానికై వచ్చిన ప్రతి ఒక్కడికి యివ్వాలని ఉంటుంది అతను నమ్మితే. ●

## సీరియల్



## తేజోవతి

### 3

మరునాడు సాయంత్రం ఐదుగంటల కల్లా 'రెడీ' అయి 'వేణూ! ..' అని పిల్చింది జ్యోతి

అప్పటికే సిద్ధంగావున్న వేణు 'ఆ మల్లెపూలదండ ఎవరికక్కా?..' అని అడిగాడు ఆశ్చర్యంగా.

'అటునుంచీ రాధా వాళ్ళయింటికి వెళ్తాను అక్కడికి దగ్గరే నంటివిగా వీళ్ళయిల్లు' అని జవాబిచ్చి బయలు దేరింది జ్యోతి

వాళ్ళిద్దరూ శంకరంగారి యిల్లు చేరు కునేసరికి అప్పుడే లోపల కడుగుపెడు తున్నారు శంకరంగారు స్కూలునుండి వస్తూ. ఆయన్ని చూడగానే జ్యోతి నమస్క రించింది ప్రతి నమస్కారంచేసిన శంకరం గారు పార్వతికి జ్యోతిని పరిచయం చేశారు జ్యోతికి ఆ పరిసరాలు చూస్తుంటే ముచ్చ టేసింది ఇల్లు తడికల యిల్లయినా చుట్టూ ప్రహరీమాత్రం గోడే. ఇంటి చుట్టూ వున్న ఖాళీస్థలం చిన్నదైనా దానిలో ఎన్నో పూలమొక్కలున్నాయి ఇంటికి దక్షిణపువైపున కొబ్బరిచెట్లు, జామచెట్టు, అరటిచెట్లూ వున్నాయి వెనుక వైపుల కూరగాయల పాదులున్నాయి ఇంటిముందు విరబూసిన నందివర్ధన, మందార, గులాబీ మొక్కలున్నాయి.

'వీళ్ళతోపాటు అతిథులకు స్వాగతం చెబుతున్నట్లున్నాయి యీ పూలమొక్కలు' అనుకుంటూ పార్వతి తెచ్చివేసిన చాపమీద కూర్చుంది జ్యోతి వేణు సంశయిస్తూ పక్కన నిలబడ్డాడు గోళ్ళు కొరుక్కుంటూ 'ఇక నువు వెళ్ళుబాబూ మళ్ళీ ఆరు గంటలకు రా చదువుకోడానికి' అని చెప్పి పంపించేసింది జ్యోతి

వెళ్ళిపోతున్న వేణుకు ఓ పెద్ద అను మానం వచ్చింది, 'అక్క తనను పంపిం చేసిందిగదా తను లేనప్పుడు ఆ మేష్టారు ఆ రోజు సంఘటన చెబితే యింటకొచ్చి అక్కేమంటుంది?... ఛీ!, ఛీ! కొరివితో తలగోక్కున్నట్టయింది తనపని' అనుకుంటూ తిట్టుకున్నాడు తనని తనే.

పార్వతితో మాట్లాడుతుంటే జ్యోతికి జెండాపత్తులమీద గౌరవం యినుమడించింది. సాదాచీరలో, సదాచిరునవ్వు చిందులాడే ముఖంతో ఎంతో ఆప్యాయంగా మాట్లాడే ఆవిడ తీరు ఆవిడ స్నేహశీలత జ్యోతిని ముగ్ధురాల్ని చేశాయి జ్యోతి అనుకో కుండానే తనచేతిలోవున్న మల్లెలదండను పార్వతి కిచ్చింది మనిషి అధునాతనంగా వున్నా మనస్సు నిర్మలమైందని కనిపెట్టే సింది పార్వతి జ్యోతి విషయం

జ్యోతి ఆ మాటా యీ మాటా మాట్లాడుతూ వేణు విషయం ప్రస్తా వించింది

'అతడికేమ్మా, చురుకైనవాడు కొంచెం కృషిచేస్తే ముందు ముందు వృద్ధిలోకి వస్తాడు' అని చెప్పారు శంకరం గారు

'ఆ కృషే చెయ్యడండీ వాడు మా నాన్నగారు పోయినప్పటినుండీ యింట్లో ఎవరి భయమూ లేదు. వాడి స్నేహితు లేమిటో ఆ తిరుగుళ్ళేమిటో రాత్రి పది గంటలకు గానీ యిల్లు చేరుకోడం మేషారూ ఇక చదివేదెప్పుడు?'

'అయితే మీ నాన్నగారంటే మంచి భయం వుండేదాండి?' అని అడిగారు శంకరంగారు

'అయన్ను చూస్తే వాడికనే ఏమిటి? అందరికీ భయమే వీడయితే పెద్ద పులిని చూసినట్టే ఆయన ఒక్క అరుపు అరిస్తే పిల్లిలా ఏ మంచాల సందునో నక్కేవాడు సాయంత్రం స్కూలు వదలగానే యింటికి రాకపోతే ఆ రోజు వాడి వీపు పగిలి పోయిం దన్నమాటే! ఆ దెబ్బలు చూళ్ళేక ఎప్పు డైనా నేనైనా అడ్డం వెళ్ళేదాన్ని గానీ మా అమ్మ మాత్రం లోపలకు వెళ్ళి పొయ్యేది అయనున్నంత కాలం కనీసం ఆడుకోడానికి వెళ్తానని గూడా అనేవాడు కాదు ఆయన యింట్లో లేనప్పుడు వీడి యిష్టమే యిష్టం అందరికీ అన్నీ సమ యానికి అమర్చిపెట్టడం తప్ప మా అమ్మ కింకేమీ తెలియదు ఆవిడ ఎన్నడూ ఎవ్వరినీ పన్నెత్తి మాట అని ఎరగదు నాన్నగారు పోవడంతో వీడిలా అదుపు ఆజ్ఞా లేకుండా అయిపొయ్యాడు' అంది జ్యోతి

ఇంతదాకా మౌనంగా వింటున్న శంకరం గారు బరువుగా నిట్టూర్చారు ఆయనకు నాలుక చివరిదాకా వచ్చింది 'పిల్లల్ని గానీ పెద్దల్ని గానీ ఎవరైనాసరే కేవలం భయం మీదనే పట్టుకువస్తే జరిగే పర్యవసానం యిదే' అని చెబుదామని నోటి చివరిదాకా వచ్చింది కానీ జ్యోతి ఏమైనా అనుకుంటుం దేమోనని వూరుకున్నారాయన

ఇంతలో పార్వతి యిద్దరికీ కాఫీ తెచ్చి యిచ్చింది కాఫీ తీసుకున్నాక 'ఇక వెళ్తానని' లేచిన జ్యోతిని 'మా యిల్లు చూద్దురు గాని రండి' అని లోపలకు తీసుకు వెళ్ళింది పార్వతి

ఇంటిముందు తాటాకుల పంచ ఆ తర్వాత తడికల యిల్లు అందులో ముందు గదిలో శంకరంగారి పుస్తకాల బీరువా, ఒక ప్రక్క చిన్న పుస్తకాల షెల్ఫు, ఇంకోపక్క గుడ్డలవంకె, ఒకప్రక్కగా ఎత్తిపెట్టిన నవారు మంచం వున్నాయి ఆ వెనుక గదిలో ఒకనులక మంచంలో ముసలావిడ పడుకుని వుంది

'మా అత్తగారు' అంటూ పరిచయం చేసింది పార్వతి 'ఆవిడకు ఒంట్లో బాగుంటంలేదు' అని కూడా చెప్పింది ఆ గదిలోనే వరుసగా పేర్చిన రెండు మగాడు పెట్టెలు, ఒకపక్కన విప్పినబట్టలు వేసు కోడానికి పెట్టిన వెదురు పేళ్ళబుట్ట.

దండెంమీద రెండు మూడు పాతచీరలు వ్రేలాడుతున్నాయి. ఆ గదిలోనుండి దక్షిణ వైపుకు ఓ తలుపుకూడావుంది. ఆతర్వాతది వంటగది. దానికి వెనుకవైపుకు తలుపుంది. దొడ్డివాకిట్లో కూర్చుని బియ్యమేరుతున్న ఆడబిడ్డనుకూడా పరిచయంచేసింది పార్వతి. 'మా అన్నగారు పోయినప్పటినుంచీ యిక్కడే వుంటున్నారు. ఆవిడకు యిద్దరు పిల్లలు.... మా బాబూ, వాళ్ళిద్దరూ కలిసి ఎటో వెళ్ళారు ఆడుకోడానికి...' అని చెప్పింది పార్వతి.

'ఇల్లు చిన్నదైనా చూడ ముచ్చటగా వుంచారు.. రేల్లుకప్పి వుంచారు డాబా లాగిస్తే బాగుండేది?..' అన్నది జ్యోతి.

'డాబా అంటే ఎక్కడండీ. మాది రెక్కలాడితేగానీ డొక్కలాడని సంసారం... ఈ స్థలమైనా వెనకెప్పుడో కొన్నారుట... అద్దెలు కట్టలేక యిలా కాలం గడుపుతున్నాం...' అని బిడియపడ్తూ చెప్పింది పార్వతి.

'మరి మేషారు ట్యూషన్లు అవి చెబుతారేమో...' అని గబుక్కున నోరుజారి తర్వాత నాలిక్కరుచుకుంది జ్యోతి.

'లేదండీ...ఆయన ట్యూషన్లు అవీ చెప్పరు.. ఆయన కిష్టంలేదు' అని పార్వతి చెప్పగానే జ్యోతి ఆలోచనలో పడిపోయింది. ట్యూషన్లు చెప్పడం యిష్టంలేని ఆయన వేణును యింటికళ్ళావచ్చి ఎందుకు పిల్చినట్లు?...నిజంగానే వేణు చెప్పినట్లు ఈయన దగ్గరకెవ్వరూ రారా?.... అని గూడా అనిపించింది... ఏమో... యిప్పటికి మాత్రం దంపతులిద్దరూ సహృదయుల్లా కన్పడుతున్నారు. అయినా నాల్గురోజులు పోతే యీయన మంచి మేష్టరైందీ లేందీ వేణు ప్రవర్తనే చెబుతుంది లెమ్మని తనకు తాను సచ్చచెప్పుకుంది జ్యోతి.

తర్వాత పార్వతి దగ్గర సెలవు తీసుకుని బయటకు వస్తుండగా శంకరంగారి బాబు అప్పుడే లోపలకు వస్తున్నాడు... 'ఏబాబూ కులాసా?..' అని పార్వతిని అడుగుతూ అమాంతం ఎత్తుకొని ముద్దుపెట్టుకుంది జ్యోతి ఆ బాబును...ముద్దులు మూటగట్టే యిలాంటి బాబును కన్న దంపతులు ఎంత అదృష్టవంతులు?... అనిపించింది జ్యోతికి...బాబును మళ్ళీ ముద్దుపెట్టు

అని దింపేసింది.

శంకరంగారింటికి నాలుగిళ్ళవతలే మోహన్ వాళ్ళయిల్లు.

'రా రా!... రావా!...' అని బుగ్గ పిలుస్తూనే ప్రవేశించింది జ్యోతి.

'నువ్వు వస్తావని అనుకుంటూనే



# పూర్వాం సంధ్యా ప్రవర్తతే...

వున్నాను.' అంటూనే వచ్చింది రాధ...

'ఇంట్లో ఎవ్వరూలేరా?... ఇల్లు చిన్న బోతోంది?...'

'ఎవ్వరూలేకేం నీకు కావల్సినవాళ్ళు నీకోసం ఎదురుచూస్తూనే కూచున్నారు లా లోపలకు...' అంటూ చెయ్యిపట్టుకు లాక్కుపోయింది మోహన్ గదిలోకి జ్యోతిని రాధ.

'హల్లో! జ్యోతీ!...' అంటూ లేచివచ్చి అమాంతం జ్యోతి చెయ్యి నొక్కేశాడు మోహన్...

జ్యోతికి సిగ్గేసింది...మొఖం ఎర్రబడింది. నీటైన ఫుల్ సూట్‌లో బిన్నీవారి అడ్వర్టయిజుమెంటు యువకుడిలా వున్న మోహన్‌వైపు చూస్తూ కూర్చుంది జ్యోతి.

మెత్తని వాయిల్ చీర అరచాటుగా అందాన్ని కప్పుతుంటే, ఎర్రబడ్డ ఆ గులాబీరంగు బుగ్గలను...అలా...ఓహో!... ఈ రాధ లేకుండా వుంటే...ఎంత బాగుండు! అనిపించింది మోహన్‌కు.

'రాధా! స్నేహితురాలిని చూచేసరికి మర్యాదల మాటగూడా మర్చిపోయ్యావా?... త్వరగా కాఫీ తీసుకురా పో...మీ ఫ్రెండ్ అలిసి పోయివున్నట్లుంది.' అన్నాడు మోహన్.

'ఐయామ్ సారీ జ్యోతీ! జస్ట్ ఫైవ్ మినిట్స్.' అంటూ లోపలికి పరుగెత్తింది రాధ.

రాధ వెళ్లగానే మోహన్ చిలిపిగా జ్యోతివైపు చూస్తూ 'ఉత్తరాలలో అన్ని కబుర్లు రాశావు...ఎదురుగావస్తే మాటే కరువయిందేం?...' అన్నాడు.

'నేనూ అదే అడుగుదా మనుకుంటు న్నాను. కాకినాడనుండి రెక్కలు కట్టుకు రావాలని వుందని వ్రాశారు. తీరా యిక్కడికి ప్రొద్దుననగా వచ్చి మూడింటిదాకా రాలేక పొయ్యారు...' అంది నిష్ఠూరంగానే జ్యోతి.

'మీ యింటికా?...వస్తే ఏమని పరిచయంచేస్తావు మీవాళ్ళకు?... అనవసరంగా యిబ్బందిపెట్టడమెందుకు నిన్నని యిలా తపసుచేస్తూ యిక్కడే కూర్చున్నాను...'

'ఏం?...' మీ కాబోయే అల్లుడుగారు వచ్చారు చూసుకో అమ్మా.' అనే పరిచయం చేసేదాన్నిగా?...'

'ఓహో! ఏం ధైర్యం?!!...'

'భయమెందుకూ?' అని మాటిగానే అడిగేసింది జ్యోతి.

'సరే... ఆ సంగతి వదిలెయ్. విశేషాలు చెప్పు' అన్నాడు మాటమళ్ళిస్తూ మోహన్.

'విశేషాలు మీరే చెప్పాలి. ఆఁ...అన్నట్టు పరీక్షలెలా వ్రాశారు?'

'మనసంతా నీదగ్గరుంటే...ఏం చదువు తాను? ఏం వ్రాస్తాను?'

'ముందు కబుర్లుచెప్పడంలో పట్టా పుచ్చుకున్నట్టున్నారు?' అంది నవ్వుతూ జ్యోతి.

'అమూల్యమైన కాలం కబుర్లతో గడపడం బాగుండేదు. ఏదన్నా ప్రోగ్రాం వెయ్యి. సరదాగా గడవచ్చు సాయంత్రం' అన్నాడు.

'ఆ ప్రోగ్రాం కూడా మీరే చెప్పండి మోహన్.'

'పిక్చరుకు పోదాం. 'హరిహర్'లో మంచి పిక్చరుందిట!'

'ఓ ఎస్...రాధతో చెప్పివస్తానుండండి త్వరగా రెడీ అవమని.'

జ్యోతి సంతోషంతో త్వరగా కుర్చీలోంచి లేచింది.

గబుక్కున చెయ్యిపట్టుకు ఆపేశాడు మోహన్. 'మధ్య రాధ ఎందుకు? మనిద్దరం స్వేచ్ఛగా మాట్లాడుకోకుండా.'

జ్యోతి నెమ్మదిగా చెయ్యి విడిపించుకుని 'పోనిండి. ఇక్కడేకూర్చుని కబుర్లు చెప్పుకుందాం. పిక్చరుకువద్దు. నాకు తలనొప్పిగా వుంది' అంది.

'చక్కగా 'ఎంజాయ్' చేద్దామంటే ఎప్పుడూ తప్పించుకుంటావేం? నేను కాకినాడనుండి ఎన్నికలలు కంటూ వచ్చానో తెలుసా?'

'నేనుమాత్రం కలలు కనటంలేదా మోహన్! కానీ కన్నెపిల్లలు దాటగూడని హద్దులు కొన్నివుంటాయిగా' సిగ్గుపడుతూ అంది జ్యోతి.

'అయితే మీవాళ్ళతో చెప్పెయ్ త్వరగా కన్నెపిల్లను పెళ్ళికూతుర్ని చెయ్యమని' చనువుగా మళ్ళీ జ్యోతిచేతిని తనచేతిలోకి తీసుకుంటూ అన్నాడు మోహన్.

'పోనీ..అమ్ముక్క మీరే ఎందుకనగూడదో మీ వాళ్ళతో... 'నాకు త్వరగా పెళ్ళికొడుకవాలనివుంది' అని?'

'దానికంటె నేను చెప్పిందే నాచురల్‌గా వుంటుందోయ్ పిల్లా! నువు మీవాళ్ళనువచ్చి మా పెద్దవాళ్ళను అడగమను. వాళ్ళు నన్నడిగినప్పుడు నేను 'ఊఁ' అంటాను. 'ఏం?' అంటూ బుగ్గమీద చిటిక వేశాడు మోహన్.

'ఊఁ!' అంది జ్యోతి ఆ స్పర్శలోని అనుభూతికి చలించిపోతూ. ఇంతలో రాధ కాఫీ తీసుకురావడం గమనించి చప్పున తన చెయ్యి తీసేసుకుంది జ్యోతి.

* * *

వేణు ఆరు గంటలకు కొంచెం ముందు గానే బయలుదేరాడు ట్యూషనుకు. ఒకవేళ అక్క అక్కడే వుంటే ఆలస్యంగా వచ్చావేమని తిడుతుందేమోనని భయంతో సరిగ్గా ఆరు గంటలకు మేష్టారుగారిల్లు చేరుకున్నాడు. వాకిట్లోనే వున్న శంకరంగారు 'రండి' అన్నారు. లోపలికెళ్ళాక అక్కలేదని తెల్సుకున్న వేణు 'అయ్యో, అనవసరంగా ముందొచ్చానే' అనుకున్నాడు.

'ఇంగ్లీషు టెక్స్టు తియ్యండి' అన్నారు శంకరంగారు.

'టెక్స్టుబుక్ తీసుకురాలేదు.' అని జవాబిచ్చాడు వేణు.

'ఇన్నాళ్లనుండీ ఏ రోజూ మీరు ఇంగ్లీషు పుస్తకం తేలేదు. అది మీరు స్వయంగా చదువుకోగలరా?'

'ఆ యింగ్లీషంటే నా కసహ్యం. నేనెప్పుడూ ముట్టుకోను. మిగతా 'సబ్జక్ట్సు' చెప్పండి' అన్నాడు నిర్లక్ష్యంగా వేణు.

'ఇంగ్లీషంటే అసహ్యమా?!! ఏం పాపం యింగ్లీషు అంత తప్పేం చేసిందండీ?' అన్నారు నవ్వుతూ శంకరంగారు.

'ఏమో! నా కిష్టంలేదు, అదంతే.'

'ఇష్టం లేకపోవడానికి చాలా కారణాలుంటాయిగా. అది యింగ్లీషువారు మాట్లాడే భాషని అసహ్యించుకుంటున్నారా? అలా అనుకుంటే మనిషికి మనిషి శత్రువవుతాడు గానీ ఒక భాషను శత్రువనుకోడం చాలా పొరబాటు...' శంకరంగారు తరచి తరచి అడిగారు.

'అబ్బే. అదేంకాదు. చిన్నప్పుడు నాకూ యిష్టమే యింగ్లీషంటే. ఫస్టు మార్కులు గూడా వచ్చేవి.' అని చెప్పాడు వేణు, ఈ గొడవంతా యీయన కెందుకు? నా కిష్టమన్నదేదో చెప్పి పంపించక అనుకుంటూ.

'మరి ఎప్పటినుండి అసహ్యం పుట్టింది?'

'ఫోర్తుఫారం నుండీ.'

'ఉన్నట్టుండి అంత అసహ్యం పుట్టిందంటే

# “అమ్మ నాకోసం సింథాల్ పౌడర్ కొన్నది...అయితే

దీనిని చాలామట్టుకు ఆవిడే వాడుతోంది.”

హాయిని గొలిపే ఆ సువాసన అంటే, అమ్మెకు ఎంతో ఇష్టము. నాన్న కూడా దానిని వాడతాడు...అద్భుతమైన జి-11 (హెక్సాక్లోరొఫిన్) శరీరము యొక్క దుర్గంధము తనకు లేకుండా చేస్తుందని నాన్న అన్నారు. ఆహా! నా ఒళ్లు ప్రేలకుండా కాపాడడానికి వాళ్లు దానిని కొన్నారు...అది నాకు ఎంతో అవశ్యకము!




సింథాల్ టాయిలెట్ పౌడర్ ఇప్పుడు ఆకర్షణీయమైన 3 డబ్బాలలో దొరుకుతుంది.

## సింథాల్
## టాయిలెట్ పౌడర్

మీకు హాయిగా నుండు పట్లు రూఢిచేసుకోండి-జి-11 (హెక్సాక్లోరొఫిన్) గల సింథాల్ సబ్బు వాడిన తరువాత, సింథాల్ టాయిలెట్ పౌడర్ రాసుకోండి




జి-11 ఎల్ గివాడా ఎట్ సీ ఎస్.ఎ. వారి ట్రేడ్ మార్కు

INTERPUB/GCP/4 TEL

# "పూర్వాసంధ్యా ప్రవర్తతే..."

పంపుటకు ఏం జరిగింది పోర్టుహాలంలో? కుతూహలం ప్రదర్శించారు శంకరంగారు.'

'మొదట్లో ఆ 'హయ్యర్ ఫారమ్స్' మేష్టరు నేనంటే మంచి అభిమానం చూపించేవాడు... ప్రతి ప్రశ్నా నన్నే అడిగేవాడు... క్లాసు మానిటరుగా కూడా నన్నేపెట్టాడు. ఒకరోజు నేను తలొంచుకు రాసుకుంటుంటే నా ప్రక్కవాడేదో గోలచేశాడు. అది నేనే చేశానని నిలబెట్టాడు మేష్టరు... నేనసలు అల్లరి చెయ్యలేదండి...పక్కవాడు పిలిచాడు మారు పేరుపెట్టి..' అన్నాడు వేణు.

'నేను కాదని మీరు చెప్పలేదా ఆ మేష్టరుగారితో?..' అని అడిగారు శంకరంగారు.

'ఎంతచెప్పినా విన్పించుకోలేదు. 'వెధవా అబద్ధాలు చెబుతున్నావా?'అని 'కేన్' తీసుకు కొట్టాడు. అంతదాకా నేనెప్పుడూ మేష్టరు చేత దెబ్బలు తినలేదు' అన్నాడు వేణు.

'ఊc...తర్వాతేం జరిగింది?' ఆసక్తి చూపారు శంకరంగారు.

'మర్నాడు పాఠం చెప్పేటప్పుడు నావైపసలు చూళ్ళేదు. నన్ను ఒక్క ప్రశ్నగూడా వెయ్యలేదు.....నేనూ ఆయనవైపు చూళ్ళేదు. రెండుమూడురోజులు చూచాను నన్నేమన్నా అడుగుతాడేమోనని. నేనసలు వున్నట్లే అనుకునేవాడుకాదు. నాకు భలే కష్టం వేసింది. ఆయనడక్కపోతే నాకేం అని వెళ్ళి వెనక బెంచీలో కూర్చున్నాను. మమ్మల్నసలు పట్టించుకునేవాడేకాదు మా క్లాసు పం వచ్చింది.'

'మాకంటె...? ఇంకా నీతో యిద్దరు ముగ్గురున్నారా?

'అంటే వెనకబెంచీలో కూర్చునే వాళ్ళందరికీ.'

'కోపంవచ్చి ఏంచేశారు?'

'ఆయన్ని ఏడిపించాలని డెస్కుచాటున తలపెట్టి పిల్లి అరుపులు కుక్క అరుపులు అరిచేవాళ్ళం. ఆయన బోర్డుమీద వ్రాస్తుంటే కాగితం వుండలు చుట్టి కొట్టేవాళ్ళం. ఆయన తిరిగే చూసేసరికి అందరం మామూలుగా కూచునేవాళ్ళం. మావెనక బెంచీలో 'శ్యామాయి' అని ఓ పెద్ద కుర్రాడుండేవాడు. అతడంటే మా క్లాసు పిల్లలందరకూ భయం. 'ఎవరు చేశారని' మేష్టరడిగితే 'ఫలానా వాళ్ళని' చెబితే తంతానని మా శ్యామాయి అందరకీ చెప్పేశాడు. అందుకని వాళ్ళెవరు చెప్పేవాళ్ళు కాదు. ఒకరోజు వెనక బెంచీలోంచే గోల అని మమ్మల్నందర్నీ నిలబెట్టాడు మేష్టరు. మాకోపంవచ్చి బోర్డుమీద గోడలమీద ఆయన్ను తిడుతూ రాశాం. ఒకరోజు 'మీరు పాఠం వినడానికి వచ్చారా? అల్లరి చెయ్యడానికి వచ్చారా?' అని అడిగాడు మమ్మల్ని నిలబెట్టి. 'నువ్వు మాకసలు పాఠం చెబుతుంటేగా?... 'నీకావలసింది ముందువాళ్ళు. వాళ్ళకే చెప్పుకో' అన్నాడు శ్యామాయి. 'ఎదిరిస్తావా వెధవాయ్?' అంటూ వాడ్ని కొట్టడానికొచ్చేసరికి వాడు చొక్కాపట్టుకున్నాడు'... అంటూ ఉత్సాహంగా చెప్పుకుపోతున్నాడు వేణు.

శంకరంగారు మౌనంగా వింటూ ఆలోచిస్తున్నారు. ఉపాధ్యాయుడు తనమీద అభిమానాన్ని గౌరవాన్ని పోగొట్టుకుంటే యిక తను బోధించే విషయంమీద కూడా అభిమానాన్ని పోగొట్టుకున్నట్లే అనుకున్నారాయన. వేణుకు తన ప్రతాపమంతా చెప్పుకోడానికి యిదే సమయమనిపించింది. అతడు వుత్సాహంగా చెప్పుకు పోతున్నాడు...

'అప్పటినుండీ వాడంటే భయం ఆయనకు...వాడు బడికిరానిరోజు నన్ను పుత్తపుణ్యానికి కొట్టేవాడు ఆ మేష్టరు... అందుకని నా కింగ్లీషు 'పిరియడ్' అంటే భయం వేసేది. అందుకని ఆ'పీరియడ్' వుందంటే నేను కిటికీగుండా దూకి పారిపోయి అట్నా ఇట్నా తిరిగి, అదయిపోయాక వచ్చేవాడిని...మా శ్యామాయి వచ్చినప్పుడు గూడా ఒక్కోరోజు మమ్మల్ని క్లాసులోనుండి బయటికి పంపించేసేవాడు...'

'అలా క్లాసులో గోలచేసినందువల్లా, క్లాసులు ఎగ్గొట్టి తిరిగినందువల్లా చివరికి నష్టపోయింది మీరేకదా?' నవ్వుతూ అడిగారు శంకరంగారు.

'అయితే ఆయనలా నిజం తెల్సుకోకుండా పుత్తపుణ్యానికి కొట్టడం బాగుందా?...' ఆవేశంగా అడిగాడు వేణు.

'నిజమే...అదితప్పే...నిజానిజాలు తెల్సు కోకుండా ఎప్పుడుగా దండించగూడదు...' అన్నారు శంకరంగారు.

ఈ మాటతో వేణుకు తృప్తి కలిగింది. ఆరోజు వుత్సాహంగా ఆయన చెప్పినపాఠం విన్నాడు. లెక్కలన్నీ రైటుగాచేశాడు. ఆరోజు అక్కకు తెలిసిపోయిందేమోనని భయపడుతూ యింటికెళ్ళిన వేణుకు అక్క ఆ విషయమే ప్రస్తావించక పొయ్యేసరికి ధైర్యం వచ్చింది. అంతకూ అనుమానం తీరక 'ఏమన్నాడక్కా ఆయన?'... అని అడిగాడు.

'ఎవరు?...' అంది జ్యోతి ఆశ్చర్యంగా.

'అదే ఆ మేష్టరు ..' అన్నాడు...

జ్యోతి కిప్పటికి అర్థమైంది...'శంకరం గారా!... ఏమంటారు?.. 'చురుకైనవాడు. కృషిచేస్తే మంచి వృద్ధిలోకి వస్తాడు.' అన్నారు...కృషిచెయ్యడం నీ చేతిలోనేవుంది... అయినా వేణూ!... 'ఆచార్య దేవోభవ' అంటారు మనవాళ్ళు...వాళ్ళనలా ఏకవచన ప్రయోగం చెయ్యొచ్చటరా?...' అంది మృదువుగా మందలిస్తూ.

'అట్టే గౌరవించాలి కాబోలు' అని మనసులో అనుకున్నా పైకేమీ అనలేదు వేణు. పర్నాడు ఐదుగంటలకల్లా బయలు దేరాడు వేణు. రైలు కట్టమీద అప్పటికే చేరారు మిత్రబృందమంతా. వేణున్ని చూడ గానే 'గురూ!... మనపథకం ఎంతదాకా వొచ్చింది?' అంటూ వుత్సాహంగా ప్రశ్నించారు.

'అప్పుడేనా? నెమ్మది నెమ్మదిగా పథకం అమలుజరుపుతున్నాను. నిన్ననే 'యిండై రెక్టు'గా నా జోలికొస్తే నీవు చితికిపోతుం దని హింట్ యిచ్చాలే.' అన్నాడు వేణు తాపీగా రైలుపట్టాలమధ్య కూర్చుని రైలు కట్ట మీద రాయితీసి ఎలక్ట్రిక్ స్తంభానికి కొడుతూ.

'హింట్' యిచ్చానన్నమాట! ఏం చెప్పావు? మన 'బావి' సంగతి చెప్పావా?' వుత్సాహంగా అడుగుతూ మూగారు మిగతావాళ్ళు.

వేణు సావకాశంగా తమ ప్రతాపాన్ని ఆ మేష్టరుకు ఎలా తెలియజేర్చింది అంతా వివరించాడు. అంత నిర్భయంగా వేణు తమ ప్రతాపాన్ని తెలిపినందుకు మిత్రులు అతణ్ణి అభినందించారు.

'అరే! వేణూ! ఇంతకూ పాఠాలు ఏమన్నా బాగా చెబుతాడ్రా?' అని అడిగాడు

# "పూర్వాసంధ్యా ప్రవర్తతే.."

అందులో ఒకడు వున్నట్టుండి.

'ఆ! ఏదో చెబుతాడులే బాసే.' అని తేల్చేశాడు వేణు.

నిజానికి శంకరం మేష్టారు పాఠం చెబుతుంటే విసుగనే అనిపించదు. ఆయన పాఠం విసుగెత్తేలా వుపన్యాస ధోరణిలో సాగిపోదు. అది సహజమైన సంభాషణా రూపంలో కొనసాగుతుంది. మధ్యలో వేణుకు ఎన్నో అనుమానాలొచ్చేవి. ఆ అనుమానాలన్నీ తీర్చాకనే తరువాత పాఠం చెప్పేవారు శంకరంగారు. ఇదివరలో వేణుకు ఏదైనా అనుమానం వచ్చి లేచి నిలబడితే 'కూచో.' అని కసురుకునేవాళ్ళు, స్కూల్లో కొంత మంది టీచర్లు. ఈయనలా కసురుకోకుండా చెప్పడం శంకరంగారి గుణాల్లో వేణుకు నచ్చిన మొదటి గుణం. అందుకని శంకరంగారు పాఠం చెబుతుంటే సరదాగా వుండేది వేణుకు. కానీ ఆ మాట ఒప్పుకోడానికి అతడికి కొంచెం కష్టం వేసింది మిత్రుల ముందు. అలాగని అసలు ఆయనకు చెప్పడం చేతకాదని చెప్పడానికి అంతరాత్మ అసలొప్పుకోలేదు. అందుకని అలా వాగ్చేసి వూరుకున్నాడు వేణు.

'అన్నిటికంటె ముందు వేళకు రాండి వేళకు రాండి అని చంపుకు తింటున్నాడురా యీ మేష్టరు!' అని చెప్పాడు విసుగ్గా వేణు.

'గురూ! దీనికి ఓ వుపాయం చెబ్తాను చెయ్యి. అది పారిందంటే ఆయన వొరేత్తకుండా కట్టెయ్యొచ్చు.' అన్నాడు సోమేశం.

'ఏమిట్రా వుపాయం?'

'ఇవ్వాళ ఏం చేస్తానంటే కొంచెం ముందుగా వెళ్ళి ట్యూషనుకు. ఆయన గనక సరిగ్గా వేళకు వచ్చి పాఠం చెప్పకపోతే రేపు ఆయన 'ఆలస్యమయిం దేమంటి?' అన్నప్పుడు నిలబెట్టి దులిపెయ్యొచ్చు. ఏమంటావ్?'

'గుడ్ ఐడియా!' అని మెచ్చుకున్నాడు వేణు. మిత్రులసలహా ననుసరించి వెంటనే బయలుదేరాడు శంకరంగారింటికి.

ఇంట్లో మేష్టారు లేరు. వసారాలో మూడేళ్ళబాబు ఒక్కడే రైలాట ఆడుకుంటున్నాడు. వేణు యిటూ అటూ చూశాడు. ఇంట్లో లోపల పనిమీద వున్నారు పార్వతీవాళ్ళు... ముందు గదిలో షెల్ఫులోవున్న గడియారం అయిదున్నర చూపుతోంది వేణును ఎక్కిరించినట్లుగా... 'ఎలాగూ తను పరీక్షించడానికేగా వచ్చాడు?...' అనుకుని తమాయించుకున్నాడు వేణు.

'ఏయ్!...బాబూ!...ఇట్రా...' అని పిలిచాడు బాబును.

'నాన్నాలు...లేలండీ...' అటూ దగ్గర కొచ్చాడు బాబు.

'ఎక్కడికెళ్ళాడు?'

'మలేమో...లైబలీకెల్లాలు...' అంటూ లోపలికెళ్ళి మూలవున్న చాపను కష్టపడి తీసుకొచ్చి బయటవేసి 'కూచోండి...' అన్నాడు బాబు వచ్చీరానిమాటలతో.

'కూచుంటాగానీ...ఏయ్! ఎక్కడి కెళుతున్నావ్?...ఇట్లారా నీతో మాట్లాడాలి..' అంటూ పిల్చాడు వేణు. "ఏంతి?..." అంటూ తను రైలుగా వుపయోగిస్తున్న క్రరతోసహా వచ్చి పక్కన కూర్చున్నాడు బాబు.

మూడేళ్ళు నిండని వయస్సు. ముద్దు ముద్దుమాటలు...ముద్దులు మూటగట్టే ముఖం!...వేణుకు బాబును చూస్తుంటే ముచ్చటేసింది... దగ్గరగా కూర్చోబెట్టుకుని 'ఏమాట ఆడుతున్నావ్?...' అని అడిగాడు ముందుకుపడిన ముంగురులుసర్దుతూ వేణు.

'లైలాత... మీలా వత్తాలా ... ఆలుకుందాం...'

వేణుకు నవ్వొచ్చింది పసివాడి అమాయకత్వానికి.

'నేను ఆడుకుంటే ఎలా? చదువుకోవద్దా?...ఇదిగో యీ పుస్తకాలన్నీ చదవకపోతే మేష్టరు కొట్టడూ?...' అన్నాడు.

'ఊహూ..మావాన్నా లెప్పులా కొత్తలు.. మా నాన్నాలు మంచివాన్న ... ఆలుకోమంతాలు...' అన్నాడు అమాయకంగా బాబు.

అంత చిన్నవాడైనా ఎంతో మర్యాదగా బాబు మాట్లాడ్డం వేణుకు కొంచెం ఆశ్చర్యం కలిగించింది. అతడికి తెలియకుండానే అతడిలో తన మాటల్లోని మర్యాదలేనితనం కొంచెం [illegible] తోచింది.

'మేష్టరుగారు కొట్టరనుకో...అయినా చదువుకోవాలిగా...' అన్నాడు బాబు బుగ్గలు పుణుకుతూ.

'అయితే...ఆ పుత్తకంతో బొమ్మలు... చూపలూ?...' గబగబా దగ్గరికి జరిగి కూచ్చున్నాడు ఆసక్తిగా.

'ఇందులోనా? ఇందులో బొమ్మలుండవు నీకు బొమ్మలు కావాలంటే రేపు తీసుకొచ్చిపెడతాలే.'

'నిజంగావా !!' బాబు చక్రాల్లాంటి కళ్ళు సంతోషంతో మిలమిలా మెరిశాయి.

'ఓ. నిజంగా తప్పకుండా నీకు మంచి మంచి బొమ్మల పుస్తకాలు తెచ్చిపెడతాగా. నీ పేరేమిటింతకూ?...'

'నా పేలు లగూ' అని చెప్పి వెళ్ళిపొయ్యాడు బాబు, తన ఆట హడావుడిలో.

వేణు ఒకసారి వొళ్ళు విరుచుకుని ఆవులించి గంట చూశాడు. అప్పటికి ఆరుకు యింకా అయిదు నిముషాలేవుంది! ఇక ఈయన వేళకేం వస్తాడు? తమ ప్లాను పారింది. ఇక చిక్కాడులే అనుకుంటున్న వేణు, వాకిట్లో సైకిలు చప్పుడు విని తిరిగి చూశాడు. శంకరంగారు!

వేణుకు ఆ సమయంలో ఆయనమీద చెప్పలేనంత కసి కలిగింది. ఈయన యింకాసేపు ఆ లైబ్రరీలోనే ఏడవరాదూ! మునిగిపోయినట్లు పరుగెత్తుకు రమ్మని ఎవడేడ్చాడు, అనుకున్నాడు మనసులో... శంకరంగారు 'ఓహో! మీరొచ్చేశారే' అని నవ్వుతూ పలకరించి సైకిలు పెట్టి దొడ్లోకి వెళ్ళి కాళ్ళు కడుక్కుని వచ్చేసరికి సరిగ్గా చిన్నముల్లు ఆరుమీదా, పెద్దముల్లు పన్నెండుమీదా కన్పించి మళ్ళీ వేణును ఎగతాళిచేశాయి, వేణుక్క గడియారం తీసి పగలగొట్టాలన్నంత కోపం వచ్చింది కానీ యివ్వాళ కాకపోతే రేపు, రేపు కాకపోతే ఎల్లుండి యీయన చిక్కక ఎక్కడికి పోతాడు అనుకుని తమాయించుకున్నాడు.

(ఇంకా వుంది)




LIFEBUOY
for health



సింగరాజు రామచంద్రమూర్తి

చాలాకాలం తరువాత చూడడం వలన చూడగానే మాటా పలుకూ లేకుండా అలాగే నిలబడి పోయాను.

దగ్గరకొచ్చి భుజంమీద చేయివేశాడు ఆనందరావు. 'నేను పతినికానని నన్ను కూడా బుకాయించాలనా అలా నిలబడి పోయావు? పలకరించవా!' అన్నాడు నవ్వుతూ.

నేనూ నవ్వేశాను.

'ఆ విషయం ఎవరు చెప్పారు.?'

సాక్షాత్తూ సుబ్బారాయుడే!... 'రఘుపతి అగపడ్డాడూ. పోయి పలకరిస్తే, 'సారీ మీరనుకున్న రఘుపతిని నే కాను. వాడు నా కజిన్.' అని నవ్వేశాడు. నిజంగా రఘుపతి కాదంటావా ఆనందరావ్?' అనడిగాడు. నీబాధ అర్థం చేసుకున్నవాడి నవడంవలన ఆతనికేదో సర్దిచెప్పి పంపాను... అవునూ, అలా ఎన్నాళ్ళు దాగుడుమూత లాడతావు?'

ఇక ప్రస్తావన మార్చకపోతే ప్రమాద మని 'ఎప్పుడొచ్చా విక్కడికి? ఎదయినా ఎగ్జామినర్‌గానా?' అనడిగాను.

'ఇక్కడికి వచ్చినవాడివి, ఇప్పుడే బస్సు దిగినవాడివి నువ్వని నీవాలకం చెబుతోంది. నా విషయం తెలియదో మరి, లేక తెలిసే నాటకం ఆడుతున్నావో నాకు తెలియదు. నేను ఇక్కడ కాలేజిలో హెడ్‌గాచేరి మూడు సంవత్సరాలయింది. మన బాచ్‌లో కొంచెం నీతో సంబంధాలు ఉంచుకోగలిగిందీ, నీ గురించిన విషయాలు చెప్పగలిగిందీ నేనొక్కడినే! మిగిలినవాళ్ళకి తుపాకి దూరంలో ఉండగలుగుతున్నావుగాని నాకు కనీసం మూడు, నాలుగు సంవత్సరాల కొకసారయినా దర్శనం ఈయక తప్పడం లేదు నీకు... అక్కడేనా ఉండడం?'

'నాలాంటివాడు ఇంకెక్కడ చలామణి కాగలడు?'

'ప్చ్, ప్చ్,. నీ ధోరణి మార్చుకోవడం లేదోయ్ నువ్వు. ఏముందని అప్పుడే అంత నిస్పృహ పడడానికి! జీవితం పెద్ద జూదంలాంటిది గురూ, స్టేక్ వేస్తూ ఉండాలి — గెలిచావా కొత్తరోడ్డుమీద సాగిపోతుంది. పోయిందీ మరో అవకాశంకోసం కాచు కోవడమే!...ఏమీ అనుకోకపోతే ఒక్కమాట చెప్పనా? ఆనర్స్ చదివావు. అది కాస్తా పోయింది. అంతమాత్రాన నీతోటివాళ్ళ ముందు నిన్ను నువ్వు కించపరుచుకోవడం దేనికి? నీతో చదువుకున్నవాళ్ళకి దూర దూరంగా తప్పుకోవడం, ఖర్మకాలి సుబ్బా రాయుడు లాంటివాడు కనబడి పలకరిస్తే 'నేను మీరనుకున్న పతి కానండీ...' నగయిరా నాటకం బాగాలేదు రఘుపతి నీ పద్ధతి! పోనీ అతన్ని నమ్మించగల ననుకున్నావా? సుబ్బారాయుడి సంగతి నువ్వెరగనిదా! పేగులు లెక్కపెడతాడు.'

నవ్వాడు ఆనందరావు. నేనూ నవ్వే శాను. నిజానికి నేనుచేసిన ఆపని ఎప్పుడు గుర్తుకువచ్చినా నవ్వొస్తుంటుంది. కాని ఆ క్షణంలోమాత్రం అలా అబద్ధం ఆడేయ బుద్ధేసింది. అవునుమరి, పరిస్థితి అటు వంటిది.

ప్లాటుఫారంమీద ఆఫీసరుకి వీడ్కో లిచ్చేందుకు మిగిలిన గుమాస్తాలతోపాటు నిలబడ్డాను. ఆఫీసరు వేస్తున్న అర్థంలేని జోకులకి నవ్వుతున్న తోటివారిని చూసి అసహ్యించుకుంటూ నన్ను నేను తిట్టు కుంటున్న సమయంలో రైలురావడం, ఆగడం, మా ఆఫీసరుని ఫస్టుక్లాసులో ఎక్కిస్తుంటే సుబ్బారాయుడు 'ఏ. సి.'

లోంచి దిగినవాడల్లా నన్ను చూడడం తటపటాయించాయి. పాపం అతని కళ్లల్లో నిండుగా ఆనందమే అగపడింది నాకా సమయంలో.

'హల్లో రఘుపతీ, ఎన్నాళ్లకెన్నాళ్లకు!.. జర్నీ కాన్సిల్ చేసుకోవేమిటి సరదాగా తిరుగుదాం ఒకరోజు. ఆనంద్ కూడా ఇక్కడే ఉన్నాడుట. బైదిబై, నీకథలు! బాగుంటున్నాయి గురూ, మా లాడ్జిలో అందరికీ చెబుతుంటాను అతను నా ఫ్రెండని'.

ఒక్కక్షణం అతని వాత్సల్యానికి ముగ్ధుణ్ణయిపోయాను. కాని అంతలోనే అతనూ, నేను, ఆనందరావు కలిసి గడపబోయే ఒక రోజు—బెర్లిన్ సూట్లు ఖరీదయిన ఇద్దరు మనుష్యుల మధ్య ఒకరోజు—

'సారీ సర్, నన్ను మీరు రఘుపతి అనుకున్నారు. అదీ ఒకందుకు మంచిదే లెండి! వాడు నా కజిన్. అచ్చం నా పోలికే! రాదర్ నేను వాడిపోలికే! తప్పకుండా చెబుతాను వాడికి. అన్నట్టు ఇప్పుడు మీరేం చేస్తున్నారు? చెప్పాలిగా మరి మావాడికి' అనేశాను.

కాసేపు అర్థం కానట్టు నావంక చూశాడు అతను. అంతలోనే నా భుజం తట్టి 'ఆల్‌రైట్ గురువుగారూ, చెప్పండి అతనికి. సుబ్బారాయుడు స్నేహితుల్ని అంత ఒప్పున మరిచిపోడని! నేను కల్‌కటాలో ఉంటున్నాను 'టాటాస్'లో... అన్నట్టు రఘుపతికి ఇంకెవరయినా అతని పోలికే ఉన్న దాతయ్యలుగాని, అన్నయ్యలుగాని పోనీ చెల్లెళ్ళుగానీ ఉన్నారేమిటి ఖర్మ. మరేం లేదు ఈసారి వాళ్ళని పట్టుకు పలకరిస్తానేమోనని భయం. అచ్ఛాసార్, గుడ్‌బై' అని లోపలికి వెళ్ళిపోయాడు.

తెల్లబోయాను.

తరువాత మా ఆఫీసరు అడిగాడు. 'మీ ఫ్రెండా ఆయన' అని. ఆయన ప్రశ్నలో గౌరవం అగపడింది.

అవునుమరి, అవతల ఖరీదయిన మనిషి కదా!

'అన్నట్టు మీరు ఆనర్సు చదివారు కదూ—మీ క్లాసుమేట్సంతా పెద్దవాళ్ళయి ఉండాలి లెండి మరి.'

అవును. అంతా పెద్దవాళ్ళు. హోదా కలవాళ్ళు. అదే ఇప్పటి నా సమస్య. వాళ్ళు అయినందుకు ఈర్ష్యవలనకాదు. నేను కాలేకపోయినందుకు బాధవలన.

జీవితంలో మొదటినుంచి ఒకే ఎత్తులో బ్రతుకుతే పెద్ద ఆశలూ ఉండవు. అవి తీరలేదన్న దిగులూ ఉండదు. కాని మధ్యలో పైకిపోబోయి అంతలో పడిపోయి అతి సాధారణ ఉద్యోగి నవడమే నా జీవితంలోని పెద్ద మలుపు. అందుకే సాధ్యమయినంతవరకు వాళ్ళందరికీ దూరంగా ఉండటం కూడా!

'ఏమిటోయ్ ఆలోచనల్లోంచి బయట పడ్డావా లేదా? మొత్తం మీద చాలా మారి పోయావు రఘుపతీ — రా, మా ఇంటికి వెడదాం' అన్నాడు ఆనందరావు.

అప్పటివరకూ నేను ఆలోచనల్లోపడి అతని వెంటేవస్తున్న సంగతి గమనించ లేదు.

'ఎందుకోయ్ ఆనందరావ్, వెడతాను పనుంది — దగ్గరలో ఒక పల్లెటూరు వెళ్ళాలి. పొద్దుకుంకకుండానే చేరుకోవడం మంచిది.'

'దగ్గరే మా ఇల్లు, మొన్న సమ్మర్‌లో కొన్నాను పదిహేనువేలుపెట్టి. దానికి ఒక అయిదారు మరమ్మతులకింద, మరో రెండు మూడు మనకి కావలసిన మార్పులకి— మొత్తానికి ఒక పావు 'ల'కారం అయిందనుకో. అంత ఖర్చుపెట్టాక నీలాంటి మిత్రులచేత 'బాగుంది' అనిపించుకుంటే అక్కడి కదొక తృప్తి.'

'ఈసారికి వదిలెయ్, కొంచెం ఖంగారులో ఉన్నాను. మళ్ళీ వచ్చేప్పుడు మీ కాలేజీకి వచ్చి నీవెంట మీ ఇంటికి వచ్చి...'

అలా వదిలించుకున్నాను అతన్ని, వదిలించుకున్నాగాని అతన్ని గురించిన ఆలోచనలు మాత్రం నన్ను ముసురుకుంటున్నాయి. జీవితం అతని మనుగడకి సరిపోగా పైన ప్రయివేట్లమీది సంపాదనంతా నిలవచేసి ఉంటాడు. అందుకనే ఉద్యోగంలో చేరిన కొద్దికాలంలోనే అంత ఖర్చుపెట్టి ఇల్లు కొనగలిగాడు. ఈ లెక్కన అతను రిటైరయే నాటికి అతనిదగ్గర ఎంత మిగులుతుంది?

నా ఆలోచనలకి నాకే నవ్వొచ్చింది. బంగారపు పిచ్చుకల్లాంటి వీళ్ళ జీవితాలకేం కొదవ? వడ్డించిన విస్తరిలాంటిది. పూలబాటమీది నడకలాంటిది. మరి నేను?

మోహరాలు అవసరానికి వచ్చినా జీతాన్ని పంచడంలో మునిగి నెలరోజులు గడుపుతున్నవాడిని. లేమి అన్నది లేదుగాని, సరదాలకి నోచుకోనివాడిని. మరి నేనూ వాళ్ళతో పాటు చదువుకున్నవాడినే! అయితే చివరలో విధి పరిహసించింది

రోజులా ఒకే వరసలో సాగే ఈ ఆలోచనల్లోంచి బయటపడి అన్నయ్యగారింటికి వెళ్ళాను, అక్కడ ఒకసారి కనబడి చెప్పినబస్సు అందుకోవాలని నా ఉద్దేశ్యం. వచ్చినప్పుడల్లా హాజరు వేయించుకోవలసిన ఇల్లుకదా మరి!

'ఏరా పుట్టింటివార్త ఏమయినా తెచ్చావా?' అనడిగాడు అన్నయ్య నన్ను చూసినానే.

'అక్కడికనే బయలుదేరాను. ఒకే నాలుగురోజులు శలవలుకదా,

'అవునుగానోరేయ్. హనుమంతరావు ఏమని అడిగాడో తెలుసా?' మీ తమ్ముడికీ మీకూ మాటలు లేవా?, అని.'

'ఎందుకంట?'

నేనూ అదే అడిగాను. దానికంటాడు కదా 'మరి మీ ఇంటి కతను వస్తుంటే ఒక్కసారి మా ఇంటికి తీసుకురారేం? ఇక్కడ అతనితో కలిసి చదువుకున్నవాడొక హాస్టల్లో రూమ్మేటు ఒకడున్నాడన్న విషయమయినా చెప్పరేమని?' అని. ఏమంటావు? టేప్ రికార్డర్ ఒకటిచ్చాడు నాకు కొంచెం టెస్ట్ చేయమని. అన్నట్టు అతను ఫారిన్‌నుంచివచ్చాక నువ్వసలు చూడలేదనుకుంటా—ఇంకాసేపట్లో వస్తానన్నాడులే!'

'ఇప్పుడు నేను వెళ్ళిపోవాలి.'

'కొంచెంసేపు ఆగరాదూ — అతను పాపం అంతగా ఇదవుతుంటే! వస్తానన్నాడుగా...' అంటూనే ఆపేశాడు.

'నాతోపాటు చదువుకున్నవాళ్ళకి దూరంగా ఉండేందుకు ప్రయత్నిస్తానని అన్నయ్యకి తెలుసు అది నచ్చదుకూడా! చాలాసార్లు ఆవిషయమే అన్నాడు నాతో. 'వాళ్ళంత ఉద్యోగాలు నీకు లేకపోవచ్చు. అంత మాత్రాన అలా అందరికీ దూరం కాకూడదురా. పెద్ద హోదాలో ఉన్న స్నేహితుల వలన అవసరాలుకూడా ఉంటాయి. మన్ని మనం తక్కువ చేసుకోకూడదు.' అని.

ఒక గంటసేపు అక్కడ గడిపి పదిహే

# ఈ జీవితం చాలు

ఇచ్చిన కాఫీ టిఫిన్లు పూర్తిచేసి వచ్చేప్పుడు శుభవర్తమానం తీసుకురమ్మన్న ఆవిడ మాటకి నవ్వుకుంటూ బయటపడ్డాను.

బస్టాండుకి వెళ్ళిన నాకు బస్సు దిగుతున్న శేషగిరిరావు అగపడ్డాడు. అతను నాకు రెండు సంవత్సరాలు సీనియరు. పెద్దగా పరిచయం లేకపోవడంవలన అతని పక్కనుంచే వెళ్ళి పోతున్న నన్ను అతని పిలుపు ఆపింది.

'నన్ను మీరు గుర్తుపట్టలేదేమోగాని రఘుపతిగారు, మిమ్మల్ని మరిచిపోవడం అంత తేలికకాదు సుమండీ. నేను శేషగిరిని.'

మధ్యలోనే అందుకుని 'భలేవారే, మిమ్మల్ని గుర్తుపట్టలేకపోవడమేమిటి ?' అనేశాను.

'ఇప్పుడీ వూళ్ళోనే ఉంటున్నాను— శలవుపెట్టి స్వంత ఇంట్లో గడుపుదామని. అన్నట్టు మీకు తెలుసో తెలియదో మన వాళ్ళు — అంటే ఐవిహాన్ యూనివర్శిటీ ఘటాలు ఇక్కడ చాలామంది చేరారు సుమండీ! వీళ్ళుకాక మధ్యమధ్య వచ్చిపోయే వాళ్ళు — సూక్ష్మంగా చెప్పాలంటే చిన్న సైజు వైజాగ్‌లా ఉంటోంది.'

అతను ఏంచేస్తున్నాడో తెలియదుగాని తెలుసుకోవాలన్న కోరికమాత్రం కలిగింది. ఎందుకంటే అతను చదివేరోజుల్లో చాలా తెలివయినవాడని పేరుండేది! అయితే ఆ ప్రశ్న వేయలేకపోయాను. వెంటనే నా ఉద్యోగం చెప్పవలసివస్తుందన్న భయంవలన!

'రండి మా ఇంటికివెళ్ళి కాఫీ పుచ్చుకుందాం. నేనూ ఇప్పుడే ఊరునుంచి వస్తున్నాను చూశారుగా! కమాన్'

అతనితో నాకట్టే స్నేహం లేనివాడిని. అందుకనే అతనలా పిలుస్తుంటే ఆశ్చర్యపడ్డాను. కాదనలేకపోయాను కూడా!

చక్కటి ఇల్లు—బంగళా అనవచ్చు కూడా—ముందు తోటా, అల్సేషియన్ కుక్కా అతని సంపాదనకి నిదర్శనాలుగా అగపడ్డాయి.

నేను చూసిన ఇళ్ళల్లో అంత శుభ్రంగా, అందంగా అలంకరింప బడిన డ్రాయింగ్‌రూం చూడలేదెక్కడాను.

లోపలికి వెళ్ళినవాడల్లా కాఫీపాటికి ఇవతలికివచ్చి 'ఈవిడ నా మిసెస్...ఇతను నాకు జూనియర్ రఘుపతి కథకుడు.' అని పరిచయం చేశాడు.

ట్రే బల్లమీదపెట్టి తలఎత్తిన ఆమెను చూసి తెల్లపోయాను.

'వరలక్ష్మి—మా ఆవిడపేరు. బహుశ మా మావగారి నోములపంట అయుంటుంది. నాకుమాత్రం 'వరం'.' నవ్వాడతను.

నవ్వటానికి ప్రయత్నించి విఫలుడినయాను.

గబగబ లోపలికి వెళ్ళిపోయింది వరలక్ష్మి.

'చప్పున కాఫీపట్టుకురా వరం. బాగ్ బస్టాండులో మర్చిపోయాను. వెళ్ళి తీసుకురావాలి..' అని పెద్దగా కేకేసి 'చూడండి రఘుపతిగారూ, మీరు అగపడిన సంబరంలో నా సంచీ మర్చిపోయాను. పోతే మీదే బాధ్యత' అన్నాడు నవ్వుతూ.

నా చెవులకి అతనిమాటలు వినబడుతూనే ఉన్నాయిగాని మనస్సుకి ఎక్కడం లేదు. నా బాధల్లా ఒక్కటే—వరలక్ష్మి ఇతన్ని పెళ్ళిచేసుకుందని నాకు తెలియదు. తెలిస్తే వచ్చేవాడిని కాను.

వరలక్ష్మి కాఫీలు తెచ్చింది. గబగబా తాగి 'ఒక్క పావుగంటలో వచ్చేస్తాను రఘుపతిగారూ' అని హడావుడిగా వెళ్ళిపోయాడు శేషగిరి.

నాకలా అక్కడ ఉండ బుద్ధికాక లేవబోయాను.

నా భుజంమీద చేయి పడింది!

ఉలిక్కిపడి తలెత్తి చూశాను.

వరలక్ష్మి ముఖం ఎర్రబడి ఉంది. కళ్ళు నీళ్ళతో నిండి ఉన్నాయి.

వెంటనే చేయితీసి 'ఎన్నాళ్ళకి దర్శనం ఇచ్చారు!' అంది.

ఇంకా ఆమె మాటలో ఆ దుఃఖం తాలూకు ఛాయలు పోలేదు. ఆమెను చూస్తుండిపోయాను. అవునుమరి — ప్రాణంతో సమానంగా చూసుకున్న ఆమెను అయిదు సంవత్సరాల తరువాత చూడడమాయె!

కుర్చీనాకు దగ్గరగా లాక్కుని 'నన్నలా అన్యాయం చేసి పోయావెందుకు రఘుపతీ!' అంది నా కళ్ళల్లో సూటిగా చూస్తూ.

ఏమని చెప్పను?

'ఇప్పటికయినా చెప్పవూ?'

ఇక తప్పలేదు.—

'పరీక్ష పోవడంతో నా జీవితం ఎటూ పాడయి పోయింది. నాతో ముడివేసుకోవడం వలన నీ జీవితానికి కూడా సుఖం ఉండేది కాదు. అలా జరుగుతుందన్న భయంతోనే నీకు కనబడకుండా వెళ్ళిపోయాను.'

'అంతేనన్నమాట నన్నర్థం చేసుకున్నది... ఇదీ ఒక రక మయిన స్వార్థమే!'

'అంటే?'

'అవునుమరి— ఎంతసేపూ నీ దృష్టి నీదేకాని ఇవతల నా అభిప్రాయం ఏమిటో తెలుసుకునేపాటి విశాల దృక్పథం లేక పోయింది నీకు'

'నన్ను నమ్ము వరలక్ష్మీ, కేవలం నీ సుఖం కోసమే— కష్టమన్నది ఎరగని దానివి, అది నాకై నేను నీకు నేర్ప వలసి వస్తుందన్న భయంతో...'

'థాంక్స్! చాలా సుఖపెట్టావు.' నువ్వే నా సర్వస్వం అన్న మనిషి హఠాత్తుగా అయిపూ, అజా, లేకుండా పోయినప్పుడు నేనెంత బాధపడ్డానో ఊహించలేవూ?... రెండు సంవత్సరాలు నీ కోసం వేయి కళ్ళతో ఎదురుచూశాను. నాన్నగారినీ, అమ్మనీ రెండు సంవత్సరాలు నా పెళ్ళి వాయిదా వేయమని బతిమాలి ఒప్పించాను. కాని నువ్వు నాకు మిగిల్చిందేమిటి — నిరాశ! ఏక్షణంలో వచ్చినా 'నీదాన్ని' అని నీ ఒడిలో వాలిపోదామని ఎదురుచూశాను. కాని..కాని..' గబుక్కున చేతుల్లో ముఖం దాచుకుని వెక్కివెక్కి ఏడవసాగింది.

ఆమెను ఎలా ఓదార్చాలో తెలియలేదు.

'చూడువరలక్ష్మీ! నిన్నీస్థితిలో చూడ లేను. నామీద ఒట్టే. ఊ. మానేయాలి.. నీకళ్ళల్లోకి ఈ ఏడుపన్నదే రాకూడదని, కష్టాల ఛాయలు నీమీద పడకూడదని ఆశపడ్డాను. కాని ఇప్పు డర్థమయింది పరం నేను మోసపోయానని!'

'అవును. నన్ను మోసం చేశావు. అసలు నీ చదువుని, నీ తెలివితేటల్ని ప్రేమించానని ఎలా అనుకున్నావో నా కెంతమాత్రం అర్థంకావడంలేదు. నీ పరీక్ష పోయిందని తెలిసినప్పుడు బాధ పడ్డాను. కాని నాక్కావలసింది ఫస్టుక్లాసులో పాసయిన రఘుపతి కాదు. ఉట్టి రఘుపతిమాత్రమే! అతని మంచిమనసు కావాలి నాకు. అందు కోసమే —అన్నీ చేశాను. చివరికి అదే దూరం చేశావు'

గుండె పగిలేలా ఏడవాలనిపించింది.

అంతలోనే గేటులోంచి శేషగిరి వస్తున్న చప్పుడు విని వరలక్ష్మి లోపలికి వెళ్ళి పోయింది.

నేనూ లేచాను.

'శేషగిరిగారూ, మరి నే వెడతాను. మీకోసమే ఆగాను'

'థాంక్యూ. శ్రీమతి, మీరు వెళ్ళి పోతున్నారు. వింది లెండి, పదండి పోదాం' అని నావెంట మళ్ళీ బయటికి నడిచాడు.

గేటుదాటి ఇంకా నావక్కనే నడుస్తున్న అతన్ని ఆపి 'ఇక మీరు లోపలికి వెళ్ళండి. నేను చకచక వెళ్ళకపోతే బస్ అందదు' అన్నాను.

నా మనస్సంతా పాడయిపోయింది. ఒక్క సారి నాగతం సింహావలోకనం చేసుకున్నాను. ఏదో సాధిద్దామని ఆనర్సు చదివాను కాని కారణం ఏదయినా అందులో ఫలితం [illegible] శూన్యమయింది.

అపురూపమయిన వ్యక్తి వరలక్ష్మి నాదవుతుందనుకున్నాను. అయితే పరీక్ష పోవడంతో ఆమె సుందరస్వప్నాలు కూల్చే యడం ఇష్టంలేక దూరంగా వెళ్ళి పోయాను. కాని నేనే ఆమెను అపార్థం చేసుకున్నాను. లేకపోతే వరలక్ష్మి నాదయేది. జీవితంలో దెబ్బతిన్న నాకు వరలక్ష్మి పెద్ద రిలీఫ్ కలిగించేది. చేజేతులా వరలక్ష్మిని దూరం చేసుకున్నాను...

అడుగు ముందుకు సాగక పక్కనే ఉన్న హోటల్లోకి నడిచాను.

కాఫీ తెప్పించుకు తాగుతున్న నా దృష్టి అప్రయత్నంగా నా ముందు కూర్చున్న కుర్రాడిమీద పడింది.

అతనికి చేతులులేవు. భుజాలదగ్గర చేతుల తాలూకు గుర్తులుగా రెండు బోడిపెలు మాత్రం ఉన్నాయి. సర్వరు తెచ్చి తనముందు పెట్టిన కాఫీవంక ఆశగా చూస్తున్నాడు.

అది తాగటానికి అతను అశక్తుడు!

నాకు జాలేసింది.

అంతలో అతని పక్కనఉన్న పెద్దా



యనకి ఈ కుర్రాడు గుర్తుకొచ్చిన ట్లున్నాడు, గబుక్కున కప్పుని అతనికి అందేలా పట్టుకున్నాడు.

చూడలేక పోయాను ఆదృశ్యం.

డబ్బిచ్చేసి బస్టాండుకేసి నడిచాను. టికట్టుకొని జేబులో పెట్టుకుంటుంటే వేలికేదో కాగితంతగిలింది. తీసి చూశాను.

శేషగిరి రాసినది. అతను నావెంట గేటుదాకా వచ్చినప్పుడు నా జేబులో వేసి ఉండాలి! ఆత్రంగా చదివాను.

రఘుపతిగారికి,

మీరిద్దరూ చాలాకాలానికి కలుసుకున్న వాళ్ళు. అందుకోసమే పెద్దగా స్నేహం లేకపోయినా మిమ్మల్నింటికి తీసుకువెళ్ళింది. అందుకోసమే సంచి అసలు పట్టుకెళ్ళక పోయినా పోని ఆ సంచీ కోసం బస్టాండుకి వెళ్ళింది.

మీ ఇద్దరి ప్రేమకథ విన్నాను. అయితే నాకు తెలుసునని మీ కందరికి తెలియదు. ఒక విధంగా మీ ప్రేమ విఫలం కావడం నా అదృష్టం. వరంలాంటి దేవత నాదయింది.

మీకొక్క సలహా. పరీక్ష పోయినందు వలన జీవితమంతా అయిపోయినట్లు బాధ పడే మిమ్మల్ని చూస్తే జాలివేస్తుంది. ఆ అభిప్రాయం తప్పు. అందువలననే మీరు వరలక్ష్మిని పోగొట్టుకున్నారు.

పెద్ద ఉద్యోగులు, డబ్బున్నవాళ్ళు—

## ఈ జీవితం చాలు

అంతా సుఖపడిపోతున్నారనుకోవడం మీ పిచ్చి భ్రమ. ఎవరిబాధలు వాళ్ళకున్నాయి. కావా లంటే మనవాళ్ళనే చాలామందిని చూపి స్తాను మీకు. వాళ్ళంతా మిమ్మల్ని చూసి ఈర్ష్య పడే స్థితిలో ఉన్నారు మీరు!

చదువుకునే రోజుల్లో మనకన్నా బాగా చదివేవాళ్ళని చూసి ఈర్ష్యపడాలి. కాని అదృష్టంలో మాత్రం మనకన్న దురదృష్ట వంతులతో మన్ని పోల్చుకోవాలి.

మొదటిదానివలన జీవితంలో పైకి పోయేందుకు, రెండవదానివలన ఉన్నదానితో తృప్తిపడేందుకు సమార్గం ఏర్పడుతుంది.

మీకేం తక్కువ—ఆలోచించుకోండి!

శెలవు.

శేషగిరిరావు.

నా కొక్కసారి మబ్బు విడినట్లయింది. నిజం అతనన్నమాట. నా జీవితంలో నాకేం తక్కువ? తిండి, బట్ట ఇవ్వగల ఉద్యోగం ఉంది.

వరలక్ష్మి నాది కానందుకు బాధ పడ్డాను. అయితే నాకోసం, నా సుఖంకోసం తన సర్వస్వాన్ని అర్పించేందుకు సిద్ధంగా ఉన్న నా భార్య ఆమెకన్నా ఏంతక్కువ? ఆమెని పొందగలగడం అదృష్టం కాదూ?




మాకు పుట్టబోయేబిడ్డ...హఠాత్తుగా హోటలులో చూపిన కుర్రాడి రూపం మెదిలింది మనస్సులో.

హృదయం కలుక్కుమంది.

'భగవాన్, ఏలోపం రానీయకు. అంద చందాలక్కరలేదు నాకు. నా పిల్లల్ని చూపి ఒకరు జాలిపడేట్లు చేయకు.' మనస్సు లోనే చేతులు జోడించాను.

అంతలోనే ఎవరో ఎప్పుడో చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి 'పురుడు కష్టం అయితే, పిల్లకావాలా, తల్లి కావాలా' అని అడిగారు తల్లిప్రాణం చాలన్నాము అప్పుడు...'

బస్సులోంచి దగాకి పరుగెత్తుదా మని పించింది. "నా భార్యను నాకు సలక్షణంగా దక్కించు భగవంతుడా, అంతకన్నా ఎక్కువ కోరను. నన్నన్యాయం చేయకు. అదిలేందే బ్రతకలేను. అది ఉన్న నాజీవి తానికి ఏ లోటూలేదు. రాజా రాణీలకన్నా ఎక్కువ సుఖంగా ఉంటాము. నా కోర్కె కాదనకు.'

పిచ్చిపిచ్చి ఆలోచనలతో అత్తవారింట గుమ్మంలో అడుగుపెట్టాను. కాళ్ళు కడుక్కునేందుకు నీళ్ళతో ప్రత్యక్ష మయ్యింది మరదలు.

'మీ అక్కయ్య...' అని ఆపేశాను— ఏం వినవలసి వస్తుందోనని భయంతో.

'మా అక్కయ్య, మీ అబ్బాయి మీ కోసం చూస్తున్నారు రండి' అంది.

'వేళకి తిండిలేక చిక్కిపోయారు పాపం' అంది వసుంధర నన్ను గుచ్చిగుచ్చి చూస్తూ.

కాని నేనామె ప్రశ్నకి సమాధానం ఇవ్వలేదు.

మాతృత్వ మహాత్మ్యం గర్వంతో వెలిగి పోతున్న వసుంధరని, దానిపక్కన తెల్లని బట్టల్లోంచి ఎర్రగా అగపడుతున్న పుత్రుణ్ణి చూస్తుండి పోయాను.

'నేను అదృష్టవంతుణ్ణి' అన్నాను గర్వంగా, పెద్దగా. ●

# వారఫలం

**12-5-1967 శుక్రవారం మొదలు**
**18-5-1967 గురువారం వరకు.**

**మేషం:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు సుదరుకుగా సాగుతాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా లాభించగలవు. రాజకీయ వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఉద్యోగంలో మెప్పుకులాని కార్యభారాన్ని వహిస్తారు. సాంఘిక కార్యక్రమాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణించగలదు.

**వృషభం:** భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు లాభదాయకంగా ఉంటాయి. సమయానికే ఏదో ఒకవిధంగా డబ్బు చేతికి వస్తుంది. ప్రయాణాలు కొంచెం శ్రమ మీద ఫలించగలవు. కోర్టు వ్యవహారాలు బాగా ఉంటాయి. స్థిరాస్తి వ్యవహారాల్లో వారాంతంలో అనుకూలత లభిస్తుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మిథునం:** ఇదివరకు మీ కార్యక్రమాల్లో యేర్పడిన అవరోధాలు తొలగిపోతాయి. ఆర్థిక వ్యవహారాలు వారం మధ్యలో బాగా ఉంటాయి. నూతన వ్యాపారాలు ప్రోత్సాహకరంగా వుంటాయి. ఉద్యోగంలో అధికారుల ఆదరాభిమానాలను పొందగలరు. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు:— ఆరోగ్యం యిదివరకటి కంటే బాగా ఉంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**కర్కాటకం:** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం వచ్చే పరిస్థితి యేర్పడుతుంది. మిత్రులవల్ల వస్తువులు పోయే ప్రమాదం వుంది. వారం మధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో స్వల్ప భేదాభిప్రాయాలు రావచ్చును. దైవకార్యాలు నెరవేరుతాయి.

**సింహం:** వ్యాపారంలో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా లాభించగలవు. వారం మధ్యలో అధిక వ్యయం జరుగుతుంది. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. ఉద్యోగంలో తోటివారిని విశేషంగా నమ్మడం తగదు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**కన్య:** మీకు ముమ్మందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించగలరు. వ్యాపారంలో ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరుతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. సాటివారిలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. బంధువులకు సహాయం చేస్తారు.

**తుల:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాల్లో మిత్రుల సహకారం లభిస్తుంది. ప్రయాణాలు కొంచెం శ్రమ మీద ఫలించగలవు. ఉద్యోగంలో గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణించగలదు.

స్త్రీలకు:— ఆరోగ్యం సామాన్యంగా వుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృశ్చికం:** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సద్దుకొంటాయి. వృత్తిలో ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. వ్యాపారం భారీ యెత్తున చేయడం వలన ఆర్థికంగా ఒత్తిడి వస్తుంది. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

**ధనుస్సు:** ఏ వ్యవహారంలోను ఆరంభంలో కనుపించిన అనుకూలత ఆఖరువరకు నిలవదు. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. వారం మధ్యలో సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం పెరుగుతుంది. ఆందోళన కలుగుతుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. బంధుమిత్రులను కలుసుకొంటారు.

**మకరం:** వృత్తి వ్యాపారాల్లో మీరు అనుకొనేది ఒకటి జరిగేది మరొకటి కావచ్చును. ఇతరుల మీద ఆధారపడి యే వ్యవహారమూ ప్రారంభించడం తగదు. నూతన వ్యాపారాలు కొంచెం శ్రమ మీద ఫలిస్తాయి. సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది. వారాంతంలో ఆందోళన కలిగించే పరిస్థితి యేర్పడుతుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

**కుంభం:** భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాల కంటే మీరు స్వంతంగా చేసే వ్యాపారాలు లాభదాయకంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా లాభించగలవు. వృత్తిలో కొత్తవారితో పోటీ యేర్పడుతుంది. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం అధికం కాగలదు.

స్త్రీలకు:— ఆరోగ్యం సామాన్యంగా వుంటుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**మీనం:** కొన్ని వ్యవహారాల్లో మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. వ్యాపారంలో మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు యిప్పుడు ఫలిస్తాయి. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణించగలదు. సాటివారితో మాట పట్టింపులు తగవు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

—మహేష్



# చచ్చినవాడి బాధ




సర్దేశాయి వెంకటరామయ్య

సైకిలుపై గబగబా కాలేజీవైపు పయనిస్తున్న రామారావు రోడ్డుపైన గుమిగూడిన ఒకచిన్న జనసందోహాన్ని గమనించి సైకిలుదిగాడు. ఎదురుగా ఒక పదిమంది కూడిన చిన్నగుంపు. దేనిచుట్టో చేరి వున్నారు. ఏమిటో చూస్తున్నారు.

మనిషి! రోడ్డుపైన పడివున్నాడు. కదలికలేదు. శ్వాస వుందోలేదో తెలీదు. రకరకాలుగా అనుకుంటున్నారు జనం.

'ఇప్పుడే చచ్చి పోయకాడండి.'

'ఇప్పుడే పడిపోయాడండి.'

'ఇక్కడే చచ్చి పడిపోయకాడండి.'

మనిషి చచ్చిపడిపోయాడు. ఏమిటో కారణం? పడి చచ్చిపోయకాడు రోడ్డుపైన.

'పాపం! యే వూరో యేమిటో?'

'అందరూ నుంచునిచూస్తే యెలాగా? దహనసంస్కారాలూ, క్రియలూ చేయొద్దా? ఎవరైనా పెద్దమనుషులు ముందుకి రండి!' ఒక పెద్దమనిషి సజెషన్.

రామారావుకి గుర్తు వచ్చింది. దగ్గర్లో వున్నషాపుకి దారితీశాడు. షాపులో టెలిఫోను కెద్దకు పరుగెత్తాడు.

'హలో, హలో,...ప్రేమ సమాజమా?'

'... ... ...'

'మిసెస్ సుబ్బాయులు, ప్రెసిడెంటు గారేనా?'

'అవునండీ'

'క్షమించాలి మేడమ్ మీకు పని కల్పిస్తున్నాను మెయిన్‌రోడ్డుపైన, అంటే తాటికాయలవీధి మొదట్లో ఒకమనిషి చచ్చి పడివున్నాడండి. వాడికి యెవరూ లేనట్లుంది పాపం. వాడికి దహనసంస్కారాలూ వగైరా మీ సమాజంద్వారా....!'

'ఆగండాగండి! తాటికాయల సందు అంటే యెక్కడా కాలవ అవతలేనా?'

'అవునండి, వంతెన యివతలే!'

'అయితే మీరు దీనబంధు సంఘం వారిని సంప్రదించండి. దాని ప్రెసిడెంటు మిసెస్ సుబ్రామణ్యం!

'అదేమిటండీ!—మీ సమాజం చెయ్యొచ్చుగా!'

'అది అంతే, ఎంచాతనంటే, ఈ మధ్యన ఆ సంఘంవారికి, మా సమాజానికి చాలా గొడవలు వచ్చాయ్. ఒకరు చేయదల్చుకున్న పనినే యింకోరు చెయ్యతలపెట్టటం, అందులో పోటీలుకూడా పెంచుకోటం—పెద్దగొడవయింది. మన మిసెస్ బుల్లిబ్బాయ్‌గారులేరూ? జిల్లా ఆడవాళ్లసంఘం ప్రెసిడెంటుగారు—వారువచ్చి మా మధ్య రాజీ కుదిర్చారు. దానిఫలితంగా మేమంతా ఒప్పుకున్నదేమిటంటే కాలవకివతల కార్యక్రమాలన్నీ ప్రేమసమాజంవారు చేసేట్టూ, కాలవకవతల సంఘసేవా కార్యక్రమాలన్నీ దీనబంధు సంఘంవాళ్లు చేసేట్టూ. ఇప్పుడు మీరు చెప్పినశవం. కాలవకవతల వేడుంది కాబట్టి మీరు వారితోనే చెప్పాల్సివుంటుంది.'

'అలా గాండీ'

'అసలు మీరు చెప్పిన ఘటం నిజంగానే చచ్చిపడుందా? ఇంకా బతికేవుందా?'

'చచ్చే పడుందండి. అక్కడున్న ప్రజ అంతా చెప్తున్నారు ఇప్పుడే చచ్చాడని'

'అహా....మరేంలేదూ, మిసెస్ బుల్లిబ్బాయ్‌గారు రాజీ చేసేటప్పుడు 'చచ్చిన వాళ్ల సేవ దీనబంధు సంఘానికీ ఇంకా చావని వాళ్లసేవ మా సమాజానికే యివ్వమని కోరాం లెండి. ఆ విషయంలో తుది నిర్ణయం యింకా జరుగలేదు. చస్తూ చస్తూ వున్నవాళ్ల విషయం అసలు తేలలేదు. మీరు చెప్పిన వాడు అలాటి కేసయితే చచ్చేంత గొడవవుతుంది!'

'చాలా థాంక్సు మిసెస్ సుబ్బాయులు గారూ.'

* * *

'హలో, మిసెస్ సుబ్రామణ్యంగారేనా?'

'అవునండీ, దీనబంధు సంఘం ప్రెసిడెంటుని మాట్లాడుతున్నాను. యెంకావాలి?'

'నా పేరు రామారావండీ.'

'అయితే?'

'నేను రోడ్డు మీద వస్తూంటే ఒక శవం కనిపించిందండి, పాపం యెవరూ లేనట్లున్నారు. మీ సంఘం ద్వారా దహన సంస్కారాలూ అవీ, యేమైనా చేయిస్తారేమోనని.'

'మీరే సంఘంలో మెంబరు?'

'అమ్మా! నేను సంఘ సేవకుణ్ణి కాను. యే సంఘంలోనూ సభ్యుణ్ణి అసలే కాను. దారినపొయ్యే రామారావునని ముందుగానే చెప్పానుగా. మీ సంఘానికొక అర్జీదారుణ్ణి. అంతే.'

ఎక్కడ పడుంది శవం?'

'కాలవ యివతలేనండి.'

'అయితే మా యేరియా అన్నమాట. దీనిని పూర్తిగా చచ్చిపోయాడంటారా?'

'అవునండీ, చచ్చినమనిషి - చచ్చినట్టు పడున్నాడు.'

'అయినా చచ్చినవారికి సేవ యేమిటి?'

'చెప్పాను గదండీ, దహనం వగైరాలు యేమైనా మా సంఘం తరపున చేయిస్తే లేపోనని. ఇందాక మిసెస్ సుబ్రాయులు గారికి ఫోను చేశాను. కాలవ యివతలం కాబట్టి మీతో చెప్పుకోమన్నారు.'

'చూడండి రామారావుగారూ, కాలవ అవతల, ఇవతల అని పూర్తి పంచుకున్నాం గానీ, చచ్చినవాళ్ళా, బ్రతికినవాళ్ళా అని పంచుకోలేదు. మేము బ్రతికినవాళ్ళకి చచ్చేంత సేవచేస్తాం. ఇలాంటి విషయాల్లో మీరు 'సత్కర్మధర్మ సంఘం' వాళ్ళని సంప్రదించటం మంచిది. ఇలాటి పనులు వాళ్ళు చేయిస్తూ వుంటారు కూడా.'

'దాని కార్యదర్శి యెవరండీ?'

'ఎవరో తెలీదు. ప్రెసిడెంటు మాత్రం డాక్టర్ చిన్నపెద్దయ్య.— ఆఁ.—ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది. దాని సెక్రెట్రీ పేరు పెద్దచిన్నయ్య. ఫోను నెంబరూ అదీ తెలీదు. అయినా యిలాటి దిక్కుమాలిన (వాళ్ళ) టెలిఫోంకంతా ఫోనులుంటాయా యేమిటి? హాఁ' అని ఫోను పెట్టేసింది మిసెస్ సుబ్రామణ్యం.

* * *

'హలో ఇస్తాం గురుపాదికట్టిగారే నాండి?'

'అయ.'

'తమ యింటి పక్కన వుండే డాక్టరు చిన్నపెద్దయ్యగార్ని పిలుస్తారా?'

'అలాగే, తమరు?'

'నే నొక బాటసారిని. చిన్నపెద్దయ్యగారు సత్కర్మధర్మ సంఘం ప్రెసిడెంటు కదూ? సంఘానికో పని చెయ్యదల్చుకున్నాను.'

'అయ, అలాగే, నేను కూడా ఆ సంఘంలో బోర్డు మెంబర్నిలెండి. సంఘం పనిమీదని చెప్పి డాక్టరుగారు మా టెలిఫోను తరుచుగా వాడుకుంటూ వుంటారు.'

కాసేపట్లో డాక్టరుగారు ఫోను పైకి వచ్చారు.

'హలో, డాక్టరుగారూ, నా పేరు రామారావండి. మీ సంఘానికో పని చెయ్యదల్చుకున్నాను. మెయిన్‌బజార్ చివర—అంటే రాటికాయలప్పిడి మలుపు దగ్గిర ఒక మనిషి చచ్చి పడివున్నాడండి. అతనికి యెవ్వరూ లేనట్టుంది పాపం. తమ సంఘం ద్వారా అంత్యక్రియలు జరిపిస్తే...'

'ఆ చచ్చినవారి పేరేమిటి?'

'నాకేంతెలుసండి? నేనూ ఒక దార్ని పోయ్యేవాడ్ని.'

'అయ్యా దార్నపొయ్యే రామారావుగారూ? ఒక విషయం. మా సంఘం యెవరికైనా అంత్యక్రియలు, యిత్యాదులు, చెయ్యాలనుకుంటే వాడి వర్ణాశ్రమాలు కనుక్కొని తగురీతిగా వాడి పద్ధతిలో సత్క్రియలు జరిపిస్తాం. ఇప్పుడు చచ్చినవా డెవడో తెలీకపోతే యే పద్ధతిలో జరిపిస్తాం యివన్ని?'

'అయ్యా అతనెవరో యెవరికీ తెలీదు. అతన్ని తెలిసినవాళ్ళంటే ఇందాకా యెందు కొస్తుంది చెప్పండి.'

'అది పాయింటే. మీదాకా యెందు కొస్తుంది?'

'అయితే తమరొకపని చెయ్యండి. అన్ని అన్నిమతాలకూ, అన్నివర్ణాలకూ సరిపోయే అయ్యోర్లను పిలిపించండి, అక్కడి [illegible] ఆ మనిషిరాతాలు వివరాలు తెల్సుకోటానికి ప్రయత్నిద్దాం. అలా కనుక్కోటానికి వీలు కాకపోతే అందరిచేతా మంత్రాలు చదివించి సమస్త శాస్త్రయుక్తంగావాళ్ళ తగలేద్దాం. ఏమంటారు?'

'మా సెక్రటరీగార్నొకసారి అడిగియిప్పుడే చెప్తాను'

* * *

'రామారావుగారేనా'

'అవునండి'

'మా సెక్రట్రీ మొదట గొడవచేసినా తరువాత ఒప్పుకున్నాడండి. పత్రికా విలేఖర్లను పిలిపిద్దామనీ, దీనికి ఒకవిధమైన 'ఇంటర్నేషనల్ తగలెయ్యటం' అని పేరుపెట్టి, యిలాటి కార్యాన్ని మొట్టమొదట తలపెట్టింది మా సంఘమేనని పబ్లిసిటీ యిద్దామనికూడా అన్నాడు.'

'ఎంతసేపట్లో పని ప్రారంభిస్తారు?'

'ఇంకో రెండుగంటలయినా అవుతుందండి. మా సభ్యులు యింకా కొంతమంది అక్కడ హాజరవ్వాలి. పత్రికావిలేఖర్లు కూడా రావాలిగా. తమరుకూడా తప్పకుండా రావాలి. అయినా యీ ఇన్‌ఫర్మేషన్ యిచ్చినందుకు తమకు చాలాథాంక్స్. తప్పకుండా రావాలి సుమండీ.'

* * *

రెండుగంటల తరవాత రామారావు మెయిన్‌బజార్లో రాటికాయలప్పిడి ప్రాంతం చేరుకున్నాడు. చచ్చినోడిచుట్టూ యింకా చాలామంది జనం చేరివున్నారు. ప్రెసిడెంటుగారు కార్లో వచ్చారు. సెక్రటరీ కూడా వచ్చాడు. తమవెంట రకరకాల మతాలకి కులాలకీ పనికొచ్చే అయ్యోర్లను పిల్చుకువచ్చారు. విలేఖర్లుకూడా వచ్చాక ప్రారంభిస్తా మనుకున్నారు.' ఎవరుముందుగా మంత్రాలు చదవాలే అని కాసేపు సందేహాలూ, చిన్నచిన్న తర్జనభర్జనలు కూడా జరిగాయి. అందరూ ఒకేసారి మంత్రాలు వల్లెవేయటం అన్నిరకాలవాళ్ళూ వుండాలని తీర్మానించారు. అక్కడేవున్న ముగ్గురు సంఘం తాలూకు బోర్డుమెంబర్లూ 'ఓకే' అన్నారు.

ఇంతలో—

నమ్మలేని అద్భుతం...

వెనుకంజవేశారు చుట్టూవున్న ప్రజలు.

రెండంజలు వెనక్కువేశారు [illegible] సంఘం పెద్దలు.

శవం కదిలింది.

కళ్ళు తెరిచింది.

లేచి కూచుంది.!

చుట్టూ ఒకసారి [illegible] (లేచి)నవాడు.

లేచి కూర్చున్నాడు. రాటికాయలపిడిదిన్నె పై నారికాడు, ఊగుతూ...హాయిగా తూగుతూ....

'వీడు చావలేదండీ'

'తాగి పడున్నాడండీ. అంతే'

'అయ్యో యెంతపని జరిగింది!

'చచ్చా డనుకున్నాం. మనందర్నీ పూరికే చంపాడు.'

'అయ్యా రామారావూ, నీకో నమస్కారం. మనిషి చచ్చాడో లేదో గట్టిగా తెలుసుకోకుండానే హడావిడి చేశావేమిటయ్యా? చుట్టూ చేరినవారు యేదను

(64 వ పేజీ చూడండి)



# మెదడుకి మేత



డాక్టర్ మహీధర నళినీమోహన్



(క) బంగారు చదరంగబల్ల!

ఒక రాజుకి చదరంగం అంటే వెర్రి అభిమానం. బంగారు చదరంగబల్ల, వజ్రాలు, వైడూర్యాలూ చెక్కిన బంగం తయారు చేయించాడు. పేరుమోసిన ఆటగాళ్లని తెలిసినవాడినల్లా కోటకి పిలిపించి, ఎత్తు వేసి, తగినరీతిని బహూకరించి పంపేవాడు. ఆ రాజు తన జీవితకాలంలో నాలుగే నాలుగుసార్లు చదరంగంలో ఓడిపోయాడు. తనను ఓడించిన ఆటగాళ్ల పేర్లు బల్లకు వెనుకవైపున చెక్కించాడు. తన రాజు కట్టుబడినచోట్ల బల్లమీద నాలుగు జాతి వజ్రాలు తాపడం చేయించాడు. నలుగురికీ తలో అగ్రహారమూ దానం చేశాడు.

ఆ మహారాజు తరువాత రాజ్యానికి వచ్చిన అతడి మేనల్లుడికి చదరంగంమీద అపేక్ష ఏమీ లేదు. నిజానికి ఆ ఆట వృధాకాలహరణం అని అతడి ఊహ. తన మేనమామను అమాయకుడినిచేసి, ఆట గెలిచి, తలో అగ్రహారమూ గుంజుకున్న ఆటగాళ్లను పట్టి తెప్పించాడు.

'పృథివీపతి విష్ణువుతో సమానమని తెలిసి ఉండికూడా, రాజుని ఓడించగలమనే అహంకారంతో విర్రవీగుతున్నారు వీరు. రాజును మించిన ప్రతిభ ఏ విద్యలోనైనా సరే — ఉన్నదనుకోవడమే రాజద్రోహంగా నిర్ణయించి, అన్యాయార్జితమైన వీరి యావదాస్తినీ జప్తు చేయిస్తున్నాం' అన్నాడు. అన్నంత పనీ చేశాడు.

ఆ రాత్రి కలలో కొత్తరాజుకి విష్ణుమూర్తి కనిపించి 'ఆ ఆటగాళ్లకు అన్యాయంచేసిన పాపానికి త్వరలోనే నీ రాజ్యక్షయం అయిపోతుంది!' అని శపించాడు. రాజు కాళ్లమీదపడి వేడుకోగా ఆఖరికి కనికరించి 'వాళ్ల ఆస్తి వాళ్లకు తిరిగి ఇవ్వడమేకాదు. ఆ బంగారపు చదరంగబల్లను కూడా నాలుగు సరిసమాన భాగాలుగా కోసి వారికి ఇచ్చెయ్యి' అని తరుణోపాయం చూపించి మాయమయ్యాడు శ్రీ మహావిష్ణువు.

రాజు ఉలిక్కిపడి నిద్రలేచాడు. వెంటనే నలుగురు ఆటగాళ్లకూ జప్తు చేయించిన



ఆస్తి తిరిగి ఇచ్చేశాడు. చదరంగబల్ల దగ్గరే ఇబ్బంది వచ్చింది. దానిని నాలుగు సరిసమానభాగాలుగా చేయడం ఎల్లాగ? నాలుగు చదరపు ముక్కలుకోసి ఇద్దామనుకున్నాడు గానీ వజ్రాలు అన్నీ ఒక్కచోటికే పోతే సరిసమానం ఎల్లా అవుతుంది? ప్రతి ముక్కలోనూ ఒక్కొక్క వజ్రం ఉండేలా, సమానాకారమూ, సమాన సంఖ్యలో గళ్లూ ఉండేలా ఆ బల్లను కోయడం ఎల్లాగ?

విష్ణుమూర్తి మళ్లీ కలలో కనబడి సలహా ఇస్తాడేమోనని ఆశపడి, ఆ రాజు నిద్రపోయాడు గానీ మళ్లీ దైవదర్శనం కానేలేదు. రాజ్యక్షయ భయంలో కృశిస్తున్న అతగాడిని మీరేమైనా ఒడ్డెక్కించగలరా?

(చ) ఏ స్థలం పెద్దది?

'నాకు 200 చదరపు గజాల స్థలం ఉంది. అందులో ఇల్లు కట్టాలనుకుంటున్నా' అన్నాడొకడు.

'నా స్థలం 200 గజాల చదరం' అన్నాడు రెండోవాడు.

"అయితే రెండూ సమానమే నన్నమాట!" అన్నాడు మొదటివాడు

మీరేమంటారు? రెండు స్థలాలూ సమానమైనవేనా?

జవాబులు

(క)

ఈ బొమ్మలో చూపినట్లుగా చదరంగబల్లను నాలుగు సరిసమాన భాగాలుగా



విభజించవచ్చు. స్పష్టంగా తెలియడానికి రెండుభాగాలకు నల్లని రంగు పూశాము.

(చ) రెండూ సమానం కాదు. మొదటి ఆసామీ స్థల వైశాల్యం 200 చదరపు గజాలు మాత్రమే. అది ఏ ఆకారంలో ఉందో మనకు తెలియదు. మాటవరసకు ఇక్కడి బొమ్మలో చూపినట్లు వంకర




(64వ పేజీ చూడండి)



# నా విదేశయాత్ర

జమునారమణారావు

(గత సంచిక తరువాయి)

ఉదయం అయిదింటికే తయారయి టాక్సీలో ఎయిర్‌పోర్ట్ చేరాం. అక్కడ దిగగానే గుమ్మడిగారి పాస్‌పోర్ట్ హోటల్ రూమ్‌లో మరచిపోయినట్టు – జ్ఞాపకం వచ్చిందని చెప్పారు. వెంటనే అదే టాక్సీని వెనక్కి పంపి తెప్పించుకున్నాం. ఏడూ నలభై అయిదుకి ప్లేన్ బయలుదేరింది. ఫ్రాంక్‌ఫర్ట్ చేరుకున్నాం. చాలా దూరంగా ప్లేన్ ఆగటంవల్ల బస్‌లో ఎయిర్‌పోర్ట్ దాకా వెళ్ళాం. నేను, గుమ్మడిగారు ముందుదిగి మళ్ళీ [illegible]కి వెళ్ళాం. మధుగారు [illegible]టికి వెళ్ళిపోయారు. వెనక వస్తా[illegible]ని చాలాసేపు కాచుకు కూచున్నాం. మా టిక్కెట్స్ ఫ్లైట్‌కి ఎండార్స్ చేయించుకుని మరో పదిహేను నిమిషాలు చూశాం. రాలేదు. నన్ను అక్కడే కూచోమని గుమ్మడిగారు అనౌన్సు చేయించడానికి వెళ్ళారు. ఆయన అటు వెళ్ళగానే మధు వచ్చారు. ప్లేన్ టైము అవుతావుంది. 'ఆ వెళ్ళి గుమ్మడిగార్ని తీసుకురండి' అంటూ బయలు[illegible]రారు. 'మీరలా వెళ్ళగానే, ఆయ[illegible]. ఒకర్నొకరు వెతుక్కోవ[illegible] టైము సరిపోతుంది కనుక వీరారు [illegible] తర్వాత పదినిమిషాలకు [illegible] వచ్చారు. అందరం అనౌన్స్[illegible]కోసం ఎదురు చూస్తున్నాం. పావు [illegible] పిలుపు రాలేదు. అనుమానం వచ్చి [illegible] అడిగితే—అది ఎప్పుడో [illegible]. మేం ఒకర్నొకరం [illegible] అనౌన్స్‌మెంట్ [illegible] వినలేదు. [illegible] మధ్యాహ్నం

దిగిన సామాన్లు అక్కడే వుంచి, బయటికి వెళ్ళి సిటీ చూసుకొని మళ్ళీ తిరిగి ఆరింటికి 'రోమ్'కి మరో ప్లేన్‌లో వెళ్ళిపోదామని ప్లాన్ వేశాం.

ప్లాన్ అంతా చెడిపోయింది. మరి యిప్పుడేం చేయాలని వారినే అడిగాం. మరో పది నిమిషాల్లో 'రోమ్' వెళ్ళే ప్లేన్‌లో వచ్చాం. మా సామాను జూరిచ్ వెళ్ళిపోయింది. మేం పన్నెండింటికి రోమ్‌నగరం చేరాం. అక్కడి ఫార్మాలిటీస్ ముగించుకుని, మా సామాను ఎవరు వెనక్కి పంపేదీ తెలుసుకుని బస్‌లో హోటల్ చేరుకునే సరికి రెండయింది.

పురాతనమయిన కట్టడాలు—ఆకాశాన్ని అంటుతూ రోమన్ చరిత్రలోని అద్భుతమయిన అంశాలను గుర్తుచేస్తూ వుంటాయి. కాని, ఇరుకుసందులు ఎక్కువ. విశాలమయిన రోడ్లు ఎక్కువగా కనిపించవు. దారిలోనే అక్కడక్కడ శిథిలమయిన చారిత్రక కట్టడాలు కనిపిస్తూ వుంటాయి. అవి చూస్తుంటే — రోమన్ ప్రభువుల ప్రతిభ, కళాప్రియత్వం — జగదేకసుందరి క్లియోపాత్రా, సీజర్ మొదలయిన వారి చరిత్ర అంతా జ్ఞాపకంవచ్చి కళ్ళముందు నిలుస్తుంది.

ఆ దేశంలో ప్రతి అంగుళానికీ కార్లు కనిపిస్తాయి. అన్నీ 'బిగ్ సియాట్స్', ఫియట్ లాంటి చిన్నవాళ్ళే. [illegible] చూస్తుంటే, [illegible] [illegible] [illegible] దుకు ముచ్చటగా [illegible]. ఎయిర్‌పోర్ట్ దారికి [illegible]. ఎయిర్ టర్మినల్ వద్ద దిగి, అక్కణ్ణించి టాక్సీలో హోటల్‌కి వెళ్ళాం. గదులకు చేరి మొహాలు కడుక్కుని రెండింటికి డైనింగ్‌హాలుకి నడిచాం, భోజనానికి. 'ఇక అండిపెట్టం. అయిపోయింది' అన్నారు. ఆకలి దహించుకుపోతున్నది, ఉదయం బ్రేక్‌ఫాస్ట్ కూడా లేదు. కనీసం బ్రెడ్ ముక్కలయినా యివ్వమని అడిగాం. ఆ బ్రెడ్‌ముక్కలు ఎండిపోయి గట్టిగా వున్నాయి. తినలేక తిని మంచినీళ్ళు తాగి ఒకగంట రెస్ట్ తీసుకున్నాం. మా బాక్స్‌లకోసం తిరిగి ఎయిర్‌పోర్ట్ చేరి— మా సామాన్లు మేమే దేవుడా అంటూ మోసుకుని బస్సుదగ్గరికి తెచ్చుకుని బయలుదేరాం. ఏడింటికి హోటల్ చేరాం.

'రోమ్‌బైనైట్' అని తొమ్మిదింటికి టూరిస్ట్ బస్‌లో టికెట్స్ కొని, రూమ్స్‌కి వచ్చాం. డైనింగ్‌హాల్‌కి వెళ్ళి రొట్టె ముక్కలు, సూపు మొదలయినవన్నీ తిని సిద్ధమయ్యాం. ఆ రోజంతా సుఖభోజనం లేదు. బస్సులో బయలుదేరాం. పొద్దుటి నుంచి ఆ బస్సులోనే తిరగటంవల్ల ఒకటే నిద్ర ముంచుకొస్తూంది నాకు. అయినా అలాగే నిగ్రహించుకుంటూ అన్నీ చూస్తున్నా. చాలా ఎత్తులో కట్టబడిన 'కాస్టల్ సెయింట్ ఏంజెలో' అనే కోటని బస్సు ఆపి చూపించారు. ఆ రాత్రిలో లైట్స్‌తో అలంకరించబడ్డ ఆ కోట ఎంతో గొప్పగా కనిపించింది. అంతేకాక ఇక్కడి ప్రతి చారిత్రాత్మక స్థలాన్నీ, చక్కని డిమ్ లైట్స్‌తో అలంకరించి వుంచుతారు. 'బాత్స్ ఆఫ్ కరకల్లా', 'ఆర్చ్ [illegible] కొలోజియమ్' మొదలయిన ప్రదే[illegible]

# నా విదేశయాత్ర

ఆపి, దిగి మాకు అర్థం అయ్యేట్లు చక్కగా చెప్పింది గైడ్.

పదకొండింటికి 'ట్రెవి ఫౌంటెయిన్' దగ్గరదింపి దాన్లో అందర్నీ కాయిన్స్ వెయ్యమన్నారు. ఆ ఫౌంటెయిన్, పాలరాతి విగ్రహాలు. సింహాలు, వీరులు మున్నగు వాటితో అందంగా తీర్చిదిద్దబడివుంది. సింహాల నోట్లోంచి నీరు బయటికి ప్రవహిస్తూ వుంటుంది. మనం ఏదైనా మనసులో తలచుకుని దాన్లో కాయిన్ వేస్తే అది నెరవేరుతుందని వారు చెబుతారు. సరే, నేనూ అలాగే మనసులో అనుకుని కళ్లు మూసుకుని కాయిన్ వేశాను. పక్కనే వున్న మనవాళ్లు— 'ఏమ్మా! నిజంగా నువ్వు మనసులో ఏమని కోరుకున్నావు?' అని అడిగారు. 'నేను చెప్పను. పొండి!' అన్నాను. 'అయితే నేను చెబుతాను!' అన్నారు గుమ్మడిగారు. 'ఏమిటో చెప్పండి అన్నాను.' నేను కోరుకున్నట్లుగా మంచిభర్త లభించారు. అంతకంటే మంచి గుమ్మడిపండువంటి కొడుకు కావాలి అని కోరుకున్నావు, అవునా?' అన్నారు—నా మనసులోమాట వీళ్లు ఎలా గ్రహించారా అని ఆశ్చర్య పోయాను. పరుగెత్తుకొచ్చి మాకోసం నించున్న బస్సులో ఎక్కి కూచున్నాను.

పన్నెండింటికి ఒక నైట్‌క్లబ్‌కి తీసుకు వెళ్లారు. పారిస్ క్లబ్‌సంగతి 'చెప్పిం దగ్గర్నుంచీ నాకు చూడాలనిపించింది. మా బస్సువాళ్లు సైట్ సీయింగ్‌తోపాటు రెండుక్లబ్‌లు చూపిస్తారుట! మమ్మల్ని క్లబ్‌లోకి తీసుకువెళ్ళారు. గుడ్డిదీపాల వెలుగులో ప్రతి టేబుల్‌దగ్గరా నలుగు రయిదుగురు ఆడ, మగ కూచుని డ్రింక్స్ తీసుకుంటూ—అక్కడే వున్న చిన్నస్టేజిపై ఆర్కెస్ట్రావారి సంగీతం వింటున్నారు. నైట్‌క్లబ్స్‌కి వెళితే డ్రింక్ తప్పనిసరిగా తీసుకోవాలంటారు చాలామంది. కాని, నేను తీసుకోలేదు. కోకోకోలా, ఆరెంజ్‌జ్యూస్ కూడ తీసుకోవచ్చని తెలిసింది. వారందరితో నేనూ పెద్దస్టైయిల్‌గా జ్యూస్‌ని ఆ వైన్ కప్పులో వేసి యివ్వగా కొద్దికొద్దిగా సిప్ చేస్తూ కూచున్నా. అరగంట దాటినా సంగీతంతప్ప ఏం లేదు. నాకు విసు గెత్తింది. ఈలోగా మా గైడ్‌వచ్చి మరో క్లబ్‌కి వెళుతున్నాం అని మమ్మల్ని తీసుకు పోయింది.

ఆ రాబోయేక్లబ్ చాలా బాగుంటుందని వూహించుకున్నాను. అది గుహలావుంది. ఎన్నోమెట్లు దిగి లోపలికి వెళ్లాలి. దారి పొడుగునా విరిగిపోయిన గోడలు, రోమన్ ప్రభువుల కాలంనాటి విరిగిన పాత్రలూ అవీ అలాగే వున్నాయి. అది ఒక శిథిల భవనం. దానిలోపల నైట్‌క్లబ్ నడుపు తున్నారు. లోపలికివెళ్లి కూచున్నాం. ఆడ వాళ్లు రకరకాల దుస్తులతో వచ్చి నృత్యాలు చేశారు. పెద్దకళాత్మకంగా లేక పోయినా నేను అనుకున్నంత అసభ్యంగా లేదు. అక్కడ ఓ గంటసేపున్నాక, రెండింటికి మమ్మల్ని మా హోటల్ దగ్గర దింపి వెళ్లారు.

మర్నాడు పదింటికి టాక్సీలో బయలు దేరాం. ముందు వాటికన్ సిటీకి వెళ్లాం. వంద ఎకరాల స్థలంలో నిర్మించబడిన ఒక చిన్న పట్టణం. పట్టణం మధ్య విశాలమైన మైదానంలో ప్రపంచంలోకల్లా పెద్దదయిన 'చర్చ్' నిర్మించబడింది. అది మత సంబంధ మయిన పవిత్ర స్థలం. అక్కడే వున్న మరో భవనంలో పోప్ నివాసం. ఆకాశాన్ని చుంబించే చర్చి టవర్, చర్చిని ఆనుకుని చక్రాకారంలో నిర్మించబడిన స్తంభాలు, మధ్యలో విశాలమయిన ఖాళీ స్థలం— అద్భుతంగా వుంటుంది. చర్చి లోపలికి వెళ్లి చూశాము. పాలరాతితో నిర్మించబడ్డ ఏసు ప్రభువు నిర్మలంగా చిరునవ్వుతో కనిపిస్తాడు. అక్కడక్కడ మరణించిన మత గురువుల శరీరాలు భద్రపరుచబడి వున్నవి. మత ప్రచార గాథల్ని తైలవర్ణ చిత్రాలలో, రంగు రంగుల గాజు ముక్కల అమరికతో, పాలరాతి శిల్పాలతో నిర్మించబడి వున్నదా మందిరం.

ఆ విశాలమయిన చర్చిలో పదివేలమంది ఒకేసారి ప్రార్థన చేసుకోవచ్చు. మనం లోప లికి అడుగు పెడుతూంటే, అక్కడివారు చిన్న టేప్‌రికార్డర్ అద్దెకు యిస్తారు. అంటే మనకు గైడ్ అవసరం లేకుండా, ఆ టేప్ రికార్డర్ ఆన్ చేస్తే—మనం చూసే స్థలంపు దాని వివరాలు, చరిత్ర

అంతా అదే చెబుతుంది. దాన్నిబట్టి మనకి కావలసిన వివరాలు తెలుసుకోవచ్చు. అక్కడికి సమీపాన గల షాపులో, రోమ్‌లో ప్రసిద్ధిగన్న శిల్పాల మినియేచర్ సైజు బొమ్మలు కొని, అక్కడ కూడ కొన్ని ఫోటోలు తీసుకుని ముందుకి సాగాం.

అక్కణ్ణించి శిల్పచాతుర్యానికి వాసికెక్కిన 'బోర్‌ఘాస్ మ్యూజియం'కు వెళ్ళాం. లోపలికి వెళుతుండగా మా కుడివేపున టెలివిజన్‌లో మా ప్రతిబింబాలు కనిపించాయి. ప్రవేశించే మార్గంలో కొంత వరకూ మన కదలికలు ఆ టెలివిజన్‌లో కనిపించడం జరుగుతుంది. చిత్ర విచిత్రమైన శిల్ప సంపదతో నిండి వుంది ఆ మ్యూజియమ్. అన్నీ పలు రకాల పాలరాతి విగ్రహాలే!...అప్పటికే లంచ్ టైమ్ కావటం వల్ల మేం హోటల్ చేరుకుని లంచ్ తీసుకుని ఎయిర్‌పోర్ట్‌కు బయలుదేరాం.

మా ప్రయాణానికి ఆఖరు పట్టణంగా 'బీరూట్' నిర్ణయించబడ్డది. ఆవాళ రాత్రి ఏడున్నర, ఎనిమిది గంటల మధ్య బీరూట్ చేరాము. ఒక్క రోజు కనుక 'వీసా' అక్కరలేదనుకొని తీసుకోలేదు. ఎయిర్‌పోర్ట్ కస్టమ్స్‌లోకి వెళ్ళగానే 'వీసా' కావాలన్నారు. ఇక్కడ మా మద్రాసు మిత్రులు మళ్ళీ కలిశారు. తిరిగి ఒక గంటసేపు వీసా కోసం కస్టమ్స్‌లో కూచున్నాం. ఫార్మాలిటీస్ అన్నీ ముగించుకొని బయట పడేసరికి వూళ్ళోకి వెళ్ళే బస్సు వెళ్ళిపోయింది. బస్సు లేకపోయినా వారు మమ్మల్ని వాళ్ళ వేన్‌లో వూళ్ళో దింపే ఏర్పాటు చేశారు.

మేము ఎయిర్‌పోర్ట్‌లో అడుగు పెట్టిన దగ్గర్నుంచీ ఒక వ్యక్తి నా వంక వూరికే 'స్టేర్' చేసి చూడసాగాడు. 'మన అమ్మాయికేసి అలా చూస్తున్నాడేమిటి, ఎత్తుకుపోడు గదా?...అమ్మాయి జాగ్రత్త' అని జోక్ చేశారు, గుమ్మడిగారు. మాతో వున్న మిత్రులు 'ఆయన అలా చూసేందుకు కారణం వుంది. బహుశా సి. ఐ. డి. అయి ఉండచ్చు. ఇక్కడ చక్కని అమ్మాయిల్ని స్మగుల్ చేస్తారు. కొన్ని కొన్ని దేశాలనుంచి అందమైన అమ్మాయిల్ని తెచ్చి బానిసలుగా అరబ్బీలకు అమ్మివేస్తారు. అనుమానం కొద్దీ అలా చూస్తున్నాడు.' అని చెప్పారు.

'అమ్మ బాబోయ్! అయితే మన అమ్మాయిని, జాగ్రత్తగా కాపాడి, రమణారావుగార్కి అప్పచెప్పాల్సిన బాధ్యత మనదే.' అన్నారు గుమ్మడిగారు. అందరం సరదాగా నవ్వుకుంటూ వేన్‌లో సిటీకి బయలుదేరాము.

బీరూట్ చిన్న పట్టణమే అయినా, చాలా అందమైనదీ, భాగ్యవంతమైనదీను. బొంబాయికీ, బీరూట్‌కీ పోలికలు కనిపిస్తాయి. సముద్రతీరాన నిర్మించబడ్డ రిచ్ సిటీ. ఈ పట్టణం 120 మైళ్ళ పొడవూ, 50 మైళ్ళ వెడల్పూ కలిగి వుందిట! బీరూట్‌కు దగ్గరలోనే అరేబియా ఎడారి ప్రారంభం అవుతుందిట! యాత్రికులకు సైట్ సీయింగ్ టూర్‌లో దాన్నికూడా చూపిస్తారుట. మేము హోటల్‌కు తొమ్మిదింటికి చేరాము. డైనింగ్ హాల్లోకి

వెళ్లాం. రైస్ దొరకలేదు. ముందుగా చెబితేగాని చేయరుట! పళావులకు ప్రసిద్ధిట. ఆ పూట రొట్టెలతో కడుపు నింపు కున్నాం.

ఆ మర్నాడు పదిగంటలకి టాక్సీలో



# నా విదేశయాత్ర

పూరు—పూళ్లోని వింతలు, విశేషాలు చూసేందుకు బయలుదేరాం. ఆ పట్టణానికి 20 మైళ్ల దూరంలో నాలుగు దిశల్లోను నాలుగు ముఖ్యమైన చూడదగిన ప్రదేశా లున్నవి, మాకు వున్న కొద్ది టైమ్‌లోనూ నాలుగూ చూడలేము కనుక—ఒకదిశకు మాత్రం వెళ్లేందుకు నిశ్చయించుకున్నాం. సముద్రపుటంచున విశాలమయిన బాటలో మా కారు దూసుకుపోతూవుంది. అక్కడి వాతావరణం ఎంతో బాగుంది. మరీ అంత చలీలేదు; ఎండాలేదు. మామూలు స్వెట్టర్స్‌తోనే వుండవచ్చు. రోజులు మారాయి కనుక, ఆ దేశంలోనూ పాశ్చాత్య పద్ధతులు కనిపించాయి. వారి సాంప్రదాయ సిద్ధమయిన ఉడుపుల్లో బహు కొద్దిమంది మాత్రమే కనిపిస్తారు. అక్కడి స్త్రీలు ఎంతో అందంగా వున్నారు. తీర్చిదిద్దిన ట్లుండే ముక్కు, కనులు, పెదవులు, చక్కని రోజారంగు శరీరంతో చూడ ముచ్చటగా వున్నారు.

మా కారు ఒక కొండపైకి మెలికలు తిరిగిన బాటమీదుగా వెళ్లసాగింది. అంత ఎత్తునుంచి సముద్రతీరాన వున్న ఆపట్టణం ఎంతో రమ్యంగా కనిపిస్తున్నది. కొన్ని మైళ్లు వెళ్లాక మా కారు ఒక కొండ గుహదగ్గర ఆగింది. డ్రైవర్‌వెళ్లి టికెట్స్ కొని తెచ్చాడు. అక్కడవుండే గైడ్ మమ్మల్ని కొండగుహలోకి తీసుకుపోసాగాడు. రెండుమెట్లు దిగగానే గాఢాంధకారం. ఏమీ కనిపించటంలేదు. గైడ్ పైకివచ్చి లైట్ స్విచ్ వేశాడు. ఆ గుహఅంతా కాంతివంత మయింది. అలా కొంతదూరం మెట్లుదిగి వెళ్లాక, ఒకచోట మెట్లు ఆగిపోయి—ఒక ప్రవాహం గలగల శబ్దించేస్తూ ప్రవహిస్తూ కనిపించింది. అందులో కొన్ని బోట్లు—వాటిలో మనుషులూ వున్నారు. గైడ్ మమ్మల్ని బోట్లో ఎక్కించుకుని బయలుదేరాడు.

బోటు మెల్లగా సాగుతున్నది. వాతావరణం ప్రశాంతంగా వుంది. ఆ నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ నీటి ప్రవాహపు గలగల—చెప్ప నలవికాని ఆనందం కలిగిస్తున్నదా ప్రకృతి. మా శ్రీవారుకూడా చూస్తే 'ఎంత బాగుండేది?' అనిపించింది. అదే పైకి అనేశాను. 'అవునమ్మా! ఇటువంటిచోట మనవాళ్లు జ్ఞాపకం రావటం సహజం. అయ్యో, వాళ్లు చూడలేక పోయారే అనే బాధ కలుగుతుంద'ని గుమ్మడిగా అన్నారు.

కొంత దూరం వెళ్ళగానే గుహలో ఒక విచిత్రం చూస్తాం. ప్రకృతి సిద్ధంగా ఏర్పడిన 'స్టాలెక్టైట్స్' కనిపిస్తాయి. స్టాలెక్టైట్స్ అంటే గుహ పై భాగంనుండి, కిందిభాగంనుండి మర్రి వూడల్లా, కొండ రాళ్లు వేలాడుతూ ఉంటవి. ఇవి కొన్ని చాలా సన్నగా, మరి కొన్ని శిల్పి చెక్కిన స్తంభాలుగా, బంగారు—గోధుమ రంగుల కలయికతో వుంటవి. ఆ స్తంభాల పై నుంచి కొన్నిచోట్ల సన్నటి నీటి ధారలు పడుతూ విచిత్రంగా కనిపిస్తాయి.

బోటు వెళుతున్న ప్రవాహం కొన్ని చోట్ల విశాలంగాను, ఇంకొన్నిచోట్ల చాలా సన్నగాను, మరికొన్నిచోట్ల చాలా లోతుగాను; కొన్నిచోట్ల అడుగునవుండే రాయితో సహా కనిపిస్తూ పరిశుద్ధమయిన నీరు ప్రవహిస్తూ వుంటుంది. ఆ నీళ్లు దోసిట తీసుకుని తాగాము. తీయగా వున్నాయి. ఆ ప్రవాహం అలా కొన్ని మైళ్ళ పొడవు వుందిట. మేం ఒక మైలు దూరం వెళ్లాం. ప్రకృతి సిద్ధంగా ఏర్పడిన ఆ అందమయిన స్తంభాలకు దీపాలంకరణ మరింత అందాన్ని కూర్చిపెట్టింది. మరి కొన్ని స్తంభాలు వివిధరకాల జంతువుల ఆకృతులలో ఏర్పడ్డాయి.

అక్కణ్ణించి తిరిగిరావటానికి మనసు యిష్టపడలేదు. అక్కడేవుండిపోతే బాగుం టుందనిపించింది. భగవంతుని సృష్టి ఎంత విచిత్రం? ఆ అద్భుతమయిన ప్రకృతి అందాలనుచూస్తూ మళ్లీ బోట్‌లో వెనక్కి మళ్లాము. కార్లో కొండ కిందకివచ్చి దారోసేవున్న ఒక ఆఫీసువద్ద ఆగాం. అది 'రోప్‌వే' టికెట్స్ అమ్మే కార్యాలయం. టికెట్స్‌కొని 'రోప్‌వే'లో కొండ పైకి బయలుదేరాం. నలుగురు మనుషులు కూచునే చిన్న గాజుతొట్టి బలమైన యినప తీగెలద్వారా కొండపైకీ—కిందికీ దిగుతూవుంటుంది. పైకివెళ్లే పెట్టె—ఒక తీగెలో—కిందికి వెళ్లేపెట్టె మరో తీగెలో ప్రతినిముషం తిరుగుతూవుంటవి.

(ఇంకావుంది)

# బ్లూ సీల్

## టాల్కం

### శరీర దుర్గంధనివారిణి అయిన, హెక్సాక్లోరోఫీన్‌తో కూడినది

బ్లూ సీల్ టాల్కం సాధారణమైన శరీర దుర్గంధ నివారణులు ఇవ్వలేని రక్షణను యిచ్చే ప్రత్యేకమైన శరీర దుర్గంధ నివారిణి అయిన హెక్సాక్లోరోఫీన్‌తో కూడియున్నది. సుగంధపూరితమైన బ్లూ సీల్ టాల్కంను ప్రతిరోజూ ఒంటిమీద జల్లుకోండి ... అది అతి చక్కని కొలోనవలె తాజా హాయి నిస్తుంది. మృదువుగా, హాయిగా వుంటూ చర్మమునకు రక్షణయిచ్చి కాపాడుతుంది.

### హెక్సాక్లోరోఫీన్ అంటే యేమిటి:

మన దేశమువంటి ఉష్ణాధిక్యతగల దేశాల్లో చెమటకు సంబంధించిన సమస్యలు అతి కఠినమైనవి. చెమట పట్టడేటం చర్మముపైన సూక్ష్మజీవులు కలిగించే దుర్గంధమునకు దారి తీస్తుంది. బ్లూ సీల్ టాల్కం జల్లుకొంటే అది చర్మాన్ని సూక్ష్మజీవులనుంచీ చెడ్డ వాసనలనుంచీ కాపాడుతుంది — దీనికి కారణం బ్లూ సీల్ టాల్కం హెక్సాక్లోరోఫీన్‌తో కూడి ఉండడం. హెక్సాక్లోరోఫీన్ ప్రపంచమంతటా అంగీకరింపబడిన శరీర దుర్గంధ నివారిణి.

— తాజా హాయి
గొల్పుతూ
రక్షణయిచ్చే టాల్కం

బ్లూ సీల్ టాల్కం మీడియం,
ఫ్యామిలీ సైజుల డబ్బాలలో దొరుకుతుంది.

చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్
(పరిమితమైన బాధ్యతతో
యు. ఎస్. ఎ.లో స్థాపితము)

WPT 4369



# లతామంగేష్కర్

హిమాలయాల నుంచి కన్యాకుమారి వరకూ లక్షలాది భారతీయ ప్రజాహృదయాలలో నిలిచిపోయింది లతామంగేష్కర్. నిలిచిపోయింది ఆమె స్వరూపంకాదు; ఆమె గొంతు. ఆ గొంతులో స్వచ్ఛత, మాధుర్యం, చక్కని స్థాయి, మృదుత్వం నిండి ఉంది. ఆ గొంతు పలుకని స్వరములేదు, విని విసానుభూతి పొందని వారూ లేరు. తన అసమాన గాన ప్రవాహంలో అశేష ప్రజావాహినిని అనునిత్యమూ ఆనందపరవశుల్ని చేస్తున్నది, లతామంగేష్కర్. ఆమె పాటల కోసం ఒక చిత్రాన్ని పదే పదే చూసేవాళ్ళున్నారు. నేటి మన నేపథ్యగాయనీ గాయకులు అనేకమందికి ఆమె మార్గదర్శకురాలయినది. తన అనన్య సామాన్యమయిన సుస్వరంతో 'లతా' అంత సుపరిచిత లయింది. ఆమె గొంతుకు వయసులేదు. వృద్ధాప్యం రాదు. చిరంజీవత్వంతో కొత్త మెరుగులు దిద్దుకొంటూ నిత్యనూతనత్వాన్ని సంతరించుకొంటున్నది. 37 ఏళ్ళ వయసుగల కుమారి లతా మంగేష్కర్ నేపథ్య సంగీత జీవితం ప్రారంభించి పాతిక సంవత్సరాలయింది.

* * *

ఈ నాడు విశేషమయిన పేరుప్రఖ్యాతులను, ఐశ్వర్యాన్ని గడిస్తున్న కుమారి లతా ఎంతో కష్టపడి స్వశక్తిమీద పైకి వచ్చింది. ఆమె లేత ప్రాయంలో ఎన్నో ఇడుములనుభవించింది. లతా తండ్రి దీనానాథ్ మంగేష్కర్ మరాఠీ నాటకరంగంలో ఉన్నత స్థితిని అందుకున్న వ్యక్తి. అంతేకాదు, ఆయన సుప్రసిద్ధ సంగీత విద్వాంసుడు. ఆయన వద్దనే సంగీతంలో శిక్షణ పొంది, తన కంఠ స్వరంలో మధురిమను నింపుకున్నది. సంగీత సాధనచేస్తూ, పాడుతూ, మంచిపేరు తెచ్చుకుంటున్న చిరుత ప్రాయంలోనే ఆమె పన్నెండవ ఏట తండ్రి దీనానాథ్ మరణించారు. తండ్రి మరణంతో ఆమెకు కష్టాల పరంపర ఏర్పడ్డది. దీనానాథ్ వెనకేసింది ఏమీలేదు. తల్లినీ, చెల్లెళ్ళనీ, తమ్ముణ్ణీ పోషించే భారం లతా భుజస్కంధాలపై మోపబడ్డది. కుటుంబపోషణ కోసం ఏదేనా ఉద్యోగం చూడాలిగామరి! తిరిగిన స్టూడియో తిరక్కుండా తిరిగింది. ఒక్కోసారి సైకిలు అద్దెకు తీసుకుని ఉద్యోగం కోసం బొంబాయి చౌపాటీలో గల జ్యోతి స్టూడియో నుంచి మలాడ్‌లో గల బాంబేటాకీస్ స్టూడియో వరకూ—అంటే సుమారు నలభై మైళ్ల దూరం చుట్టి వస్తూండేదిట. కొన్ని సమయాలలో భోజనం కూడా లేకుండా తిరిగిందిట.

తండ్రి పోయిన రెండు మాసాలకు ఎట్లాగేలకు ఉద్యోగం చేపట్టింది. 'కితీ హసల్' అనే మరాఠీ చిత్రంలో నటించటానికీ, పాడటానికీ అతి స్వల్పవేతనం మీద కుదిరింది లతా. ఆమె మొట్టమొదట పాడిన చిత్రం యిదే. ఆ తర్వాత ప్రసిద్ధ దర్శక నిర్మాత మాస్టర్ వినాయక్ కంపెనీలో నటించటానికీ, పాడటానికీ ఒప్పందం జరిగింది. ఆయన నిర్మించిన కొన్ని మరాఠీ చిత్రాలలో లతా పాటలు పాడటంతోపాటు నటించింది కూడా. హిందీ చిత్రాలలో ఆమె మొదటిగా పాడింది "ఆప్‌కి సేవామే" చిత్రంలో. వసంత్ జోగ్లేకర్ నిర్మించారు.



సప్తస్వర సుందరి లతామంగేష్కర్

అక్కడి నుంచి నటజీవితానికి స్వస్తిచెప్పి నేపథ్యగాయనిగా జీవితం ఆరంభించింది. ఈ చిత్రం 1946లో నిర్మింపబడ్డది. లతాకు నేపథ్యగాయనిగా మంచి పేరు ఆర్జించి పెట్టిన చిత్రం 'మజ్‌బూర్'. భారతీయ చిత్రాలలో పంజాబీ సంగీతాన్ని ప్రవేశపెట్టిన శ్రీ గులాం హైదర్ యీ చిత్రానికి సంగీత దర్శకుడు. ఆయన లతా చేత పాడించిన 'దానేకీ కోయీబాత్‌నహీ' అనేపాట—ఆమె భవిష్యజ్జీవితానికి ఎంతగానో తోడ్పడింది. ఆ పాట నేపథ్యగాయనిగా లతా ఉన్నత శిఖరాధిరోహణకు బాట ఏర్పరిచింది.

నాటినుంచి నేటిదాకా లతా పాడిన వేలకొద్దీ పాటలు ప్రజాదరణ పొందినవి. లతా చెల్లెళ్ళలో ఆశా, ఉషాలు కూడా నేపథ్యగాయనీమణులుగా పేరు పొందారు. ఆశా—ఆశాభోన్స్లేగా సుపరిచితురాలు. లతా తమ్ముని పేరు హృదయనాథ్, ఆయనా సంగీతంలో నిష్ణాతుడు. వారి కుటుంబం అంతా సంగీత ప్రపంతులుగా రూపొందారు.

ఫొటోగ్రఫీ లతా హాబీలలో ఒకటి. మరొక హాబీ ఏమిటంటే ఇతరభాషలను నేర్చుకొనటం. ఇప్పుడామెకు తమిళం వ్రాయనూ, చదువనూ వచ్చునుట! క్రికెట్ అంటే లతాకు ఎంతో యిష్టం. ఆమె బొంబాయి మదరాసులలో ఎక్కడవున్నా—ఆ సమయాన క్రికెట్ మాచ్ జరుగుతూవుంటె అక్కడికి తప్పకుండా హాజరవుతుంది. తండ్రి బతికివున్న రోజులనుంచి ఆమెకీ సరదావుంది.

ఇక లతా స్వభావాన్నిగురించి చెప్పాలంటే వలసివస్తే ఎంతో ఉదార స్వభావంగల మహిళ అంటారు ఆమెను ఎరిగినవారు. అందరితోనూ సహకరిస్తూ పనిచేస్తుందంటారు. ఇవాళ ఎంతో పైకివచ్చిన సంగీతదర్శకుల జంటలు; కళ్యాణ్‌జీ—ఆనంద్‌జీ, లక్ష్మీకాంత్—ప్యారేలాల్,

దీనికి — ఓమిలు లతా సహకారం లేకపోతే యింతటి స్థితిలోకి రాగలిగేవారు కాదని తెలిసిన వాళ్ళు చెబుతారు.

*　　*　　*

అసమాన గాన సుధాలహరితో గడచిన పాతికేళ్ళుగా ఫిలిం ప్రపంచానికీ, ప్రేక్షక లోకానికీ గణనీయమైన సేవచేసిన కుమారి లతా మంగేష్కర్‌కి — బొంబాయిలోని రంగభవన్‌లో ఏప్రిల్ 25న ఘనంగా సన్మానం జరిగింది. ఈ రజతోత్సవ సన్మానసభను లతా మంగేష్కర్ సత్కారసమితి వారు ఏర్పరిచారు.

మద్రాసునుంచి యీ ఉత్సవానికి సంగీత దర్శకుడు కె. వి. మహదేవన్, నేపథ్య గాయనీగాయకులు యస్. జానకి, పి. బి. శ్రీనివాస్ వెళ్ళారు. దక్షిణాది కళాకారుల తరఫున శ్రీ పి. బి. శ్రీనివాస్, లతాకు 'సప్తస్వరసుందరి' అనే బిరుదునిచ్చి, అభినందనపత్రం సమర్పించారు. శ్రీమతి జానకి వెండి పూలసజ్జ బహూకరించారు. మహదేవన్ షీల్డు యిచ్చారు. ఈ రజతోత్సవ సభకు డా. సి. డి. దేశ్‌ముఖ్ అధ్యక్షత వహించారనీ — దిలీప్‌కుమార్ తమ ప్రసంగంలో 'లతా'కు రాష్ట్రస్థాయిలో గౌరవం జరగాలని సూచించారనీ — పి. బి. శ్రీనివాస్ చెప్పారు. అంతకుముందు రోజు రాత్రి లతా తండ్రి దీనానాథ్ స్మారకదినం జరిపారుట. ఆనాడు ఉస్తాద్ జాఫర్‌ఖాన్ సితారు వాయించారనీ, భీమ్‌సేన్‌జోషీ గాత్రం పాడారనీ తెలిసింది.

*　　*　　*

25 వ తేదీనే 25 ఏళ్ల పండుగ రావడం గమనించదగ్గ సంగతి. ఇలా కలిసిరావు సాధారణంగా, వచ్చినా చాలా అరుదుగా వస్తూ ఉంటవి. ఇలాటి ఘటన గానసుధా లహరి లతా జీవితంలో దొరలిపోయింది. అదృష్టవంతురాలు! ఆమెలో అణువణువునా సంగీతం ప్రవహిస్తున్నది. మిత్రులొకరు చెప్పినట్లు — లతా తన గానమాధుర్యంతో రోగుల్ని ఆరోగ్యవంతుల్ని చేస్తున్నది. ఆ గానంలో అంతటి తన్మయత వుంది. ఇలాంటిది ఎంతమందికి సాధ్యం అవుతుంది?

— మోహన్ కుమార్



# ఎందుకు?

పద్మనాభం

కొందరు నటీమణులు వివాహం అయినతర్వాత సినిమాలలో నటించరు, ఎందుకు?

ఎల్లూరి విశ్వనాథరెడ్డి ([illegible])

వాస్తవిక జీవితంలో నటించవలసింది చాల వుంది కాబట్టి.

ప్రతిమనిషి పుట్టగానే ఏడుస్తాడెందుకు? పుట్టగానే ఒక్కరైనా నవ్వరెందుకు?

యస్. వి. బి. పి. చంద్రశేఖరరావు (కొత్తపల్లి)



ఏడ్వడం సులభం, నవ్వడమే కష్టం. అంతరార్థం చాలావుంది 'తెలుసుకోండయ్యా బాబూ తెలుసుకోండయ్యా.'

మీరు మా ప్రశ్నలకు సమాధానాలు ఎందుకిస్తున్నట్టు?

పాలకోడేటి కృష్ణమూర్తి (ఏలూరు)

మీరు ఎందుకు ప్రశ్నలు అడుగుతున్నట్టు? అందుకే...

మనదేశంలోని [illegible] మీ అభిప్రాయం ఏమిటండి?

కె. ఉషారాణి (తణుకు)

'వున్న కొద్ది ఆయుస్సులో, జీవితంలో అనుభవించవలసిన సుఖాలను కోల్పోయి, నిర్బంధ దుర్భర జీవితాన్ని అనుభవిస్తూ ఆర్థిక సమస్యలతోనే కొట్టుకుపోతున్నారే' అని బాధగావుంది.

ప్రేమకు చిహ్నం ఏమిటి? ఎలా వుంటుంది?

కేశవమూర్తి (విశాఖపట్నం)

నాకోసరం చిన్నత్యాగం..., మీరుసిగిరెట్లుమానెయ్యాలి.



ప్రేమకు చిహ్నం త్యాగం. కాని త్యాగంలాగ మాత్రం వుండదు.

సినీ వ్యసనలోలుడైన తన భర్తను గురించి బాధపడుతున్న భార్యకు ఫీజులేకుండా — [illegible]

మీ [illegible]?

పాండుకుమార్ (భువనేశ్వర్)




సలహాలు వూరికే రావు మిస్టర్, 'ఫీజుఫస్టు' సలహా సెకండ్.

ఇట్లు
పొట్టిప్లీడరు.

మీరు అకస్మాత్తుగా ప్రధానమంత్రి అయితే దేశాన్ని ఏవిధంగా పరిపాలిస్తారు?

బి. యస్. ఆర్. పూర్ణచంద్రరావు (కొల్లూరు)

"శ్రీ శ్రీ శ్రీ మర్యాద రామన్న"గా వస్తున్నాను. ఏ విధంగా పరిపాలిస్తానో మీరే చూడండి.

ఉత్తమ హాస్యనటుడిగా మీకుగల పేరు, ప్రఖ్యాతులను చూస్తుంటే నాకు బలే ఈర్ష్యగా వుందండి. ఎలాగైనా సినిమాలలోచేరి మీతో పోటీ చేయాలని వుంది.

బి. సురేష్‌బాబు (కావలి)

ఈర్ష్య మనిషికి ఉండకూడదు. మీకున్నదంటే నాకు చాల బాధగా

వుంది. అయినా పోటీ పడటానికి యిదే సుస్నా? ఈశ్వరవు పందెమా? లేక చెడుగుడు పందెమా?

జీవాత్మ, పరమాత్మ ఒకటే అని నేను. జీవాత్మ వేరు. పరమాత్మవేరు అని నా స్నేహితుడు. దీనికి మీరేమంటారు?

జి. బాబూరావు (గంటి)




“సర్వం మిథ్య” నాయనా! పైముకి టిఫిన్, కాఫీ, దండిగా భోజనం లేకపోతే ఏ ఆత్మాలేదు. ‘‘ఓం సచ్చిదానంద....’’

మీ జీవితంలోకల్లా మరపురాని సంఘటన ఏది? మీ...

సి. విజయకుమారి, (కర్నూలు)

రేఖా అండ్ మురళీ ఆర్ట్సు సంస్థ స్థాపించిన మొదట్లో రెండు మూడేళ్ళుగా నాటకాల్లో ఎప్పుడూ తీవ్రమైన నష్టమే కాని ప్రతిఫలం లేదు. ఒక నూతన సంవత్సరం నాకుగాను రు. 150-00లు మిగిలింది. ఆశ్చర్యానికి అంతులేదు. ఆనందానికి కూడా అంతే! ‘Central’ దిగగానే ప్రీ లగ్గేజ్ పాస్ లేదని రైల్వే వాళ్ళు రు. 150-00 Fine వేశారు. నాకు అయి మిగిలిన ఆ 150-00లు యీ కొత్తసంవత్సరం రోజున యీ రైల్వేవాళ్ళకి యివ్వాల్సి వచ్చిందే అని ‘సెంట్రల్’లో కన్నీరు గార్చాను.

మీరూ ఎలక్షన్లో ఎం. ఎల్. ఏ. గాను నించోవలసిందండి, నా ఓటు మీకే వేసివుండును కదా! ఎంతపొరపాటు చేశారు?

కె. శ్యామ్ (కుడుములగుమ్మ)

మీరు ఒక్కరే ఓటువేస్తే ఏం లాభం? మిగతావాళ్ళు కూడా ఓట్లు వెయ్యాలిగా? నా డిపాజిట్ సేఫ్! Thank you!

మొదట మానవుడు తన చేతులను ముడుచుకొని పుడతాడు. చివరకు తన చేతులను చాచి చనిపోతాడు. ఎందుకు?

జి. లక్ష్మీనారాయణ (కరీంనగరం)

“ఎందుకీ నరకంలోకి నన్ను పంపిస్తున్నావు భగవంతుడా!’’ అని దండం పెడ్తూ వస్తాడు. ‘‘స్వర్గసుఖం అనుభవించే అదృష్టం యిన్నాళ్ళకు ప్రాప్తించిందా! స్వామీ’’ అని హాయిగా చేతులు చాచి పోతాడు.

మన నటీమణులంతా ఉద్యోగస్థులను పెళ్లాడేస్తున్నారండి! ఎందువల్లనంటారు?

అయినేని నిర్మల (పోతురెడ్డిపల్లె)

నెలజీతాలు ‘Good’గావుంటాయి జీవితం ‘Better’గా వుంటుంది. ‘హోదా’ ‘best’గా వుంటుందని.

పద్మనాభం అంటే నాభియందు పద్మముగలవాడు అని అర్థం. అంటే విష్ణువుగదా? మీరు విష్ణుమూర్తి అయితే నాకు మోక్షం ప్రసాదిస్తారా?

కె. రామప్రసాద్ (కడప)




మీరు చేసిన పాపపుణ్యాల లిస్టు ఒకసారి పంపండి తనిఖీచేసి చెప్తాను.

### బహుమతిపొందిన ప్రశ్న

మానవులు సుఖము, ఐశ్వర్యము కలిగినపుడు సంతోషిస్తారు. కాని కష్టాలు ఎదురయినపుడు, దరిద్రమువచ్చినపుడు సంతోషించక విచారిస్తారు. ఎందుకు?

ఎస్. శ్యామసుందరరావు (రూర్కెలా)



పుట్టుక దగ్గర్నుంచీ, గిట్టేనంత వరకూ మానవుని జీవితరహస్యాన్ని ఏదో ఒక పుస్తకరూపంలో భగవంతుడు రచించివుంటాడు. రోజుకొక పేజీచొప్పున కథ జరిగిపోతూంటుంది. నవరసభరితమైన ఈ జీవితంలో సందర్భానుసారంగా సంతోషాన్ని, దుఃఖాన్ని నటిస్తూవుంటాడు మానవుడు.

కర్ణుడు గొప్పా? కవి గొప్పా? ఎవరు గొప్ప, ఎందువల్ల?

టి. రామచంద్రయ్య (బి. కొత్తకోట)

కర్ణుణ్ణి రాత్రింబవళ్ళు మేల్కొని కథ వ్రాయమనండి. పోనీ! కవిని ఎండలోపడి దున్నమనండి చూద్దాం! ఎవరి గొప్ప వాళ్ళది.

పద్మనాభం



జెమినీ సర్కస్ ప్రారంభంనాడు ప్రదర్శన చూడటానికి వచ్చిన సర్దార్ ఉజ్జల్ సింగ్, ఆయన సతీమణి బాబూభాయిషా, శ్రీ సహదేవన్, శ్రీ రాజన్.

# జెమినీ సర్కస్

ఇటీవల సోవియట్ రష్యా పర్యటించి వచ్చిన జెమినీ సర్కస్ బృందంవారు మద్రాసులో ఏప్రిల్ 23 వ తేదీ సాయంత్రం అరున్నర గంటలకు మద్రాసు గవర్నర్ సర్దార్ ఉజ్జల్‌సింగ్, ఆయన సతీమణి సమక్షంలో స్థానిక ఎస్. ఐ. ఏ. ఏ. మైదానంలో ప్రదర్శనను ప్రారంభించారు.

ఈ బృందంలోని వారిలో చాలామంది రష్యన్ నిపుణులచే తర్ఫీదు పొందినవారు. ప్రదర్శనలోని అన్ని అంశాలూ చాలా ఆకర్షణీయంగా, ప్రేక్షకుల్ని విస్మితుల్ని చేసే రీతిలో ఉన్నాయనటంలో అతిశయోక్తి లేదు. ముఖ్యంగా ముగ్గురమ్మాయిలు నిటవాలుగా ఉన్న తీగమీద ప్రదర్శించిన నైపుణ్యం అందర్నీ ఆశ్చర్యచకితుల్ని చేసింది.

ఇంతకుముందు ఏ సర్కస్ కంపెనీవారు రంగంలోకి తీసుకురాని నీటిగుర్రాన్ని, అడవి మనిషిని ప్రేక్షకులముందుకి తీసుకురావడం ఈ బృందంవారి ప్రత్యేకత.

ప్రదర్శనను తిలకించిన గవర్నర్, వారి సతీమణి తమ హర్షాన్ని, సంతృప్తిని ప్రదర్శించి సర్కస్ నిర్వాహకులను కృతజ్ఞతలు తెల్పారు.

— ఎం. ఆర్.



'ఉమ్మడికుటుంబం'లో యస్. వరలక్ష్మి, సావిత్రి, సూర్యకాంతం.

# చిత్రలహరి

పద్మశ్రీ పిక్చర్స్‌వారి 'ప్రాణమిత్రులు' కూడా నిర్మాణం పూర్తి అయింది. మే 5వ శ్రీ ఫిలింస్‌ద్వారా ఆంధ్ర అంతటా విడుదల కాగలదని తెలుస్తున్నది. నాగేశ్వరరావు, జగ్గయ్య, గుమ్మడి, సావిత్రి, కాంచన, గీతాంజలి, రేలంగి, గిరిజ, రావికొండల రావు, అల్లు రామలింగయ్య, శాంతకుమారి మొదలయినవారు నటించారు. కథ, మాటలు: ముళ్లపూడి వెంకటరమణ, సంగీతం: కె. వి. మహాదేవన్, కెమెరా: సెల్వరాజు, దర్శకుడు: పి. పుల్లయ్య, నిర్మాత: వి. వెంకటేశ్వర్లు.

* * *

ఆర్. కె. యస్. ప్రొడక్షన్స్ అనే కొత్త సంస్థ 'వయసు 18 జాగ్రత్త!' పేరుతో ఒకచిత్రం నిర్మించబోతున్నది. పి. వేణు రాసిన 'నేనే నెలవంక' 'చిట్టిపొట్టి పాపకు అమ్మలేదు ఎందుకు?' అన్న రెండు పాటలు ఏప్రిల్ మొదటితేదీన అరుణాచలం స్టూడియోలో రికార్డు చేశారు. మొదటిది బెంగుళూర్ లత, రెండవది ఎం. ఎస్. రాజేశ్వరి పాడారు. ఇంద్రబాబు అనే కొత్త సంగీత దర్శకుడు వీటికి చక్కటి వరుసలు చేసి, హృద్యంగమయిన వాయిద్యగోష్ఠిని అమర్చాడు. కొత్త తారలతో, కొత్తరహాకు చెందిన సస్పెన్స్ కథతో ఈ చిత్రాన్ని నిర్మించాలని, నిర్మాతల అభిలాష. నటీనటుల ఎన్నిక జరుగుతున్నది. మే లో సెట్స్‌కు వెళ్లగలరని తెలుస్తున్నది. మాటలు, పాటలు: పి. వేణు, కెమెరా, దర్శకత్వం పి. శ్రీధర్.

* * *

టైగర్ ప్రొడక్షన్స్‌వారి మూడవ చిత్రానికి "అసాధ్యుడు" అని నామకరణం చేశారు. ఈ చిత్రానికి గతనెల 19 నుంచి 25 వరకూ హార్సిలీ హిల్స్‌పైన అవుట్‌డోర్ షూటింగు జరిగింది. ఈ అవుట్‌డోర్ షెడ్యూల్లో కృష్ణ, కె. ఆర్. విజయలపై ఆరుద్ర రాసిన 'వెళ్లగలిగితే వెళ్లు' అనే పాటను చిత్రీకరించారు. కొన్ని దృశ్యాలు వీరిరువురితోను — గుండాల గుంపుతో మరికొన్ని దృశ్యాలు చిత్రీకరణ

గత ప్రాచీనకాలపు
విశిష్టతను
వెలార్చు వెల్లడించుచున్నవి.

ప్రశస్తమైన సుందరమగు మఫత్‌లాల్ గ్రూప్ వాయిల్స్. సాంప్రదాయ విరమణ-సాంప్రదాయ పునరోద్ధరణ




## మఫత్‌లాల్ గ్రూప్
## 2×2 వాయిల్స్ మరియు
## లినెన్

'టెరీన్'/కాటన్, 'టెరిలైజ్' మరియు
'మెఫినైజ్' క్వాలిటి

న్యూ శోరక్ (శోరక్) అహమదాబాద్ • న్యూ శోరక్ నడియాద్ • స్టాండర్డ్ • బొంబాయి. స్టాండర్డ్ (న్యూచైనా) బొంబాయి • స్టాండర్డ్, దెవాస్ • సాసూన్ బొంబాయి • సాసూన్ (న్యూ యూనియన్) బొంబాయి • సూరత్ కాటన్, సూరత్ • మఫత్‌లాల్ ఫైన్, నవసారి.

(LPE-Aiyars M. 154 TEL)

# చిత్రలహరి

జరిపారు. గుండాల గుంపు నాయకుడుగా వెల్లూరి కాంతారావు పహిల్వాన్ నటిస్తున్నారు. సంధ్యారాణి, వాణిశ్రీ, చలం, శశిరేఖ, ఉదయలక్ష్మి, రావి కొండలరావు, రాఘవయ్య, కనకం. మున్నగువారలు ముఖ్య భూమికల్లో ఉన్నారు. సంభాషణలు: ఆరుద్ర. పాటలు: ఆరుద్ర, సి. నారాయణరెడ్డి, సంగీతం: టి. చలపతిరావు, కెమెరా: వి. యస్. ఆర్. స్వామి, కూర్పు: ఎన్. ఎస్. ప్రకాశం, దర్శకుడు: వి. రామచంద్రరావు బి. ఏ. (ఆనర్స్), నిర్మాతలు: వెల్లూరి కాంతారావు, యస్. హెచ్. హుసేన్.



'గొల్లభామ'తో దేవిక.

* * *

డి. బి. యస్. ఫిలిమ్స్‌వారి "ప్రయివేటు మాస్టారు" చిత్రంలో కొత్తగాయకుడు యస్. పి. బాలసుబ్రహ్మణ్యం 'పాడుకో, పాడుకో—పాడుతూ చదువుకో!' అనే పాటను గతనెల 24,25,26 తేదీలలో విజయా స్టూడియోలో కాంచన, రామ్మోహన్, సుకన్యల మీద చిత్రీకరించారు. ఈ పాటను ఆరుద్ర రాశారు. కె. వి. మహదేవన్ సంగీతం సమకూర్చారు. ఇంతవరకు అయిదు పాటలు చిత్రీకరణ జరిపారు. పన్నెండురీళ్ళ చిత్రం తయారయింది. రామ్మోహన్, కృష్ణ, శోభన్‌బాబు (అతిథి), చలం, గుమ్మడి, నాగయ్య,

# స్నేహానుబంధం కిసాన్ స్క్వాష్‌తో




కిసాన్ స్క్వాష్ ఆధునాతన జీవిత విశ్రాంతుల అపూర్వ కల్పన! అహా! ఏం రుచి! ఉల్లాసవంతమైన నిచ్చెలులకు దీని ప్రత్యేకమైన రుచి ఓ త్రేజాన్ని కలిగిస్తుంది. సహజమైన విటమినులతో ఆరోగ్య దాయకంగా ఉంటుంది. నారింజ, నిమ్మ, మామిడి ఇంకా ఇతర రకాలనుండి మీకిష్టమైన దానిని వాడండి

భారతదేశంలో విస్తారంగా అమ్ముడుపోయే కిసాన్ స్క్వాష్‌లలో అసలు పళ్లరుచిని అనుభవిస్తారు.

కిసాన్ ప్రోడక్ట్స్ లిమిటెడ్ బెంగళూరు

కిసాన్ స్క్వాష్ బ్రిటానియా క్లబ్ స్నాక్స్‌తోను, పిక్‌నిక్‌లలోను ఎంతో రుచి!

# చిత్రలహరి

రేలంగి, కాంచన, సుకన్య, విజయలలిత, పుష్పకుమారి, సురభి బాలసరస్వతి, అల్లు రామలింగయ్య, రావికొండలరావు, పేకేటి మొదలయినవారు నటిస్తున్న యీ చిత్రానికి కథ, సంభాషణలు: ముళ్ళపూడి వెంకటరమణ రాశారు. పాటలు: ఆత్రేయ, ఆరుద్ర, సి. నారాయణరెడ్డి, దాశరధి. కళ: తోట, నృత్యాలు: కె. యస్. రెడ్డి, కెమెరా: కె. యస్. రామకృష్ణరావు, దర్శకుడు: కె. విశ్వనాథ్, నిర్మాతలు: డి. వి. నారాయణ, టి. వి. యస్. శాస్త్రి.

* * *

హైదరాబాద్‌కు చెందిన అర్చనా ఫిలిమ్స్ అనే కొత్త సంస్థ 'వింతమనిషి' పేరుతో వొక సముద్యాల సాంఘిక చిత్రాన్ని నిర్మించనున్నది. శోభన్‌బాబు, భారతి, చలం, గీతాంజలి, సూర్యకాంతం, బాలయ్య, ప్రభాకరరెడ్డి ముఖ్య భూమికలు పోషించగలరని తెలుస్తున్నది. ఈ చిత్ర దర్శకుడు స్టాన్లీ జాషువా. ఈ యువకుడు ఆర్. కె. స్టూడియోస్ (బొంబాయి)లో ఎడిటింగ్ శాఖలో పనిచేసి విశేషమయిన అనుభవం గడించారు. జిస్‌దేశ్‌మె గంగా బహతీహై, సంగమ్ చిత్రాలకు రాజకపూర్‌తో పాటు స్టాన్లీ జాషువా కూడా ఎడి



'సత్యమేజయం'లో వాణిశ్రీ.



'ఉమ్మడికుటుంబం'లో యన్.టి. రామారావు

అల్‌గా పనిచేశారు. ఇదివరలో వచ్చిన అవాడి, యిటీవల వచ్చిన జబ్‌జబ్ ఫూల్ ఖిలే చిత్రాలకూ ఎడిటర్‌గా వున్నారు. పూనా ప్రభుత్వం ఫిలిం యిన్‌స్టిట్యూట్‌లో శిక్షణ పొందిన పాల్ ప్రభాకర్ యీ చిత్రానికి కళా దర్శకత్వం నెరవుతున్నారు. మాటలు, పాటలు: రాజశ్రీ, సంగీతం: అశ్వద్ధామ, బొంబాయిలో రాధూకర్మార్కర్ దగ్గర ఆపరేటివ్‌గా పనిచేసిన 'కన్నా' యీ చిత్రాన్ని ఫోటోగ్రాఫ్ చేస్తారు. కథ, సినిమా అనుకరణ, నిర్మాణం, కూర్పు, దర్శకత్వం: స్వాన్లీ జాషువా. ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్: టి. యస్. సంపత్.

* * *

గత నెల 27న యీ "వింత మనిషి" చిత్రానికి సంబంధించిన మూడు పాటలను శారదా స్టూడియోలో సౌండ్‌యింజనీర్ వి. యస్. రంగస్వామి రికార్డు చేశారు. మొదటిది: "నీవూ నేనూ కలిసి, ఖుషీగా నిషాగా ఆడీ పాడాలి—లోకం లోనే చూడాలి!" అనేది. యుగళ గీతం. పి. సుశీల, పి. బి. శ్రీనివాస్ పాడారు. రెండవది: "ఒకటై మనం కలిసి పోవాలి, ఒకటే స్వరం కలిసి పాడాలి—జీవితం గారడీ, యవ్వనం సందడి!" అనేది. బృందగీతం. పి. బి. శ్రీనివాస్, రమణకుమారిలతో పాటు మరో నలుగురు అబ్బాయిలు, నలుగురు అమ్మాయిలు కలసి ఆలపించారు. మూడవది: 'కదిలిపోయే గాలిని నేను, కడలిలోని నావను నేను—దిక్కులేని, చింతలేని వింత మనిషిని నేను!" అనేది. పతాక గీతం. పి. బి. శ్రీనివాస్ పాడారు. మొదటిది భారతి, శోభన్‌బాబుల మీద; రెండవది చలం, గీతాంజలి తదితరులతోను, మూడవది శోభన్‌బాబుపైనా చిత్రీకరిస్తారు. ఈ మూడు గీతాలను రాజశ్రీ రాశారు. వాటికి అశ్వద్ధామ వాద్యంగమయిన వరుసలు వేసి, చక్కటి వాయిద్యఘోష్ఠిని అమర్చారు. మే మొదటి వారంలో అవుట్‌డోర్స్ (హైదరాబాద్)లో యీ పాటల చిత్రీకరణతో షూటింగు ప్రారంభమవుతుందని దర్శకుడు శ్రీ స్వాన్లీ చెప్పారు.

—మోహన్‌కుమార్

# త్వరలో ప్రారంభం!

# అధ్యక్షుని మరణం

రచన

## విలియం మాంచెస్టర్

త్వరలోనే ప్రపంచ ఖ్యాతిచెందిన విలియం మాంచెస్టర్ పుస్తకం 'అధ్యక్షుని మరణం' ఆంధ్రసచిత్ర వారపత్రిక పాఠకులకి అందచెయ్యబోతున్నామని తెలుపటానికి సంతోషిస్తున్నాము.

కీ. శే. జాన్. ఎఫ్. కెన్నెడీ హత్య చరిత్రని సమగ్రంగా రాయటానికి శ్రీ మాంచెస్టర్‌ని శ్రీమతి జాక్వలీన్ కెన్నెడీ, ఆమె కుటుంబంలోని ఇతరులూ నియమించారు. కాని ప్రచురణకి ముందే 'అధ్యక్షుని మరణం' ఎంతో వివాదాస్పదమయిపోయింది!

ఈ వివాదానికి సంబంధించిన వివరాలు పత్రికలలో ఇంతకి ముందే పడ్డాయి.

ఇప్పుడు తెలుగు పాఠకులకి అసలు పుస్తకమే చదివే అవకాశం కలుగబోతున్నది!

—సంపాదకుడు.

## మెదడుకి మేత

(48-వ పేజీ తరువాయి)

40,000చగ

200గ

200గ

టింకరగా ఉండవచ్చు. రెండవ ఆసామీ స్థలం చదరంగా ఉందని మనకు ఖచ్చితంగా తెలుసు. అందులో ప్రతి భుజము 200 గజాల పొడవు ఉంటుంది. అంటే వైశాల్యం 200 x 200=40,000 చదరపు గజాలు. మొదటి స్థలంకన్న రెండవది వైశాల్యంలో 200 రెట్లు పెద్దది! ●

## చచ్చినవాడిచావు

(47 వ పేజీ తరువాయి)

కుంటారు? ముఖ్యంగా పత్రికల వాళ్ళేమను కుంటారు? హుం. అని విసురుగా కారెక్కి వెళ్ళిపోయాడు ప్రెసిడెంటు. కార్యదర్శి, మిగతా కార్లు లేనివాళ్ళూ కాళ్ళీడ్చుకుంటూ నడచి వెళ్ళారు యెవరికీ తోచినట్లు వాళ్ళు.



అందరూ వెళ్ళిపోయాక [illegible] వీధిలోకి నడకసాగించాడు రామారావు. చచ్చి (లేచి)న వాడు వీధికి యింకో చివర నడచి వెళ్తూ కనిపించాడు. సందె గజాల దూరంలో వెంబడించాడు రామారావు. ఊరు చివరకు వెళ్ళారిద్దరూ. శ్మశానం సమీపించింది. దిక్కులు చూస్తున్నాడు చచ్చి (లేచి)న వాడు గబగబా అంగలు వేసుకుంటూ వాడిదగ్గరకు చేరాడు రామారావు. ఎటో చూస్తున్నాడు వాడు.

'అయితే నువ్వు చావలేదా గురూ?' అడిగాడు రామారావు.

'...'

'...?'

'హా హ్హా హ్హా హ్హా ...' బిగ్గరగా నవ్వాడు వాడు. ఉన్న పళాన దభాల్న నేల మీద పడ్డాడు. మళ్ళీ లేవలేదు. ఈ సారి నిజంగానే చచ్చాడు చచ్చినవాడు. చావాల్సిన చోటే చచ్చాడు.

రామారావు యెవరికీ ఫోనుచేయలేదు. ●

## న్యూఢిల్లీ లేఖ

(10 వ పేజీ తరువాయి)

ఉంటుంది. ముఖ్యంగా, రాజకీయ వాతావరణమే రాష్ట్రపతికి అధికారాన్ని వినియోగించమని సూచిస్తుంది."

ప్రధాని వ్యక్తిగతంగా ఎన్నుకున్న డాక్టర్ జాకీర్‌హుస్సేన్ శ్రీమతి గాంధీగారి వే రాజ్యాంగం పనిచేయనప్పుడు అనుసరిస్తారు. ఈ విషయానికి రాజస్థాన్ ఓ ఉదాహరణగా తీసుకోవచ్చు. రాష్ట్రపతి పాలనతో శ్రీ సుఖాడియాకి తన యిష్టప్రకారం సంచరించడానికి అవకాశంవచ్చింది. శాసన సభ్యులు వ్యక్తుల్లో జమ కట్టబడటంలేదు. ప్రస్తుతంవారు నల్లబజారుధరకు దొరికే వస్తువులైనారు. దేశంలో అధికారంకోసం పోరాటం తగినంతఉంది. దేశానికి కావలసింది స్థిరత్వం. అదే రాష్ట్రపతి ఎన్నికకు ఓటును నిర్ణయిస్తుంది, ●

శ్రీ జయప్రకాష్ నారాయణ్ అభ్యర్థనపై పోప్‌పాల్ 1,00,000 రూపాయలు బీహార్ క్షామనిధికి ఇచ్చారు. 'మనదేశంలో మతాధికారులు ఎందరు క్షామనిధికి విరాళం ఇచ్చారు?' అని అడిగారు ఒక ప్రముఖుడు. ●

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press: 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

